


రైతుల, మహిళల, దళితుల, బలహీనవర్గాల, యువకుల, ఇబ్బందులను, సమస్యలను స్వయంగా అర్థం చేసుకునే వేదిక 'రాజీవ్ పల్లెబాట'. గ్రామీణ వికాసం, రైతు శ్రేయస్సు, బలహీన వర్గాల సముద్ధరణ, పేదరిక నిర్మూలన ప్రధాన లక్ష్యాలుగా చేపట్టబడింది ఈ 'రాజీవ్ పల్లెబాట' కార్యక్రమం.

స్థానికులతో ముఖ్యమంత్రి డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారు నేరుగా మాట్లాడి, ప్రభుత్వ కార్యక్రమాలు ప్రజలకు ఏ మేరకు చేరుతున్నాయో తెలుసుకుని, అవసరమైతే అక్కడికక్కడే అధికారులకు ఆదేశాలు జారీ చేసే వేదిక ఈ 'రాజీవ్ పల్లెబాట'. ఊరూరా, వాడవాడలా పర్యటిస్తూ, ప్రజలను పలుకరిస్తూ, సమస్యలను పరిష్కరించే దిశలో ప్రయత్నమే ఈ 'రాజీవ్ పల్లెబాట'.

## రైతులకు ప్రభుత్వం అందిస్తున్న సహకారం

- రూ. 1100 కోట్లకు పైగా రైతుల విద్యుత్ బకాయిలు మాఫీ
- ఏటా రూ. 400 కోట్ల ఖర్చుతో రైతన్నకు ఉచిత విద్యుత్తు
- ప్రతి జిల్లా కేంద్రంలో ఏర్పాటైన 'హెల్ప్‌లైన్' ద్వారా రైతుల్లో ఆత్మస్థైర్యం పెంచడంతో పాటు, సహకార, వాణిజ్య బ్యాంకులు, వడ్డీ వ్యాపారస్థుల నుండి ఋణ సౌకర్యము పొందిన రైతులపై ఒత్తిడి లేకుండా చర్యలు
- ఆత్మ హత్యల బారిన పడిన రైతు కుటుంబాలకు పాత అప్పుల బకాయిల ఏకమొత్తం మాఫీకై రూ. 50,000; రూ. 1,00,000 ఆర్థిక సహాయం
- నాణ్యమైన పురుగు మందులు, ఎరువులు సరఫరా చేయుటకు చర్యలు, నకిలీ విత్తనాలు, పురుగు మందులు విక్రయించే వారిపై కఠిన చర్యలు
- వ్యవసాయ, అనుబంధ రంగాలతో సహా గత సంవత్సరం కంటే ఈ సంవత్సరం **30.90%** అధికంగా రూ. **23,479.20** కోట్ల ఋణ ప్రణాళిక
- ప్రస్తుత ఖరీఫ్ పంట కాలానికి సహకార, వాణిజ్య బ్యాంకుల నుంచి రూ. **11,205** కోట్ల పంట ఋణాల కేటాయింపు
- రూ. 40 కోట్ల సబ్సిడీతో నాణ్యమైన మరియు అవసరమైన వేరుశెనగ, సోయాచిక్కుడు విత్తనాల సరఫరా
- **90%** సబ్సిడీపై స్ప్రింక్లర్లు, డ్రిప్ పరికరాల సరఫరా

**రైతన్న నష్టాలపాలై నిరాశతో జీవించవలసిన పరిస్థితే ఇక తలెత్తదు. తొందరపడి, నిరాశకులోనై ఆత్మహత్యలకు పాల్పడవద్దని రైతు సోదరులకు విజ్ఞప్తి.**
***మీ ఆశలకు ప్రతిరూపం ఈ ప్రభుత్వం, మీ కంట నీరు చిందకుండా చూడడమే ప్రభుత్వ ధ్యేయం.***

# పల్లెపల్లెకు పయనం - రైతన్నలకు అభయం

జారీ చేసినవారు : సమాచార, పౌర సంబంధాల శాఖ

హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

69



ముఖచిత్రం
'ఇంట్లో శ్రీమతి వీధిలో కుమారి' లో
ఆర్తి ఛాబ్రియా



## హాస్యం











## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల ప్రత్యేకం




సినిమా పాటల ప్రత్యేకం
43, 44,45,46 పేజీల్లో




సినిమా పాటల ప్రత్యేకం 71, 72, 73, 74 పేజీల్లో




'హాసం' జూలై 1-15 సంచికలో శ్రీ ఎ.అశోక్ కుమార్‌రావుగారు సూచించిన విషయాన్ని చందాల కేశవదాసుగారి కుమార్తె శ్రీమతి ఆండాళ్ళమ్మ గారితో మనవి చేశాను. ఆవిడ ఎంతో శ్రమ, శ్రద్ధతీసుకుని వాస్తవం కనుగొని నాకు చెప్పినారు. ఆమె అన్నగారు కృష్ణమూర్తి గారి డైరీలో దొర్లిన పొరపాటు అది. శ్రీ చందాల కేశవదాసు 14-5-1956 దుర్ముఖి నామ సంవత్సర వైశాఖ శుద్ధపంచమి నాడు పరమపదించినారు. చక్కని సూచన చేసిన అశోక్‌కుమార్‌రావు గారికి ధన్యవాదాలు.

**-యమ్.పురుషోత్తమాచార్య,నల్గొండ.**

శ్రీ ఆచార్య తిరుమల గారి మరణవార్త, 'హాసం'లో ఆయన అందించిన "నవ్వుటద్దాలు" శీర్షికను రెగ్యులర్‌గా చదివిన నాలాంటి వాళ్లందరికీ మనోవేదన కలిగిస్తుంది. ప్రాచీనాధునిక సాహిత్య జగత్తులోని హాస్య నక్షత్రాలను తెంపి 'హాసం' ద్వారా వాటి వెలుగును ప్రత్యక్షంగా చూపించారాయన. 'మనిషిపోతే మాత్రమేమి మనసువుంటది...' అన్నారు ఆత్రేయ! కానీ ఆచార్య తిరుమల భౌతికంగా లేకపోయినా... ఆయన అందించిన సాహిత్య పరిమళాలు మాత్రం 'హాసం' ద్వారా నిరంతరం మమ్మల్ని తాకి... ఉత్తేజ పరుస్తుంటాయి!! ఆ సాహిత్యపిపాసికి... ఆ సాహిత్యకర్తకు... అశ్రునివాళి !!!

**- కంద్లకుంట శరత్‌చంద్ర, మహబూబ్‌నగర్**

1-15 జూన్,2004 వెనుక లోపలి కవర్ పేజీలో మా"గాన గంధర్వుడు" శ్రీ బాలు జన్మదిన సందర్భంగా వేసిన ఫొటోలో జీవకళ ఉట్టి పడుతోంది. సినీ కళాకారుల ప్రతి ఒక్కరి పుట్టిన రోజులు (కీర్తి శేషులైన వారితో సహా)మననం చేసుకోవడం ఒక్క మన 'హాసం'కే సాధ్యం. ఇది ఎప్పటికీ ఆపకండి. 'హాసం' దిన దిన ప్రవర్ధమానంగా వృద్ధి చెందాలని ఆశిస్తూ.

**- ఎబివిఎన్. రమేష్, వెల్లూరు.**

'హాసం' నేను రెగ్యులర్‌గా చదువుతాను. అన్ని శీర్షికలూ, కథలూ చాలా బాగుంటాయి. ఈ మధ్యన మీరు ప్రచురిస్తున్న "జంధ్యామారుతం" చాలా బాగుంటోంది. జంధ్యాల గూర్చి తెలుసుకొనేందుకు ఈ జంధ్యామారుతం చాలా ఉపయోగపడుతుంది. అలాగే "క"రాజు కథలు చాలా బాగున్నాయి. కథలో అంతర్లీనంగా ఒక నీతిని ప్రబోధిస్తున్నారు. చాలా సంతోషం. ఇంకా చెప్పాలంటే "ఆ పాత మధురం", "పెళ్ళి పుస్తకం"...ఇలా అన్ని బాగున్నాయి. మొత్తం పుస్తకం అంతా చదివేసి మళ్ళీ క్రొత్త సంచిక ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నాను. మొత్తంగా ఇంత "అమృతం" అందిస్తున్న 'హాసం' పత్రిక సిబ్బందికి నా నమస్కారములు.

**- సి.విజయకుమార్,విజయవాడ.**

సాహిత్యాభిమానుల్ని,సంగీతాభిమానుల్ని, అలరించే ఏకైక పక్షపత్రిక 'హాసం' అనడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. 'హాసం' 16-31 జూలై సంచిక "హ్యూమర్‌బాక్స్" శీర్షికలో నా జోక్స్ ప్రచురించినందుకు, బహుమతిగా నా కెంతో ఇష్టమైన పాటలు 'సత్యం' సిడిని బహుమతిగా పంపించినందుకు చాలా ఆనందంగా వుంది. ఇందుకు మీకు, సోహన్ మ్యూజిక్ వారికి నా కృతజ్ఞతలు.

**-వి.బాల స్వప్న,హైదరాబాద్.**

16-31 జూలై 'హాసం'లో 'కలిసివుంటే కలదు సుఖం' చిత్రంలోని మూడు పాటల గురించి యిచ్చిన లోపలి సమాచారం చాలా బాగుంది. ఇటువంటి తెలియని విషయాలు తెలియజేయడంలో శ్రీరాజాకి మంచి పట్టువుంది. ఆయనకు ఆయనే సాటి. 'ఆపాత/పాట మధురం' శీర్షిక కొంత కాలం తరువాత సమాప్తం కావచ్చు...... అప్పుడు ఎవరైనా ఈ శీర్షికలోని పాటలన్నింటిని పుస్తకం రూపంలో తీసుకునివస్తే ఎంత బాగుంటుందో అనిపిస్తుంది.

**-బి.శ్రీనివాసరావు,హైదరాబాదు.**

'హాసం' పత్రిక వస్తోందని తెలిసి ఆనందించి రావటం ప్రారంభించాక ఆనందానుభూతి సొంతం చేసుకున్న అనేకమంది 'హార్డ్‌కోర్' అభిమానుల్లో నేనూ ఒకణ్ణి. మొదటి సంచిక నుండి ఏదీ మిస్ కాకుండా కొని చదువుతూ దాచుకుంటున్న 'ప్రత్యేక'అభిమానుల్లో నా స్థానం సుస్థిరం. 'జంధ్యామారుతం'లో ఆసక్తికరమైన చిన్నచిన్న విషయాలు కూడా అందిస్తున్న 'పులగం' అభినందనీయులు.

**-కె.వి.యల్.నరసింహశాస్త్రి,హైదరాబాద్.**

నవ్వుల ఆరోగ్యాన్ని అందిస్తున్న "హాసం" అంటే నాకెంతో ప్రాణం. సంఖ్యాపరంగా 108 పత్రికలు పూర్తయిన తరువాత ఆ పత్రికలన్నీ వరుసగా ఒక అందమైన దండగా గ్రుచ్చి-మన ఆంధ్ర దేశంలోనో, తమిళనాడులోనో ఎక్కడో ఉన్న నిలువెత్తు నటరాజస్వామి మెడలో అలంకరించి షోడశోపచారములతో పూజ చేసి ఒక మరిచిపోలేని మహోత్సవాన్ని జరపాలని-రచయితలు, కళాకారులు ఆ ఉత్సవంలో నంది భృంగిల మాదిరి తలలూవుతూ నమస్కరించాలని నేను కలగన్నాను. ఇది భ్రమ కాకుండా ఉంటే ఇంత కన్నా ఘనమైన పుష్పాలు ఆ నటరాజస్వామికి అలంకరించటానికి ఏముంటాయి చెప్పండి. ఎందరి హృదయాల స్పందన ఆ పుస్తక పుష్పాలలో దాగుందో ఆ కళా మూర్తికే తెలుసు గనుక అస్తు.

**-కె. నాగేశ్వర్ రెడ్డి,జైపూర్(ఒరిస్సా)**

ముఖచిత్రం నుండి ముగింపు దాకా పత్రిక చాలా బాగుంది. ప్రముఖుల జన్మదినాల సందర్భంగా ప్రచురించే ప్రతి శీర్షిక, హ్యూమర్ బాక్స్ లోని జోక్స్ చాలా బాగుంటున్నాయి. 'జంధ్యామారుతం'లోని 'అహనాపెళ్ళంట' చిత్రం గుర్చి ప్రచురించినందుకు ఆనందంగా వుంది. పత్రికలోని శీర్షికలన్ని సూపర్బ్.

**-వై.ఆర్.నాయుడు,చిత్తూరు.**

'హాసం'ప్రారంభ సంచిక నుండి అన్ని సంచికలు బైండ్ చేయించి దాచుకొంటున్నాను. పూర్వం సినీమారంగం, నేడు 'హాసం' నాకు రిఫరెన్స్ బుక్స్‌లా ఉపయోగపడుతున్నాయి. ఇందులో బాగాలేదు అనే అవకాశం లేని పత్రిక 'హాసం'. సినారెగారి అంతరంగం బాగుంది.

**-ఆత్కూరి వెంకటసూర్యనారాయణరావు, హైదరాబాదు.**

16-31 జూలై 2004 సంచికలో నేను తొలిసారిగానే వ్రాసిన నా యొక్క జోక్స్ ప్రచురించినందుకు చాలా సంతోషంగా ఉంది. పత్రిక మార్కెట్‌లోకి విడుదల అయిన మూడవరోజే నా జోక్స్‌కు ప్రోత్సాహ బహుమతి "సత్యం" ఆడియో సిడిని 'హాసం' పత్రికతో పాటు పంపడం చాలా ఆనందం కలిగినది. 'హాసం' పత్రిక దిన దినం అభివృద్ధి చెంది మరెందరో పాఠకులు హృదయాలలో చోటు సంపాదించుకోవాలని ఆశిస్తున్నాను.

**-షేక్ అస్లాం షరీఫ్, మహబూబ్‌నగర్.**

హాస్య,సంగీత సాహిత్య ప్రియుల మనోరంజకంగా సాగుతున్న 'హాసం' పత్రికకు మా నమస్సుమాంజలి. గత సంచిక (జూలై 1-15) అంకిత ముఖచిత్రంతో వెలువడిన హాసంలో "పల్లకిలో..పెళ్ళికూతురు" చిత్రగీతాలు మమ్మల్నెంతగానో ఆకట్టుకున్నాయి. కను మరుగవుతున్న తెలుగు సినీ సాహిత్య ప్రభ తిరిగి ఈ గీతాలతో వెలుగొందగలదని ఆశిస్తున్నాము. ఈ చిత్ర గీతాలలో చంద్రబోస్‌గారి కలం విరజిమ్మిన వెన్నెల కిరణాలు మదిలో కూడా పదిలంగా దాచుకుంటాము. నిత్యనూతనంగా సాగే చంద్రబోస్‌గారి ఒరవడి ఈ గీతాలలో కొత్త పుంతలు తొక్కింది. సదా వీనులవిందయే సాహిత్యాన్ని 'ముద్రా రాక్షసాలు' లేకుండా సేకరించి ప్రచురించడం ముదావహం. సంగీత సాహిత్య వ్యాప్తికి హాసం సాగిస్తున్న అవిరళకృషి అభినందనీయం.

**-'నాపేరు చెప్పకోండి...'**

**('పల్లకిలో పెళ్ళికూతురు' లోని పాటలో లాగ)**

అభిరుచి గల పాఠకుల అభిమాన పత్రిక 'హాసం'కి మా అభినందనలు. అన్ని శీర్షికలు పాఠకులకు ఆనందాన్ని ఇచ్చేవే. ఎప్పుడూ మా 'హాసం' విజయపథంలో సాగాలని పాఠకులకు వీడని నేస్తంలా వుండాలని కోరుకుంటున్నా. ఇంక 'లలితసంగీతం' శీర్షికలో 16-31 నాటి 'హాసం' లో ఖరహరప్రియరాగంలో చిత్ర గీతాలను వివరిస్తూ 'స్వాతికిరణంలో' సంగీత సాహిత్య సమలంకృతే అన్న పాటని ఏసుదాసు గారు పాడారు అని వ్రాశారు. అది బాలుగారు పాడారు గమనించగలరు.

**-యస్.వాణీ స్వయంప్రభాదేవి,విశాఖపట్నం.**

**(మీలాగే చాలామంది రాశారు. మీరన్నదే కరెక్ట్. మాదే పొరపాటు. - ఎడిటర్)**

సంపుటి: 3 సంచిక:21

**1-15 ఆగస్టు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

రాజా

రిఫరెన్స్ కర్టెసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ

మేనేజర్

పి.గిరి

చీఫ్ లే-అవుట్ డిజైనర్

జి.రాజేష్

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

69

ఆచార్య తిరుమల ఇక లేరు. ఆయన కోలుకుంటారని, 'నవ్వుటద్దాలు' శీర్షిక ద్వారా 'హాసం' పాఠకులకు వినోదాన్ని, సాహితీ పరిజ్ఞానాన్ని మళ్లీ అందిస్తారని పెట్టుకున్న ఆశలు తుంచేస్తూ సాహితీప్రపంచాన్ని దిగాలుపరుస్తూ పరలోకగతులయ్యారు.

వారితో నా అనుబంధం ప్రారంభమయింది 'హాసం'తో కాదు! విద్యార్థిదశనుండీ ఉన్న ఆసక్తితో అందరి కవిత్వాలను ఆపోసనపట్టే క్రమంలో ఆచార్య తిరుమలపై మక్కువ పెరిగి హైదరాబాదు వస్తూనే ఒక మిత్రుడి సహాయంతో ఆయనను చూడడానికెళ్లాను. గౌరవాభిమానాలు ముప్పిరికొంటూండగా " బాగా రాయాలంటే ఏం చేయాలి..?" అని అడిగాను."రాయాలి.." అన్నారాయన. సరిగా వినిపించుకోలేదేమోననుకుంటూ ప్రశ్న రెట్టించాను. గాంభీర్యం ఎంతమాత్రం చెడకుండా నవ్వుతూ ఆయన మళ్లీ అదే సమాధానం ఇచ్చారు. "రాస్తూండాలి. అంతకంటె వేరే కిటుకు లేదు. రాస్తున్నకొద్దీ మెరుగవుతుంది." అన్నారు.

30 యేళ్లక్రితంనాటి ముచ్చట ఇది. ఆయన అలా అనడమే కాదు, ఇన్నేళ్లుగా ఆచరించి చూపారు. పద్యాలు, గేయాలు, లలితగీతం, వచనకవిత్వంతోపాటు ప్రాచీనాంధ్రకవిత్వానికి వ్యాఖ్యానాలు, వ్యాసాలు వ్రాసి మలేషియా, సింగపూర్, అమెరికా, జోర్డాన్, టర్కీ వంటి అనేక దేశాలలో పర్యటించి తెలుగు కవితా సౌరభాలను ప్రపంచమంతటా వెదజల్లారు.

భావుకత, ప్రతిభ, పాండిత్యం, విషయపరిజ్ఞానం అపారంగా కల ఆ 'కవి కౌస్తుభుడు' మౌలికంగా ఉపాధ్యాయుడు. యువకవులలో ఏపాటి ప్రతిభ కనబడినా వెన్నుదట్టి ప్రోత్సహించడంలో అగ్రగణ్యుడు.1981 లో వెలువడిన నా 'మెరుపంత' కవితాసంకలనం చూసి 'ఈ దశాబ్దంలో ఇటువంటి పుస్తకం రాలేదు, మీరు కూడా ఇటువంటిది బహుశా మళ్లీ సృష్టించలేరు'అని ఉత్తరం వ్రాశారు.

మెప్పుకూడా ఏదో అవతలివాడిని ఉద్ధరిస్తున్నట్టు కాకుండా సమాదరించి అక్కున చేర్చుకునే తత్త్వం వారిది. నన్నొక మిత్రుడిగా భావించి ఆయన వెలువరించిన ప్రతి పుస్తకం ఒక కాపీ నాకు పంపుతూ వచ్చారు. చిన్నా, పెద్దా అనేక స్వవిషయాలు నాతో పంచుకునేవారు. ఇది నా ఘనతగా చెప్పుకోవటం లేదు. సాహితీక్షేత్రంలో తనకంటె జూనియర్లగా ఉన్న నాలాంటి అనేకమందితో ఆయన ఇటువంటి సంబంధబాంధవ్యాలు నెరపారు. జంటనగరాలలో ఆయన పాల్గొనని సాహితీసభలు అరుదు.

నేను 'హాసం' సంపాదకబాధ్యతలు వహించి 'క్లాసిక్స్ రీటోల్డ్' శీర్షిక ద్వారా 'సాక్షి' వంటి పుస్తకాలను పరిచయం చేయడం జరిగిన తర్వాత పాతతరం పద్యాలను పాఠకులకు అందించాలనే ఉద్దేశ్యంతో ఆచార్య తిరుమల గారిని కోరడం జరిగింది. మొదటి రెండు వ్యాసాలు వెలువడ్డాక 'సార్, నేను మీనుండి ఆశించినది ఇది కాదు. పద్యాలు సేకరించి, సబ్జక్ట్‌వారీగా వివరిస్తారని భావించాను' అని నిర్మొగమాటంగా చెబితే ఆయన ఆ వ్యాఖ్యను సహృదయతతో స్వీకరించి 'భోజనాలపై పద్యాలు', 'శబ్దాల మీద నగిషీలు'.. ఇలాటి వ్యాసాలు రాసి పాఠకులకు మరింత చేరువయ్యారు.

వ్యాసాలకు వస్తున్న స్పందన చూసి పులకించిపోయి 'వీటిని పుస్తకంగా వేసి - ఐడియా ఇచ్చినందుకు గాను దాన్ని నీకు అంకితం ఇస్తాను' అంటూండేవారు. ఆయన అనారోగ్యం పాలయాక 'క్లాసిక్స్ రీటోల్డ్' శీర్షికను ఆపడం జరిగింది. పాఠకులకు కారణాలు వివరించే బాధ్యత ఉన్నా వ్యక్తిగత విషయాలు పత్రికాముఖంగా చెప్పడం మర్యాద కాదనుకోవడం వల్లనే ఆయన అనారోగ్యం సంగతి ప్రకటించలేదు. వ్రాయలేని పరిస్థితిలో ఉన్నారని తెలిసి 'డిక్టేట్ చేయండి, నేనే స్వయంగా నోట్స్ తీసుకుంటా, శీర్షిక కంటిన్యూ చేద్దాం' అని ఎంత బలవంతం చేసినా ఒప్పుకునేవారు కారు. 'నా వేళ్లతో వ్రాస్తేనే నాకు తృప్తి. కానీ వేళ్లు సహకరించటం లేదు, ఏం చెయ్యమంటావ్' అనేవారు. ఏం వ్రాసినా మనస్ఫూర్తిగా తృప్తిపడుతూనే వ్రాయాలని, లేకపోతే ఊరుకోవాలని ఆయన అనుకునేవారని చెప్పడానికి ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే!

నా తరపున, 'నవ్వుటద్దాలు' మెచ్చిన 'హాసం' పాఠకుల తరపున
ఆచార్య తిరుమల స్మృతికి అంజలి ఘటిస్తూ - రాజా



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

# కరాజు కథలు 18

# కుమార సంబరం

కరాజు రాజ్యం సత్పరిపాలనకు పెట్టింది పేరు. కానీ ఈ మధ్య మంత్రికి ఒక దిగులు పుట్టుకుంది. ఈ మంచి పేరు శాశ్వతంగా ఉంటుందా అని. అతని భయానికి కారణాలు లేకపోలేదు. ఇప్పటి ప్రజలకు ప్రభుత్వాధికారుల మీద మునుపటి లాగా గౌరవం గానీ, నమ్మకం గానీ లేదన్న వాస్తవం అందరూ ఒప్పుకోవల్సిందే. మరి దీనికి కారణం ఏమిటని తరచి చూస్తే, మంత్రి గారికి అర్థం అయింది.

వెనుకటి రోజుల్లో ఊళ్ళు చిన్నవీ, జనాభా తక్కువ గనక అక్కడి పెద్ద వాళ్ళంతా ప్రఖ్యాతులే, అందరికీ తెలిసిన వారే. అందుకని అందరూ వాళ్ళను గౌరవించేవాళ్ళు. కానీ ఆ ఊళ్ళన్నీ ఇప్పుడు మహానగరాలయ్యాయి. జనాభా అమితంగా పెరిగింది. ఇందులో బహుకొద్ది మంది మేధావులయిన ప్రముఖులను తీసేస్తే, మిగిలిన అధికారులంతా తప్పనిసరి ప్రఖ్యాతులై ఉండాలి. ఈ విషయాన్ని తన సహాయమంత్రి సహదేవయ్యతో చర్చించాడు.

"కానీ ఉన్న ప్రఖ్యాతులలంతా వయసు మళ్ళినవారు, ఇంకో నాలుగేళ్ళు పోతే వీళ్లుండరు సరికదా, వాళ్ళ జాతే మన రాజ్యంలో ఉండదు" అన్నాడు సహదేవయ్య.

ఇది వినగానే మంత్రికి భవిష్యత్తును గురించిన కొత్త భయం పుట్టుకుంది. తన భయాన్ని కరాజుకు చెప్పుకున్నాడు. కరాజు దీర్ఘంగా ఆలోచించి, చివరకు వికసిత వదనంతో "మంత్రీ, మీరనుకున్నట్టు రాబోయే కాలాల్లో ప్రఖ్యాతులైన అధికారులు రావాలంటె దానికి ఇప్పట్నుంచే తగు ప్రయత్నాలు చెయ్యాలి. అంటే నేటి యువకుల్లో రేపటి ప్రఖ్యాతులెవరో కనిపెట్టి, వాళ్ళనిప్పుడే రాజ్యాధికారాల దోవలో పెట్టాలి. ఇలా ప్రతి ఏడూ ఎంపిక చేస్తే, రాజ్యంలో సత్పరిపాలనకు ఎటువంటి ఆటంకమూ ఉండదు" అన్నాడు. కరాజు అజ్ఞను ఆచరణలో పెట్టడానికి ఉద్యుక్తుడయ్యాడు మంత్రి.

రేపటి ప్రఖ్యాతులను కనిపెట్టమని కరాజేమో సులభంగా చెప్పేసాడు - కానీ వాళ్ళెవరు? ఎక్కడున్నారు? అది కనిపెట్టడం ఎలా? అన్నిటికంటె ముఖ్యం - అసలు ప్రఖ్యాతులంటె ఎవరు? రాత్రంతా ఆలోచించగా మంత్రికి ఒక రకమయిన అవగాహన ఏర్పడింది. అదేమిటంటే, ఎవర్నయితే ఎక్కువ మంది జనం మెచ్చుకుంటారో వాళ్ళంతా ప్రఖ్యాతులే.

ప్రఖ్యాతులు వేరు, ప్రతిభావంతులు వేరు. ప్రతిభావంతులందరూ ప్రఖ్యాతులు కానక్కర్లేదు. కానీ, ప్రఖ్యాతులు మాత్రం తప్పనిసరి ప్రతిభావంతులే. ఈ సూక్ష్మం తెలుసుకున్న మరుక్షణం మంత్రి తన సహాయకులను పిలిపించి వాళ్ళతో చర్చలు జరిపాడు. ఈ చర్చల్లో తేలిందేమిటంటే, రాజ్యంలోని ప్రఖ్యాతుల్లో అధికశాతం కళాకారులు. అయితే వారిలో సాహిత్యానికి సంబంధించిన వారు చాలా తక్కువ. చిత్రకారులు, శిల్పులు కూడా అంతే. సంగీతానికి సంబంధించిన వారు కొంత మెరుగు. కానీ నిస్సందేహంగా జన బాహుళ్యాన్ని విపరీతంగా ఆకర్షించేవారు నటులే. జనం వాళ్ళను సకల కళా సంపన్నులుగా చూస్తారు. వాళ్ళు పలికే సంభాషణల్లో సాహిత్యం ఉంది. వాళ్ళు పాడే పాటల్లో సంగీతం ఉంది. వాళ్ళు వేసుకునే దుస్తుల్లో, వాళ్ళ వెనక చిత్రకళ, శిల్పకళ కనిపిస్తూనే ఉంటుంది. ఇన్ని హంగులున్నాయి గనుకనే నటులంటే జనానికి అంత అభిమానం.

"ఈనాటి యువకుల్లో ఉత్తమ నటులైన వాళ్ళను ఎంపిక చేస్తే, వాళ్ళు రాబోయే కాలంలో ప్రఖ్యాతులై, రాజ్యాధికారాల్ని చేపట్టటానికి అర్హులై ఉంటారు'' అన్నాడు మంత్రి. సహాయమంత్రులంతా కరతాళ ధ్వనులతో తమ ఆమోదాన్ని తెలియపరిచారు.

భరతవర్మ అనే వ్యక్తి గత యాభై సంవత్సరాలుగా నాటక కళ కోసం తన సర్వస్వం ధారపోసాడు. అందరూ అతన్ని భరతముని అంటారు. ఎందరో యువకులకు నటనలో శిక్షణనిచ్చి, వారిచేత అసంఖ్యాకమయిన ఉత్తమ నాటకాలను వేయించాడు. ఈ ప్రక్రియలో అతనేం సంపాదించలేదు సరికదా, ఉన్న కొద్దిపాటి ఆస్తిని కూడా నాటక కళా పోషణకే అర్పించుకున్నాడు. అతని శిష్యులు అప్పుడప్పుడు అతనికిచ్చుకునే చిన్న దక్షిణలతో అతను తన జీవితాన్ని కొనసాగిస్తున్నాడు. ఇప్పుడు మంత్రిగారి కొత్త పథకం ప్రకారం ప్రతిభావంతులైన యువనటుల్ని ఎంపిక చేసే ప్రక్రియలో అందరికళ్ళు మొట్టమొదట భరతముని మీద పడ్డాయి. దేశం అంతా వెతకక్కర్లేదు. ఉన్న ప్రతిభావంతులంతా భరతముని ఆశ్రమంలోనే ఉన్నారని అందరూ నిర్ధారించుకున్నారు.

ఈ వార్త విన్న భరతముని ఆనందానికి అవధుల్లేవు. ఇన్నేళ్ళు తను పడ్డ శ్రమకు ఇప్పుడు ఫలితం దొరికిందని సంతోషించాడు. తన శిష్యుల్లో ఉత్తమ శ్రేణిలో ఉన్న యాభై మంది యువ నటులను ఎంపిక చేసి, వారికి ప్రత్యేకంగా శిక్షణ ఇవ్వాలనుకున్నాడు. వారిలో పదిహేను మందికి ప్రభుత్వోద్యోగాలు వస్తే, తనకంతకంటే కావలసిందేదీ లేదనుకున్నాడు.

కాకపోతే మంత్రిగారు మాత్రం రాజ్యంలో భరతమునే కాక ఏమూలనైనా అర్హులైన వారుండొచ్చు కదా అనుకొని, దానికను గుణ్యంగా ముందు "యువనటులు కావలెను" అని ఒక ప్రకటన జారీ చేయబోయి, చటుక్కున 'మనకు కావలసింది ప్రఖ్యాతులు కాదగ్గవారు కదా' అని జ్ఞాపకం తెచ్చుకొని, ప్రకటనను కొద్దిగా మార్పించి, "ఎక్కువ జనాన్ని ఆకర్షించగల యువనటులు కావలెను" అని ఇప్పించాడు. దాంతో అతని సమస్యలన్నీ తీరిపోతాయను కున్నాడు మంత్రి.

ఈ ప్రకటనను చూసిన భరతముని తన శిష్యుల నాటకాలను ఎక్కడ ప్రదర్శించాలా అని

ఆలోచించాడు. పెద్ద పెద్ద వేదికలు, కళ్యాణ మంటపాలకు చాలా డబ్బు కట్టాలి. అంత డబ్బు తన దగ్గర లేదు. చివరకు రంగనాథస్వామి ఆలయంలో ప్రదర్శించేట్టు తీర్మానించుకున్నాడు. రంగనాథస్వామి ఆలయం నగరంలో అతి పెద్దగుడి. లోపల ఉత్తరాన గుడికీ, ప్రహరీ గోడకు మధ్య చాలా ఖాళీ స్థలం ఉంది. అక్కడ ఎంతమందైనా కూర్చొని చూడొచ్చు. దీని చివర ఒక విశాలమయిన మంటపం ఉంది. అది నాటకాన్ని ప్రదర్శించడానికి అనుకూలంగా ఉంది. భరతముని కోరికను గుడి పూజారి వెంటనే అంగీకరించాడు. ఆ రోజైనా ఎక్కువ దక్షిణలు ముట్టగలవని అతని సంతోషం. కాకపోతే, భరతముని గానీ, అతని శిష్యులు గానీ ఉత్సాహవంతులైన కళాకారులే గాని, వ్యాపారాల మెళకువలు తెలిసినవారు కారు. రాబోయే కాలంలో ప్రభుత్వోద్యోగాలు చేతికొస్తాయంటే అదేదో ఒక హోదా అనుకున్నారే తప్ప, దాని వెనుక ఒక బంగారు గని ఉన్నదనే సత్యాన్ని వారు గ్రహించలేదు. అది గ్రహించాలంటే ఒక సూక్ష్మమయిన వ్యాపార దృక్పథం ఉండాలి. అలాంటి దృక్పథం ఉన్నవారే ఇప్పుడు నగరంలో పెద్దలుగా వెలుగుతున్నారు. వీళ్లంతా ధనవంతులు. ఆస్తిపరులు. రాజ్యంలో పలుకుబడి గలవారు. భరతముని చూడలేని బంగారు గనిని వీళ్లు స్పష్టంగా చూడగలిగారు. ఇప్పుడు వీళ్లంతా ఈ కొత్త పథకాన్ని గురించి కాస్త లోతుగా ఆలోచించడం మొదలెట్టారు.

భవిష్యత్తులో రాజ్యపాలనలోని పెత్తనం తమ చేతుల్లో ఉండాలంటే ఒకటే మార్గం. తమ కొడుకులనే భావి ప్రఖ్యాతులుగా లోకం ముందు ప్రతిష్ఠించాలి. ఈ ఆలోచన రాగానే యుక్త వయస్సుకొచ్చిన కుర్రాళ్ళ తండ్రులంతా సంతోషించారు. కొడుకులు లేని వాళ్ళంతా తమకు దక్కింది ఇంతేననుకుంటూ వేదాంత ధోరణిలో చింతించారు. కొడుకులు యాభై మంది వరకు ఉన్నారు. వీళ్ళందర్నీ ముందుకు తొయ్యడానికి వారి వారి తండ్రులు ప్రయత్నాలు చేయసాగారు. ఈ కుమారులంతా సుకుమారులు. ఎప్పుడూ కష్టపడి ఎరుగరు. అయినా వ్యాపారదృష్టి పుట్టినప్పట్నుంచే వాళ్ళల్లో కూడా అబ్బి ఉండడం వలన, నటనాభ్యాస్యాన్ని వాళ్ళకు తట్టిన సులభ పద్ధతుల్లో సాగించారు.

ప్రభుత్వం నుంచి ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఫలానా పంచమి నాడు మొదలయ్యే అయిదు రోజుల నాటకోత్సవంలో యువకులు పాల్గొని, జన బాహుళ్యానికి వాళ్ళమీద ఉన్న ఆకర్షణను ఋజువు చేసుకోవాలి. వీరి నాటకాలను నవీక్షించి, వీరిలో నెగ్గిన పన్నెండు గురికి భావి ప్రఖ్యాతులనే పట్టంకట్టి, రాజ్యాధికారపు మొదటి మెట్టులో నియమిస్తారు. ఆపై అనుభవంలో వాళ్ళు క్రమేపీ మెట్లెక్కు తారన్నమాట.

అటు భరతముని శిష్యులు ఉన్నతస్థాయిలో, గుడిలో రోజూ నాటకాభ్యాసం చేస్తుంటే సుకుమారులకు మాత్రం ఈ ప్రక్రియ మింగుడు పడడం లేదు. బొమ్మల్లాగా నిలబడి సంభాషణలను అప్పచెప్పడమో, నృత్యం పేరిట కోతిగంతులెయ్యడమో చేస్తున్నారు. మరికొందరు పాడ్తుంటే ఎటువంటి శృంగార గీతమైనా విషాదగీతంలా వినిపిస్తోంది. లేదా ఎవరిమీదో తగాదాకు ఉరుకుతున్నట్టుంది. వ్యాపార నిపుణులైన తండ్రులకు, కొడుకుల దోషాలు తెలియక పోలేదు.

పైకి బాగుందని గాంభీర్యాన్ని ప్రకటిస్తున్నా, కొడుకుల నాటకాలకు జనాన్ని ఎలా ఆకర్షించాలా అనే ఆలోచనలో నిమగ్నులయ్యారు. తండ్రుల మధ్య పోటీ పెరిగింది. నగరంలోని పెద్ద కళ్యాణ మంటపాలను, నాటక వేదికలను ఎవరికి దొరికింది వాళ్ళు ఎక్కువ డబ్బిచ్చి ప్రదర్శన రోజుకు ఖరారు చేసుకున్నారు. ఇది దొరకని వాళ్ళు ఖాళీ ప్రదేశాల్లో తావే వేదికలను నిర్మించుకున్నారు. ఇలాంటివి భరతమునికి సాధ్యం కాదు గనుక గుడిలోనే తమ కార్యకలాపాల్ని నిర్వహించడం అతనికి తప్పనిసరి అయింది.

జనాన్ని ఆకర్షించేందుకు



తండ్రులూ, కుమారులూ కలిసి వారి వారి శక్త్యానుసారం వారి నాటకాల్లో రకరకాల హంగుల్ని జతచేయసాగారు. ఇప్పుడు కుమారుల ప్రదర్శనల కన్నా, వాటిచుట్టూ అల్లుకున్న ఆర్భాటాలు జనాన్ని ఎక్కువగా ఆకర్షించాయి.

వాటిలో ముందు చెప్పుకోవలసింది నాటక ప్రాంగణంలో చేయబడ్డ అలంకరణలు. ఒకరు రంగురంగు పూల పందిర్లతో అలంకరిస్తే, మరొకరు వందలాది దీపాలతో అలంకరించారు. ఒకరు స్వాగతం పలికే సుందరాంగుల బొమ్మలను పెడ్తే, మరొకరు ఏకంగా సుందరాంగుల్నే పెట్టేరు. ఒకరేమో వచ్చిన ప్రేక్షకులకందరికీ పానకాలివ్వడానికి ఏర్పాట్లు చేసారు. ఈ వింతల్ని చూడడానికి జనం రాజ్యంలోని మారుమూలల్లోంచి వచ్చి నగరం చేరుకున్నారు. నాటకాలాడే చోట్లను గురించి చర్చించుకుంటూ ఉదయం ఇక్కడ, సాయంత్రం అక్కడ, రాత్రి మరోచోట అంటూ వాళ్ళ కార్యక్రమాలను నిర్ణయించుకున్నారే గాని గుడిలోని భరతముని బృందాన్ని గురించి అనుకున్న వాడొక్కడూ లేడు.




పంచమినాడు ప్రదర్శనలు ప్రారంభం అయ్యాయి. వివిధ కుమారుల నాటకాలకు జనం ఎగబడి వస్తున్నారు. ప్రాంగణంలోని అలంకారాలే కాకుండా, నాటకాల్లో కూడా ఎన్నో హంగులు జతపరిచారు. ఒక కుమారుడు అంతకుముందెవ్వరూ ధరించని ఖరీదైన వస్త్రాభరణాలతో దర్శనమిచ్చాడు. అతని సహజాకారం ఎలా ఉన్నా, ఈ సొగసులు వాటిని కప్పేసాయి. అతను మాట్లాడే తీరు పేలవంగా ఉన్నా, జనం అదేమీ పట్టించుకోకుండా అతని దుస్తులను చూస్తుండిపోయారు. మరొక నాటకం కుమారుడొకచోట కూర్చొనుంటాడు. ఏమీ చెయ్యడు. అతని చుట్టూన్న వాళ్ళంతా పెద్ద పెద్ద వాక్యాలతో, 'నీకంటె గొప్పవాడు లేడు' అంటూ అతని పొగుడ్తూ ఉంటారు. ఎవరెన్ని మాట్లాడినా కుమారుడు మాత్రం పలికేది రెండే ముక్కలు. "అది మీ అభిమానం" అని. ఆ రెండు ముక్కలతో అతనా నాటకానికి నాయకుడు. మరొక చోట చాలామంది నృత్యం చేస్తూ, పాడ్తూ వాళ్ళ నాయకుడైన కుమారుణ్ణి అందలం ఎక్కిస్తున్నారు. ఎలాగైతేనేం, ఎన్నెన్నో హంగులు సంతరించుకున్న ఈ నాటకాలన్నీ విశేషమయిన ప్రజాదరణకు నోచుకున్నాయి.

ఇదిలా ఉంటే గుడిలోని భరతముని శిష్యుల ప్రదర్శనల్ని చూడడానికి ఒక్కరు కూడా రాలేదు. మామూలుగా అయితే వాళ్ళ నాటకాలను మెచ్చుకునే విజ్ఞులు కొంతమంది ఉన్నారు. అయితే వాళ్ళకు జనం అంటె గిట్టదు. ఈ నాటకాలకు జనం విరగబడి వస్తారేమోనన్న భయంతో వాళ్ళు రాలేదు. నాలుగురోజులైనా ఎవ్వరూ రాకపోయేసరికి అక్కడి యువకులకందరికీ ఎనలేని నిరాశ కలిగింది. పూజారికేమో ఆశించిన దక్షిణలు చిక్కలేదేనన్న చింత. చివరిరోజున కూడా ఎవ్వరూ రాకపోయే సరికి వాళ్ళకొక ఆలోచన వచ్చింది. వాళ్ళ నాటకాన్ని, వాళ్ళముందూ, వీళ్ళముందూ కాకుండా సాక్షాత్తు రంగనాథస్వామి ఎదుటే ప్రదర్శించాలని నిశ్చయించారు. వెంటనే స్వామికి ఎదురుగా నిలబడి, సూర్యాస్తమయం వరకు ఒక్కొక్కరుగా ద్విగుణీకృతమయిన ఉత్సాహంతో వారి వారి పాత్రలను పోషించారు. పడుకున్న రంగనాథస్వామి ఒకసారైనా కళ్ళు తెరచి చూసాడా? చూసుండొచ్చు - చూసుండకపోవచ్చు. యువకులు మాత్రం అదేం పట్టించుకోకుండా నాటకాన్ని ముగించారు.

మంత్రి సందిగ్ధంలో పడ్డాడు.

జనాన్ని లాక్కోగలిగిన వాళ్ళు పనికిరాని వాళ్ళుగా తేలింది.

పనికొచ్చే వాళ్ళేమో జనాన్ని లాగే చాకచక్యం లేని వాళ్ళాయె.

అధికారి అనేవాడికి ఈ రెండూ అవసరమే. ఇప్పుడెవరిని ఎంపిక చేస్కోవాలి? దీనికి పరిష్కార మార్గం తోచక మంత్రి సరాసరి కరాజు దగ్గరకు పరుగెత్తి జరిగిందంతా వివరంగా చెప్పాడు.

కరాజు దీర్ఘంగా ఆలోచించి, "మంత్రీ ఇది నాటకాల సమస్య కాదు. రాజకీయ సమస్య" అన్నాడు.

"రాజకీయ సమస్యా?" అన్నాడు మంత్రి కంగారుగా.

"అవును. ఒక వర్గానికి జనబాహుళ్యం మద్దతు ఉంది. కానీ విజ్ఞుల మద్దతు లేదు. రెండవ వర్గానికి జనం మద్దతు లేదు. విజ్ఞుల మద్దతు ఉంది. అయితే మనకు రెండు వర్గాలూ కావలసినవాళ్ళే"

"మరిప్పుడేం చేయమంటారు మహారాజా!"

"ఏముంది? సూక్ష్మంలో మోక్షం. - "నాటకాల సమీక్ష" అనే ప్రక్రియ మిగిలుందిగా. ఇప్పుడు కుమారుల నాటకాల్ని భరతముని వారిని సమీక్షించమనండి - ఎక్కడ చెడ్డగా సమీక్షిస్తారోనని కుమారులు భయపడి, భరతముని వారిని మంచి చేస్కుంటారు. వ్యాపారదక్షులు గనక బేరం పెట్తారు. మంచి సమీక్షలు రాస్తే మాకొచ్చే ఉద్యోగాలలో సగం వాటా మీకిస్తామంటారు. దానికి భరతముని వారు వెంటనే ఒప్పుకుంటారు. దీంతో ఇరువర్గాల వారూ మన ప్రమేయమే లేకుండా ఉద్యోగాలను సమానంగా పంచుకుంటారు. - సర్వేజనా సుఖినోభవంతు!"

కరాజు రాజకీయ విజ్ఞతను మెచ్చుకుంటూ ఇంటికి బయలుదేరాడు మంత్రి.



జులై 23, 2004 న కన్నుమూసిన మెహమూద్ స్మృతికి నివాళిగా....

# మరణంలోనూ వీడని దక్షిణాది అనుబంధం

గత పక్షం జులై 23 న పెన్సిల్వేనియాలో తన 72 వ యేట మరణించిన హాస్యనటుడు, నిర్మాత, దర్శకుడు మెహమూద్‌కు దక్షిణాది చిత్రరంగంతో ఉన్న అనుబంధం తక్కువది కాదు. అతను నిలదొక్కుకోవడానికి, పైకి రావడానికి దక్షిణాది దర్శకనిర్మాతలు ఎంతో దోహదపడ్డారు. దానికి తగ్గట్టు మెహమూద్ సైతం దక్షిణాదివారంటే ఎంతో మక్కువ చూపేవాడు.

తన తండ్రి ముంతాజ్ అలీ నటుడు, డాన్సర్ అయినా, సోదరి మినూ ముంతాజ్ నటీమణి అయినా, హీరోయిన్ మీనాకుమారి వదిన గారయినా మెహమూద్‌కు కలిసివచ్చినదేమీ లేదు. వేషాలకోసం అతను ఎంతో తిరగవలసివచ్చింది. తొలిరోజుల్లో 'ప్యాసా' (1957) లో హీరో సోదరుడి పాత్ర ఇచ్చి ప్రోత్సహించిన ఆ సినిమా దర్శకనిర్మాత గురుదత్ దక్షిణాది వాడే! 'పర్‌వరిష్' (1958) లో పెద్దపాత్ర లభించడంతో అతనికి మంచి గుర్తింపు వచ్చినా అతని జాతకాన్ని మార్చేసిన 'ఛోటీ బెహన్' (1959) ఎల్.వి.ప్రసాద్ తీసిన 'నా చెల్లెలు' హిందీ రీమేక్.

మెహమూద్ తిరుగులేని హాస్యనటుడిగా స్థిరపడినది 'ససురాల్' (1961) సినిమాతోనే! అది ఎల్.వి.ప్రసాద్ శిష్యుడు తాతినేని ప్రకాశరావు దర్శకత్వం వహించిన 'ఇల్లరికం' సినిమాకు రీమేక్! ఆ సినిమాలో జోడీగా నటించిన శుభాఖోటేతో కలిసి ఆ తర్వాత అనేక సినిమాలలో నటించాడు. అక్కడితో ప్రారంభమయిన అతని విజయయాత్ర దాదాపు రెండున్నర దశాబ్దాలపాటు సాగి నిర్మాతగా, దర్శకుడిగా ఎదిగేందుకు ఉపకరించినా అతను మద్రాసు చిత్రసీమతో ఎన్నడూ సంబంధాలను విడనాడలేదు. బొంబాయితారలు చాలామంది మద్రాసులో తయారయ్యే హిందీ సినిమాలలో నటించడానికి ఇష్టపడేవారు కారు. పారితోషికం బాగానే ఇచ్చినా టైముప్రకారం షూటింగుకి రావాలనేది మద్రాసు నిర్మాతల నిబంధన! డైరక్టు సినిమాలు తీయకుండా తెలుగు, తమిళ రీమేక్‌లు నిర్మిస్తూ ఒరిజినల్‌లో నటించిన తారలను అనుకరించమనేవారు. ఇవి ఒంటికి పడని బొంబాయి తారలు మద్రాసు ఉక్క భరించలేమంటూ ఆఫర్లు తిరస్కరించేవారు. సునీల్‌దత్, జితేంద్ర వంటి క్రమశిక్షణగల హీరోలు మాత్రమే దక్షిణాదివారి సినిమాలలో నటించేవారు. మెహమూద్ కూడా వారిలో ఒకడు. మెహమూద్ లేని సౌత్ రీమేక్ సినిమా ఆ రోజుల్లో లేదంటే అతిశయోక్తి కాదు.

బొంబాయిలో పుట్టిన మెహమూద్ దక్షిణాది వారి మాటతీరును, ఆచారాలను, సినిమాలను బాగా పరిశీలించేవాడు. హైదరాబాదు యాసను



చరమాంకంలో మెహమూద్

* రమారమి 300 సినిమాలలో నటన
* దర్శకత్వం వహించిన ఆఖరి చిత్రం 'దుశ్మన్ దునియాకీ'
* అమితాబ్‌బచ్చన్‌కు ఆశ్రయం ఇచ్చి 'బాంబే టు గోవా' ద్వారా హీరోగా పరిచయం చేసింది మెహమూదే!
* ఆర్.డి.బర్మన్‌కు 3 సినిమాలు ఒక్కసారిగా ఆఫర్ చేసి తెరకు పరిచయం చేసింది మెహమూదే! (వివరాలకు హాసం 48వ సంచిక)
* 'పడోసన్'లో వేషం కిశోర్‌కుమార్ మాత్రమే వేయగలడని నమ్మి అతను కోరిన పారితోషికం చాలా ఎక్కువైనా సరే ఇచ్చాడు (వివరాలకు హాసం 35వ సంచిక)
* ఆర్.డి.బర్మన్‌తో పేచీ వచ్చాక 'కుంవారా బాప్' (1974)ద్వారా రాజేష్ రోశన్‌కు మంచి అవకాశం ఇచ్చి నిలబెట్టాడు.
* గాయకుడు లక్కీ ఆలీ మెహమూద్ కుమారుడే!
* 'ఇల్లరికం'లో రేలంగి పాత్ర ధరించి తారాపథం అందుకున్న మెహమూద్ ఇటీవల ఒక టి.వి.ఇంటర్వ్యూలో రేలంగిని ప్రశంసించాడు

పట్టుకుని దాన్ని హిందీ సినిమాలలో బ్రహ్మాండంగా మార్కెట్ చేసుకున్నాడు. 'గుమ్‌నామ్' (1965)లో అతని మాటా, పాటా చూసి చాలామంది అతను హైదరబాదీ అనుకున్నారు. 'పడోసన్' (1968)లో తమిళసంగీత విద్వాంసుడిగా నటిస్తే హిందీ వ్యతిరేక ఉద్యమం రోజుల్లో సైతం ఆ సినిమా మద్రాసులో అమోఘంగా ఆడింది. 'ప్రీతమ్' (1971)లో అతను తమిళ క్షురకునిగా నటించాడు.

హాస్యనటుడుగా అతని ప్రాభవం రానురానూ పెరిగిపోయింది. సీన్‌లో అతనుంటే అవతలివాళ్లు మరుగున పడే ప్రమాదం వచ్చిపడింది. హీరోలు ఈ 'సీన్-స్టీలర్'ను భరించలేని దశ వచ్చి సినిమాలు తగ్గనారంభించే లోపులే మెహమూద్ జాగ్రత్తపడ్డాడు. తొలినాళ్లలోనే నిర్మాతగా, దర్శకుడిగా మారి 'ఛోటే నవాబ్' (1964), 'భూత్ బంగ్లా' (1965) వంటి లో బజెట్ సినిమాలు తనే ప్రధానపాత్ర నటిస్తూ తీశాడు. దర్శకనిర్మాత ఐ.యస్.జోహార్‌తో కలిసి కో-హీరోగా నటించిన 'జోహార్ మెహమూద్ ఇన్ గోవా (1964) టైటిల్‌లో తన పేరు ఉండేట్టు చూసుకున్నాడు. పెద్ద బజెట్‌లో తను తీసిన 'పడోసన్'లో తనకు మంచిపాత్ర ఉండేట్టు జాగ్రత్తపడ్డాడు.

హాస్యం, సెంటిమెంటు రంగరించి నాగేష్ వంటి హాస్యనటులను సైతం హీరోలుగా పెట్టి సినిమాతీసే ధైర్యం తమిళ, తెలుగు రంగాలలో ఉండడం అతన్ని ఆకర్షించింది. వాటి హిందీ వెర్షన్లలో హీరోగా నటించడానికి ఆదుర్తి సుబ్బారావు, ఎస్.రామనాథన్ వంటి దక్షిణాది దర్శకులు అతన్ని ఉత్సాహపరిచారు. అలా వెలువడిన 'సాధు ఔర్ సైతాన్' (తెలుగులో 'పట్టుకుంటే పదివేలు')(1969) 'మస్తానా' (1970) (తెలుగులో 'సత్తెకాలపు సత్తెయ్య') 'లాఖోం మే ఏక్' (1971) (తెలుగులో 'సంబరాల రాంబాబు')సక్సెసయ్యాయి. 'హమ్‌జోలీ' (1970) (తమిళచిత్రం 'పణక్కార కుటుంబం' ఆధారంగా టి.ఆర్.రామన్న డైరక్టు చేసినది)లో అతను హీరో కాకపోయినా త్రిపాత్రాభినయం వేసేటంత పెద్దపాత్ర! 'సర్వర్ సుందరం' రీమేక్ 'మై సుందర్ హూ' (1971) అతని కిరీటంలో కలికితురాయిగా నిలిచింది.

'పడోసన్'కు బెంగాలీ కథ తీసుకున్న మెహమూద్ ఇక దక్షిణాది కథలపై పడ్డాడు. 'మద్రాస్ టు పాండిచ్చేరి' ఆధారంగా 'బాంబే టు గోవా' (1972) తీశాడు. 'అనుబవి రాజా అనుబవి' (తెలుగులో 'అనుభవించురాజా అనుభవించు'గా డబ్ అయింది)ఆధారంగా 'దో ఫూల్' (1978) నిర్మించాడు. దీనిలో 'ముత్తుక్కొడికవ్వారిగళా' అనే తమిళపల్లవితో పాట పెట్టాడు. తరచుగా మద్రాసు వచ్చిపోతూండడంతో తమిళనిర్మాతలతో సత్సంబంధాలుండేవి. 'అంజల్‌పెట్టి 555' (తెలుగులో 'సింగపూర్ గూఢచారులు' పేరుతో డబ్ అయింది)అనే ఒక తమిళ సినిమాలో డైలాగులు లేని ఓ తాగుబోతు పాత్రలో అతిథినటుడిగా నటించాడు.

అందం తరిగిపోయిన తర్వాత చార్లీ చాప్లిన్ 'ది కిడ్' ఆధారంగా 'కుంవారాబాప్' సినిమా తీశాడు. ఆ సినిమాలో మెహమూద్‌ను అభిమానించే తమిళయువతిగా తమిళనటి మనోరమ నటించింది. పద్మనాభం నిర్మించిన 'పెళ్లికాని తండ్రి' ఆ సినిమాకు తెలుగు వెర్షనే!

చివరకు మెహమూద్ శాశ్వతనిద్ర కూడా దక్షిణభారతంలోనే! బెంగుళూర్లులో తన తండ్రి సమాధి పక్కనే తనను ఖననం చేయాలని కోరాడాయన.

- ఎమ్బీయస్ ప్రసాద్

# నేనూ నా పాటలు

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

10



- శ్రీమతి జమునా రమణారావు

తెలుగులో వచ్చిన 'సంతానం' సినిమాని 'బేటీబేటే'గా తీశారు. అందులో సునీల్‌దత్ అక్కవేషం. అంటే శ్రీరంజని క్యారెక్టర్ అన్నమాట. సరోజాదేవి డ్యూయెట్ సాంగ్స్ పాడుతుంది కానీ ...మెయిన్ సబ్జెక్ట్ అంతా ఇద్దరూ తమ్ముళ్లూ, ఓ అక్కా మధ్యనే కదా...! 'బేటీ బేటే'లో కూడా..మంచి పాటలు. 'నిదురపోరా తమ్ముడా...' ప్లేస్‌లో 'ఆజ్ కల్ మేఁ ఢల్ గయా..' పాట వస్తుంది. ఇంకా మంచి పాటలున్నాయి కానీ నాకు అదొక్కటే పాట. సునీల్‌దత్‌తో నేను చేసిన మొదటి చిత్రం అది. జనరల్‌గా బొంబై పీపుల్ మన సౌత్ ఇండియన్ స్టార్స్ అంటే చాలా గౌరవం చూపించేవారు. ఈ ప్రొడక్షన్‌లో అంతా సౌత్ ఇండియన్ వాళ్లమే ఉన్నాం కాబట్టి మేము షూటింగ్ చేస్తున్నప్పుడు బొంబై వాతావరణం ఉండేది కాదు... 'బేటీ బేటే' షూటింగ్‌కి వచ్చేటప్పటికి మాకు హోటల్ నచ్చలేదు. అప్పటికి ఎల్వీప్రసాద్ గారు ఫ్లాట్ కొన్నారు. ఆ ఫ్లాట్‌లోనే మమ్మల్ని పెట్టారు. మాకు బ్లాక్ పమేరియన్ కుక్క ఉండేది. అది నేను లేకపోతే ఉండదు. దాన్ని ఫ్లయిట్‌లో తీసుకుని వెళ్లి వాళ్ల ఫ్లాట్‌లో పెట్టుకుని కుక్కతో సహా షూటింగ్‌కు వెళ్లేవాళ్ళం. ఆ రోజుల్లో ఫ్లయిట్‌లో కుక్కను తీసుకెళ్లినా ఏం అబ్జెక్ట్ చేయలేదు. అయినా అప్పట్లో ఇంత మంది జనం ఎక్కడున్నారు...!? ఎల్వీప్రసాద్‌గారి ఫ్లాట్‌లో ఆయన ఓ రూమ్‌లో ఉండేవారు. నాకు, మా నాన్నగార్కి ఓ రూమ్.. పొద్దున్నే కాఫీ తాగేదగ్గర్నుంచీ... ప్రసాద్‌గారు కబుర్లు... ఇండస్ట్రీలోకి ఆయన ఎలా వచ్చారు... ఎన్ని కష్టాలు పడ్డారు... ఇలా అన్నీ చెప్పేవారు. ఒక బిడ్డలా నన్ను చూసుకునేవారు. అందరం కలిసి ఆయన కారులో షూటింగ్‌కు వెళ్లేవాళ్ళం. అంత పెద్ద డైరక్టర్.. అంత పెద్దవారు... ఆయన ఇంట్లోనే ఉండి షూటింగ్‌కు వెళ్లటం.. అదో మధురమైన అనుభూతి.

'బేటీ బేటే'లో మంచి క్లాసికల్ సాంగ్ ఒకటుంది. 'రాధికే తూనే బన్సురీ చురాయీ.' సునీల్‌దత్ పాడుతూ ఉంటే సరోజాదేవి డ్యాన్స్. రఫీ ఆ పాట పాడారు. అదొకటి నాకు చాలా ఇష్టమైన పాట.

'బేటీ బేటే' సూపర్‌హిట్. 25 వారాలు ఆడింది. నాకు ప్రసాద్ గారు ఇచ్చిన మూడు సినిమాలూ సిల్వర్ జూబ్లీ ఆడాయి. 'బేటీ బేటే' కు మాత్రం చిన్న ఫంక్షన్ ఏదో చేసి ఓ చిన్న

**చిత్రం: బేటీ బేటే  రచన: శైలేంద్ర  సంగీతం: శంకర్ - జైకిషన్  గానం: లతా మంగేష్కర్, రఫీ**

అ: ఆజ్ కల్ మేఁ ఢల్ గయా, దిన్ హువా తమామ్
తు భీ సో జా సో గయా, రంగ్ భరీ శామ్
ఆ: ఆజ్ కల్ మేఁ ఢల్ గయా, దిన్ హువా తమామ్
తూ భీ సో జా సో గయా, రంగ్ భరీ షామ్
ఆజ్ కల్ మేఁ ఢల్ గయా
అ: సో గయా చమన్ చమన్, సో గయా కలీ - కలీ
సో గయే హై సబ్ నగర్, సో గయా గలీ- గలీ
సో గయా చమన్ చమన్, సో గయా కలీ - కలీ
సో గయే హై సబ్ నగర్, సో గయా గలీ- గలీ
నీంద్ కహా రహీ హై చల్, మేరీ బాహే థామ్,
తు భీ సో జా సో గయా, రంగ్ భరీ షామ్
ఆజ్ కల్ మేఁ ఢల్ గయా
ఆ: హై బుఝా-బుఝా సా దిల్, బోఝ్ సాంస్ - సాంస్ పర్
జీ రహే హై ఫిర్ భీ హమ్, సిర్ఫ్ కల్ కి ఆజ్ పర్
హై బుఝా-బుఝా సా దిల్, బోఝ్ సాంస్ -సాంస్‌పర్
జీ రహే హై ఫిర్ భీ హమ్, సిర్ఫ్ కల్ కి ఆజ్ పర్
కహా రహా హై చాంద్‌ని, లేకే తేరా నామ్,
తూ భీ సో జా సో గయా, రంగ్ భరీ షామ్
ఆజ్ కల్ మేఁ ఢల్ గయా
అ: కౌన్ ఆయేగా ఇధర్, కిస్ కీ రాహ్ దేఖేఁ హమ్
జిన్‌కి ఆహటేఁ సునీ, జానే కిస్‌కే యే కదమ్
కౌన్ ఆయేగా ఇధర్, కిస్ కీ రాహ్ దేఖేఁ హమ్
జిన్‌కి ఆహటేఁ సునీ, జానే కిస్‌కే యే కదమ్
ఆప్ నా కోయీ భీ నహీఁ, అప్ నే తో హై రామ్
ఆ: తూ భీ సో జా సో గయా, రంగ్ భరీ షామ్
ఆజ్ కల్ మేఁ ఢల్ గయా







చిత్రం: బేటీ బేటీ  రచన: శైలేంద్ర
సంగీతం: శంకర్-జైకిషన్  గానం: రఫీ

ఆ...ఆ(...ఆ(....ఆ(...
రాధికే తూనే బన్సురీ చురాయీ ॥2॥
బన్సురీ చురాయీ క్యా, తేరే మన్ ఆయీ ॥2॥
కాహే కో రార్ మచాయీ, మచాయి రే ॥రాధికే॥
దేదూంగీ కహే కస్‌మేఁ ఖాయే ఆ..ఆ..ఆ.. ॥2॥
కహాఁ ఛుపాయీ, పర్ నా బతాయే ॥2॥
నట్‌కట్ కర్ తు గిటాయి గిటాయి
రాధికే తూనే బన్సురీ చురాయీ ॥2॥
నా తేరీ బైరన్, నా తేరీ సౌతన్ ఆ.. ఆ.. సౌతన్..
నా తేరీ బైరన్, నా తేరీ సౌతన్
మేరీ మురలియా, మోహే సబ్‌కా మన్ ॥2॥
కరే తేరి కౌన్ బురాయీ బురాయీ రే
రాధికే తూనే బన్సురీ చురాయీ ॥2॥
మిట్ కీ న తేరే గీత్ సునాయే ఆ..గీత్ సునాయే
మిట్ కీ న తేరే గీత్ సునాయే
రాధా రాధా రతన్ లగాయే ॥2॥
సబ్ జగ్ పడ్‌తీ సునాయే..సునాయే ॥ రాధికే॥





మొమెంటో ఇచ్చారు. నేను చిన్నపిల్లల్ని చంకలో వేసుకుని తిరిగినట్టు ఉండే వెండి మొమెంటో అది... ఆ రోజుల్లో వెండివి ఇచ్చేవారు. ఇప్పుడేమిటంటే ఓ చెక్క... లేకపోతే గాజుదిమ్మ.. లాంటి పిచ్చివి ఇస్తున్నారు. హిందీలో ఓ ఫంక్షన్ చేసి..ఒక మొమెంటో అంటూ మా ఇంటికొచ్చింది ఆ చిత్రంతోనే.

'మిలన్' సినిమా తెలుగులో మన 'మూగ మనసులు'. దీనికి కూడా ఆదుర్తి సుబ్బారావు గారే డైరెక్టర్. 1965లో తీసారు. అప్పటికి నాకు పెళ్లయింది. 'మిలన్'లో కూడా గౌరి వేషమే! ఈ సినిమాకి కూడా మా హిందీ మాస్టారు మాతోనే ఉన్నారు. 'మిలన్' షూటింగ్‌లో ఓ మధురమైన సంఘటన ఏమిటంటే- గోదావరి ఒడ్డున ఓ సెట్ వేశారు. 'వీళ్లు బొంబై నుండి వస్తున్నారు...' అని పక్కా ఇళ్లు కట్టేశారు. దే క్రియేటెడ్ ఏ స్మాల్ విలేజ్.... ఊరు గుర్తులేదు కానీ... మొత్తం చదునుచేసేసి కంప్లీట్‌గా చుట్టూరా పక్కా కన్‌స్ట్రక్షన్ చేసేసి...ఒక్కొక్కళ్లకి ఒక్కో రూమ్ విత్ ఎటాచ్‌డ్ బాత్రూం, బెడ్‌రూం...!! చుట్టూ రూమ్స్ ఉంటాయి. పైన మాత్రం పూరి పాక. చల్లగా ఉండటానికి గుడిసెల్లా వేశారు. ఫర్నిచర్, రెండేసి మంచాలు, ఫ్యాన్, 24 గంటలూ హాట్ వాటర్... జనరేటర్, అన్నీకాక... మధ్యలో షటిల్ కాక్ కోర్టు. దాని ఇన్‌చార్జి ఆనంద్ బాబు. ప్రస్తుతం ఆనంద్ సినీ సర్వీసెస్ అని ఉంది చూడండి... ఆ ఆనంద్‌బాబు అన్నమాట. ఎన్నో షూటింగ్‌లకు వెళతాం కానీ ఆ షూటింగ్ మాత్రం మరపురానిది.

ఫస్ట్.. రెగ్యులర్ షూటింగ్ స్టార్ట్ అయింది. అప్పటికి ఇంకా ఈ సెట్ కడుతున్నారు. సరే నా పాటలున్నాయి









తోహె సంవరియా నాహి ఖబరియా (2)
తుమ్‌రే కారన్ అప్‌నే దేస్ మేఁ బలమ్
హమ్ హో గయే పర్‌దేసీ (2) ॥తోహె సంవరియా॥
నా జానే కౌన్‌సా అప్‌నా ఆంగ్‌నా కౌన్‌సీ అటరియా (2)
అప్‌నే హీ గాఁవ్ కీ గలియోఁ మే భూలే ఫిర్‌తే హైఁ హమ్ డగరియా
ఘర్ అప్‌నే హమేఁ ఛోడ్ జావో (2)
కి హమ్ హోగయే పర్‌దేసీ..పర్‌దేసీ
హమ్ హోగయే పర్‌దేసీ ॥తోహె సంవరియా॥
ఓ హో..హో...హో...లాలలా..లాలాల...
యే దునియా, లాజ్, సప్‌నే, దిల్, చైన్, నిందియా,ప్యార్,జవానీ (2)
అప్‌నా క్యారెహ్‌గయా తుమ్‌రే నామ్ కర్‌దీ జబ్ జిందగానీ
హోయ్ సబ్ అప్‌నే హమేఁ బహుత్ యాద్ ఆయే (2)
కి హమ్ హోగయా పర్‌దేసీ పర్‌దేసీ
హమ్ హోగయే పర్‌దేసీ ॥తోహె సంవరియా॥

చిత్రం
**మిలన్**
రచన
**ఆనంద్‌బక్షి**
సంగీతం
**లక్ష్మీకాంత్ -ప్యారేలాల్**
గానం
**లతా మంగేష్కర్**



కదా... వాటి షూటింగ్‌కి మాత్రం ఎవరింట్లోనో నన్ను దించారు. అదే టైంలో...'శ్రీ కృష్ణ తులాభారం'కి రామానాయుడు గారు నన్ను బుక్ చేశారు. 'మిలన్' షూటింగ్‌కి 'శ్రీ కృష్ణ తులాభారం' పాటలు, పద్యాలు... అన్నీ తెచ్చుకున్నాను. పొద్దున్నంతా హిందీ షూటింగ్.. హిందీ డైలాగులు... ఇంటికొచ్చిన తర్వాత ఫ్రెష్‌గా స్నానం చేసి...తులాభారం సినిమాలోని ...మీరజాలగలడా...పాటలు, పద్యాలు పాడుతూ...అద్దం ముందు సత్యభామ ఎలా ఉండాలో ప్రాక్టీస్ చేస్తుండేదాన్ని. కిటికీలో నుండి ఆనంద్‌బాబు చూసి "మేడమ్....ఏమిటి మీరు... తెల్లవారితే మన షూటింగ్... మీరేమో 'మీరజాల గలడా...' అంటూ సత్యభామ పాత్ర చేస్తున్నారు" అనేవాడు. 'ఏం చేయను నాయనా...ఛాలెంజింగ్ రోల్....' అనేదాన్ని. 'మనదీ ఛాలెంజింగ్ రోలే కదా...' అనేవాడు. 'ఇదీ చేస్తానులే... నువ్వు రావద్దు.. నన్ను డిస్టర్బ్ చేయవద్దు' అనేదాన్ని.

ఇక రెండో షెడ్యూల్‌కి వచ్చేసరికి విలేజ్ సెట్ వెయ్యడం అదీ అయిపోయింది. రెండు మూడు స్టీమర్లు పెట్టేశారు. బోటులోనే మేకప్.. ఎక్కువగా బోటులోనే కూర్చునేవాళ్లం. మంచి బ్యాక్‌గ్రౌండ్ వస్తే అక్కడే లంగరు వేసి షూటింగ్ చేసేవాళ్లం. అట్లా పొద్దున్నుంచీ, సాయంత్రం దాకా గోదావరిలోనే ఉండేవాళ్లం. అదొక మరపురాని షూటింగ్.

'తో హే సవరియా.....' పాట నా ఉద్దేశ్యంలో 'గోదారి గట్టుంది...' అంత బాగా రాలేదు. తెలుగులో ఉన్న నేటివిటీ రాలేదు. 'బోల్ గోరీ బోల్' పాట మాత్రం అత్యద్భుతం. నడి గోదావరిలోని ఇసుక పత్రలలో 150 అడుగుల ఎత్తున గుడి కట్టారు. దాదాపు 200 మంది డ్యాన్సర్స్‌తో హీరాలాల్ మాస్టారు చేయించారు. తెలుగులో ఆ పాట 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా..' పాటన్న మాట. ఆ పాట పిక్చరేజేషన్ చాలా బాగుంటుంది. అందరూ చాలా కష్టపడ్డారు. ఎందుకంటే కాళ్లకింద ఇసుక మండుతూ ఉండేది. నీళ్లు పోస్తూ ఉండేవారు. ఓ తొక్కు తొక్కగానే మళ్లా మాములు. ఇలా చాలా కష్టపడి ఆ సాంగ్ చేసాం. 'మిలన్' లో ఇంకా మంచి పాటలు ఉన్నాయి. 'సావన్‌కా మహీనా' అని.. చాలా మంచి పాట.

నూతన్...చాలా మంచి ఆవిడ. నేను చేసిన పిక్చర్‌లు తక్కువ అయినా హిందీ వాళ్లు చాలా అభిమానంగా, ప్రేమగా మాట్లాడేవారు...లేడీస్ అంతే...జెంట్స్ అంతే.... 'ముక్కుమీద కోపం' పాట 'మిలన్'లో తీసేశారు. సినిమాలోనే కాదు... అసలు కాన్సెప్ట్‌లోనే లేదు. 'ఇది గొప్పోళ్ల అన్నం' అనే సీన్... అలా చాలా తీసేశారు. ఎంచేతంటే వాళ్ల హీరో హీరోయిన్ల పాటలకి విపరీత మైన లెంగ్త్



**చిత్రం: మిలన్** **రచన: ఆనంద్‌బక్షి**
**సంగీతం: లక్ష్మీకాంత్-ప్యారేలాల్** **గానం: ముకేశ్,లతా,బృందం**

అ : బోల్ గోరీ బోల్, తేరా కౌన్ పియా ॥2॥
కౌన్ హై వో తూనే జిసే ప్యార్ కియా ॥బోల్॥
ఆ : అరే, తూనే జానే నా ఉస్‌కా నామ్, హర్ సుబహ్ హర్ శామ్,
దునియా నే ఉస్‌కా నామ్ లియా
బోల్ తూహీ బోల్ తూహీ బోల్, మేరా కౌన్ పియా
అ : బోల్ గోరీ బోల్ తేరా కౌన్ పియా
అ: హై, కౌన్ సారే జగ్ సే నిరాలా
కో: హై, కౌన్ సారే జగ్‌సే నిరాలా
అ: కోయీ నిశానీ బత్‌లావో బాలా
ఆ: ఉస్‌కీ నిశానీ వో భోలా-భాలా
ఆ : ఉస్‌కీ నిశానీ కో : వో భోలా-భాలా
ఆ: ఉస్ కే గలే మే తరఫోం కీ మాలా...
అ: వో, కయీ హై జిస్‌కే రూప్, కహీ ఛావ్ కహీ ధూప్
తేరా సాజన్ హై యా బహె రూపియా
అ : బోల్ గోరీ బోల్, తేరా కౌన్ పియా
ఆ: బోల్ తూహీ బోల్ తూహీ, మేరా కౌన్ పియా
ఆ: మన్ ఉస్‌కా మన్‌దిర్ ప్రాన్ పుజారీ ॥2॥
అ: ఘోడా నా హాథీ అరే బైల్ సవారీ
కో: ఘోడా నా హాథీ అరే బైల్ సవారీ
ఆ: కైలాశ్ పర్వత్ కా వో తో జోగీ
అ: అచ్ఛా వోహీ దర్ దర్ కా భిఖారీ
కో: దర్ దర్ కా భిఖారీ
ఆ: హాఁ, వో హై భిఖారీ లీక్, లేకే భక్తి కీ భీఖ్
బద్‌లే మేఁ జగత్ కో మోక్ష్ దియా ॥బోల్ తూ హీ॥
అ : బోల్ తూ హీ బోల్ తేరా కౌన్ పియా
ఆ: మైఁ జిస్‌కో భావూఁ, జో ముఝ్‌కో భాయే
కో: మైఁ జిస్‌కో భావూఁ, జో ముఝ్‌కో భాయే
ఆ: ఇక్ దోష్ తో కోయీ ఉస్‌మే బతాయే
అ: తూ జిస్ పే మర్‌తీ హై, హాయే-హాయే
తూ జిస్ పే మర్‌తీ హై, కో : హాయే-హాయే
వో హై జటావోం మే గంగా బహాయే
ఆ: దో దిన్ కా హై యే సాథ్, యుగ్-యుగ్‌సే మేరీ బాత్
మైఁ హూఁ బాతీ అగర్, తో వో దియా బోల్ తూ హీ..
కో: బోల్ తూ హీ బోల్, మేరా కౌన్ పియా
ఆ: బోల్ తూ హీ బోల్, మేరా కౌన్ పియా
కో: బోల్ తూ హీ బోల్, మేరా కౌన్ పియా





**మిలన్ (హిందీ) సినిమాలో చిత్రీకరణ**
**జరిగిన తర్వాత తొలగించబడిన పాట ఇదే...**
**రచన: ఆనంద్‌బక్షి** **గానం: లతా మంగేష్కర్**
**సంగీతం: లక్ష్మీకాంత్ - ప్యారేలాల్**

ఆజ్ దిల్ పే కోయీ జోర్ చల్ తా నహీఁ
ముస్కురానే లగే థే మగర్ రో పడే
రోజ్ హీ కీ తరహ్ ఆజ్ భీ దర్ద్ థా
హమ్ ఛుపానే లగే థే మగర్ రో పడే
ఔర్ అబ్ క్యా కహేఁ, క్యా హువా హై హమేఁ
తుమ్ తో హో బేఖబర్, హమ్ భీ అన్‌జాన్ హైఁ
బస్ యహీ జాన్ లో తో బహుత్ హోగయా
హమ్ భీ రఖ్‌తే హైఁ దిల్, హమ్ భీ ఇన్‌సాన్ హైఁ
ముస్కురాతే హువే హమ్ బహానా కొయీ
ఫిర్ బనానే లగే థే మగర్ రోపడే
**హైఁ సితారే కహాఁ** ఇత్‌నే ఆకాశ్ పర్
హర్ ఏక్ కో అగర్ ఇక్ సితారా మిలే
కశ్తియోఁ కే లియే యే భందర్ భీ తో హైఁ
క్యా జరూరీ హై హర్ ఎక్ కో కినారా మిలే
బస్ యహీ సోచ్‌కర్ హమ్ బఢే చైన్ సే
డూబ్ జానే లగే థే మగర్ రో పడే
ఉమ్రభర్ కాశ్ హమ్ యూఁహీ రోతే రహేఁ
ఆజ్ క్యూఁకి హమేఁ యే హుయీ హై ఖబర్
ముస్కురాహట్ కీ తో కోయీ కీమత్ నహీఁ
ఆఁసువోం సే హుయీ హై హమారీ కదర్
బాదలోఁ కీ తరహ్ హమ్ తో బర్‌సే బినా
లౌట్ జానే లగే థే మగర్ రో పడే

పెట్టేశారు. పాటలు... ఒక్కొక్కటి 5, 6 నిమిషాలు ఉంటాయి. దానితో కత్తెర అంతా నా వేషానికి, నా పాటలకి పడింది. చాలా మంచి మంచి సీన్స్ అన్నీ ఫైనల్ ఎడిటింగ్‌లో పోయాయి. ఇక 'మాను మాకును కాను...' పాట ఎంత బాగా తీసారంటే... చెప్పనలవి కాదు. అంత బాగా తీశారు. లతా పాడింది. రికార్డ్ చేశారు. 'ఆజ్ దిల్ పే కోయి జోర్ చల్‌తా నహీ...'అని. అందులో ముఖ్యంగా "హే సితారే కహా' అని ఓ లైన్ వస్తుంది. దాని కోసం నన్నేమో గోదావరి ఒడ్డున కూర్చోపెట్టి...క్రేన్ పెట్టి క్రింద కొన్ని వేల దీపాలు...బాంబూ రాంప్‌లా కట్టి దానిమీద అన్ని లైట్లు పెట్టి...అవి చుట్టూరా తిరగకుండా ఒక చోట ఉండేలా చూసుకుని నన్ను ఇంక్లూడ్ చేస్తూ బ్యూటిఫుల్ షాట్స్ తీశారు. కానీ తీరా చూస్తే పిక్చర్‌లో మొత్తం పాటే కట్ చేసేశారు.

ఆదుర్తి గారిని అడిగాను...'అంత బాగా తీసి ఎందుకు తీసేశారు సార్...' అంటే 'ఏం చేయనమ్మా లెంగ్త్ ఎక్కువ అయిపోయింది' అన్నారు.

అయినా కూడా సినిమా రిలీజ్ అయిన తర్వాత నాకు బ్రహ్మాండమైన పేరొచ్చింది . అదే టైంలో ఫిలిమ్‌ఫేర్ అవార్డ్స్ ఎనౌన్స్ చేశారు. ఓ హిందీ ఆర్టిస్ట్...దేశంలో ఉన్న ఫిలింఫేర్‌లు అన్నీకొని కూపన్‌లు కత్తిరించి పంపించింది. అయినా కూడా నాకు బెస్ట్ సపోర్టింగ్ యాక్ట్రస్ అవార్డ్ ఏకగ్రీవంగా వచ్చింది. ప్రజలు నన్ను ఆ అవార్డ్‌కు ఎన్నిక చేశారు. నూతన్‌కు బెస్ట్ యాక్ట్రెస్‌గా వచ్చింది. ఆ ఆర్టిస్ట్ ఎంత మానేజ్ చేసినా రాలేదు.

'మిలన్' షూటింగ్‌లో ఓ భయంకరమైన సంఘటన జరిగింది. సెంటిమెంట్ ఉన్నవాళ్లు డెఫినెట్‌గా నమ్ముతారు.

**(ఆ సంఘటన గురించి మరికొన్ని పాటల గురించి... వచ్చే సంచికలో....)**

రోడ్డుమీద ఓ గారడీవాడు ఓ పదేళ్ల పిల్లాడి చేత అనేక రకాల ఫీట్లు చేయిస్తున్నాడు. అందులో ఒక ఫీట్... ఓ చిన్న రింగ్‌లోంచి అవలీలగా దూరి అవతలి కెళ్లడం.
ఇది చూసిన ఓ దొంగ ఐదువందలిచ్చి ఆ గారడీ వాడి దగ్గర్నుండి ఆ పిల్లాడ్ని కొన్నాడు.



ఒకరోజు ఓ ఇంటికి చిన్న కన్నం పెట్టి "లోపలికెళ్లి, వస్తువులు బయటికందించు" అన్నాడు ఆ కుర్రాడితో!
"భలే వారండోయ్ ! అలా చెప్పేస్తే... చేసెయ్యగలనేమిటి? గట్టిగా చప్పట్లు కొట్టి మరింత గట్టిగా ఈలెయ్యండి ...... చుట్టూ జనం పోగయ్యాక అప్పుడు దూరకపోతే... చూడండి" అన్నాడా కుర్రాడు హుషారుగా.




" నువ్వు చూస్తుండగా...ఒకరు బావిలో పడ్డారనుకో, అప్పుడేం చేస్తావు? "
"ఏంచేస్తాం సార్ చూస్తూ కూర్చుంటాను అంతే ."
"అందేంటి?.... ఎవరో ఒకరు తియ్యకపోతే అతనెలా పైకి వస్తాడు?"
"మీరే అన్నారుగా సార్ ఎవరంతట వాళ్లే కష్టపడి పైకి రావాలని!!"

**ఈ జోకులను పంపించిన వారు: గుంటి యామిని ఈశ్వర్ కార్తీక్ సాగర్, వనపర్తి.**

కార్తీక్‌కు తెలివి జాస్తి అంటారు . ఒకసారతను ఇలా పేపర్లో ప్రకటన ఇచ్చాడు:
"ఇరవై ఒకటో శతాబ్దపు అద్భుతమైన ఆవిష్కరణ - పెన్ను, ఇంక్ లేకుండా రాయటమెలా? వివరాలకు అయిదు రూపాయలు పంపితే చాలు"
వేలాది మంది అయిదు రూపాయల చొప్పున అతనికి పంపించారు. వారికి సమాధానంగా అతడు పంపిన 50 పైసల పోస్టుకార్డు మీద ఇలా ఉంది.
"పెన్సిల్ ఉపయోగించండి."





"ఆ డాక్టర్ మరీ అంత తాగుబోతు అనుకోలేదురా ?
"ఏం చేశాడేమిటి",
"తనురాసిచ్చిన టానిక్‌ను రోజుకు మూడు పెగ్గులు వేసుకోమని చెప్పాడు".



టీచర్ (విద్యార్థి తండ్రితో) మీ అబ్బాయి స్కూల్ పరుగు పందెంలో రికార్డ్ బ్రద్దలు కొట్టాడండీ.
వెంటనే ఆ తండ్రి తన కొడుకుని చితకబాదేశాడు. "వెధవా! స్కూల్ కెళ్లి చదువుకోరా అంటే బుద్ధిలేదూ...అవీ ఇవీ పగులకొడుతున్నావా?" అంటూ

**ఈ జోకులను పంపించిన వారు: జి. యామిని ఈశ్వర్ కిరణ్ సాగర్, వనపర్తి.**




"ఐలవ్ యూ సుజాతా!'' అన్నాడు రోడ్ సైడ్ రోమియో
"ఏరా ! ఆ రోజు కూడా ఇలానే అని చెప్పుతో కొట్టించుకున్నావ్ ఇంకా సిగ్గు రాలేదా నీకు"... అంది సుజాత కోపంగా .
"సారీ మేడమ్- ఆ రోజు కొట్టింది మీరు కాదు-మీ ఫ్రెండు సరళ-మీరు కేవలం చూస్తూ నిలుచున్నారు. అంచేత మీకేమైనా ఇంట్రస్ట్ ఉందేమోనని ఓ చిన్న ప్రయత్నం....." సిన్సియర్‌గా చెప్పాడు ఆ చెప్పు దెబ్బల ప్రేమికుడు!



"అమ్మా! స్కూలుకి టైమవుతోంది అన్నం పెట్టవే".
"ఉండరా...నీదో గొడవ..ఈరోజు ఎపిసోడ్ లో అత్తను, మొగుడ్ని ఎలా సాధించాలో కొత్త టెక్నిక్‌తో చూపిస్తారట. కాసిన్ని నీళ్లు తాగివెళ్ళు..సాయంత్రం వచ్చాక అన్నం తినొచ్చులే".



"రోజుకో యాపిల్ పండు తింటే డాక్టరును దూరంగా వుంచవచ్చు తెలుసా" అంది నీరజ.
"మరే ...రోజుకో పచ్చి ఉల్లిపాయ తింటే అందరినీ దూరంగా ఉంచవచ్చు" అంది రజని.

**ఈ జోకును పంపించిన వారు: పసుపులేటి సాయిలక్ష్మి, యు.యస్.పేట.**

**ఈ జోకును పంపించిన వారు: పులిపాక తాజుద్దీన్,జయపూర్.**



“వెయిటర్లకు టిప్పులిచ్చే అలవాటు మీ హోటల్‌లో ఉందా?” అడిగాడు కస్టమర్ ప్రొప్రైటర్‌ని.
“ఉందండి ” అన్నాడు ప్రొప్రైటర్
“అయితే టిప్ ఇచ్చెయ్యండి వెళ్లిపోతాను. టిఫిన్ ఆర్డరిచ్చి గంటయింది. వెయిట్ చేయలేక ఛస్తున్నా”.




“అతనలా పళ్ళురాల గొడతానంటుంటే చూస్తూ ఊరుకుంటారేంటండీ?” నిలదీసింది ఓ లవర్.
“వాడు నన్నేం చెయ్యలేడు డాళింగ్ నావి కట్టుడు పళ్లని పాపం తెలీదు వాడికి” అంటూ బదులిచ్చాడా లవరుడు.



“మీ స్కూల్లో ఎన్ని ఫాం లు ఉన్నాయి బాబూ”
“ఒకే ఫాం”
“ఒకే ఫాం అంటే ఫస్టు ఫామా, సెకండ్ ఫామా, థర్డుఫామా?”
“అదేదీ కాదు, యూనిఫాం”

“అయ్యా...తమరు నిరాహారదీక్ష చేయబోతున్నారని తెలిసి వచ్చాం”
“చాలా సంతోషం, ఇంతకూ , తమరు ఏ పత్రికా విలేకరి?”
“విలేకరులం కాదండి తమకు కావలసిన తినుబండారాలను సప్లై చేయడానికి వచ్చిన స్టార్ హోటల్ వాళ్లం. ఇలాంటి సమయాల్లో ఎవరికీ తెలియకుండా ఫుడ్ ఐటమ్స్ సప్లై చెయ్యడం మా ప్రత్యేకత”.



**ఈ జోకులను పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, హైదరాబాదు.**

“ఎందుకు బాబూ ఇక్కడ పడుకున్నావ్” అడిగాడు ఓ పెద్దాయన.
“తెలియటం లేదూ చావటానికి” అన్నాడు పట్టాల మీద పడుకున్న వ్యక్తి.
“అది తెలుస్తూనే ఉందిలేవయ్యా... ఎందుకూ అని అడుగుతున్నాను” అన్నాడు.
“నాకు రావల్సిన ఆస్తి మా బంధువులకు వెళ్లింది. నాకు రావల్సిన ఉద్యోగం ఇంకొకడికి వెళ్లింది. నేను ప్రేమించిన అమ్మాయి మరొకర్ని ప్రేమించింది. నేనింత వరకు అనుకున్నదేదీ జరగలేదు. నిరాశ పుట్టుకొచ్చేసింది అందుకని...” అన్నాడు.



“ష్... పాపం... మరదే జాతకం అంటే... దీనికి కూడా ప్రాప్తం లేదు నీకు... ఈ రోజు రైల్వే స్ట్రయిక్” అన్నాడా పెద్దాయన జాలిగా.

**ఈ జోకును పంపించిన వారు: జి.భాను,నెల్లూరు.**

ఈశ్వర్ సంతకి వెళ్లినప్పుడల్లా చిలక జోస్యం చెప్పించుకోవడం అలవాటు. రూపాయి ఇచ్చి జ్యోతిష్కుని ముందు కూర్చుని “నేను ఎన్నాళ్లు బతుకు తాను” అంటూ అడిగాడు.



“82 ఏళ్లు” చెప్పా జ్యోతిష్కుడు.
“మరి మా ఆవిడ”.
“మీకన్నా రెండేళ్ల తక్కువ”.
చివరి రోజులలో తనకి చేసే వారుండరని ఓ మూడేళ్ళు ఆగిపెళ్లి చేసుకోవాలన్న నిర్ణయం వెంటనే తీసేసుకున్నాడు ఈశ్వర్.

**ఈ జోకును పంపించిన వారు: కె. ఈశ్వర్,నెల్లూరు.**

“మీరు మీ పక్కింటి ఆవిడని మొన్నరాత్రి హత్యచేశారని మీ పై అభియోగం. దీనికి మీ సమాధానం ఏమిటి?”
“నాకు రే చీకటి సార్! నా భార్యే అనుకుని హత్యచేశాను. మొదటి తప్పుగా నన్ను క్షమించండి.”



**ఈ జోకును పంపించిన వారు: జి.శశిధర్,నెల్లూరు.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన జి.వై.ఈ.కార్తీక్ సాగర్, జి.వై.ఈ.కిరణ్ సాగర్ - వసపర్తి, పసుపులేటి సాయిలక్ష్మి -యు.యస్.పేట, పులిపాక తాజుద్దీన్ - జయపూర్, గొల్లపూడి శ్రీనివాస్ - హైదరాబాద్, జి. భాను - నెల్లూరు, జి.శశిధర్ - నెల్లూరు, కె. ఈశ్వర్ - నెల్లూరు గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'స్వామి' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.





తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 9



- ఇంద్రగంటి జానకీబాల

'కాదు సుమా! కలకాదు సుమా' అనే పాట ఆంధ్రులందరికీ సుపరిచితం. ఆ రోజుల్లో అక్కినేని నాగేశ్వరరావు, సూర్యశ్రీ ఝాం అని గాలిలో 'కీలుగుర్రం' మీద ఎక్కి ఆకాశ విహారం చేస్తూ

**అమృత పానమున- అమరగానమున**
**గగన యానమున తేలియాడుటిది**
**కాదు సుమా! కల కాదు సుమా!**

అంటూ పాడుతుంటే ప్రేక్షకులు తాము

సరళ సంప్రదాయ సిద్ధమైన కుటుంబం లోంచి వచ్చారు. ఆమె తల్లి బృహత్ నుందర కుచాంబ, తండ్రి కొమ్మూరి వేణుగోపాలరావు. అంటే సుప్రసిద్ధులైన సంచలన తెలుగు రచయిత గుడిపాటి వెంకటచలంగారికి సొంత తమ్ముడు. చలం గార్ని గుడిపాటి వారికి దత్తత యివ్వడం వల్ల ఆయనింటి పేరు గుడిపాటిగా మారింది. సరళకి చలం స్వయానా పెద్దనాన్నగారు. సంగీత సాహిత్యాలకి నెలవైన ఆ కుటుంబంలో సరళలో వున్న ప్రతిభకి అడ్డులు అంక్షలు ఎక్కువేనని చెప్పాలి.

చక్కని శ్రుతిబద్ధమైన కంఠం, మంచి భావ ప్రకటనా నైపుణ్యం వున్న సరళకు సంగీతంలో మంచి శిక్షణ కూడా వుంది.

ఆమె కెంతో గుర్తింపు తెచ్చింది. ఇంత మంచి హిట్‌సాంగ్‌ను తన కోసం పాడిన సరళను అంజలీదేవి ఎంతో అభిమానించి ఆమెకి ఒక వజ్రపుటుంగరాన్ని బహుకరించారు. ఇది ఆనాటి వారి మైత్రికి ఈనాటికీ గుర్తు. సరళకు మద్రాసులోనే కాక బొంబాయి నుంచి కూడా మంచి మంచి అవకాశాలు వచ్చాయి. కానీ ఆనాడు సినిమాలలో పనిచెయ్యడం మీద సమాజంలో గౌరవప్రదమైన అభిప్రాయం లేకపోవడం వల్ల ఆమెకి ఇంట్లో వత్తిడి పెరిగింది. ముఖ్యంగా ఆమె తల్లిగారైన సుందరమ్మ గారికి సినిమాలంటే అస్సలు యిష్టం లేకపోవడంతో మొదటి నుంచీ అభ్యంతరం పెడుతూనే



# సరళమైన గొంతు వక్కలంక సరళారావు

కూడా ఆకాశంలో ఎగిరి పోతున్నట్లు ఆనందపడ్డారు.

ఇంతకీ ఈ యుగళ గీతాన్ని పాడిందెవరూ అంటే వక్కలంక సరళ -ఘంటసాల వెంకటేశ్వరరావు అని తేలింది. అప్పట్లో చక్కని కంఠంతో సరళ అందర్నీ ఆకర్షించింది. అదే సినిమాలో ఆమె 'ఆహా ఓ హో ఎంతానందం బాయనహా' అని మరొక పాట కూడా పాడారు.

1946లో ఆమె సినిమాలో ప్లేబ్యాక్ పాడటానికి వచ్చినట్లు తెలుస్తుంది. వచ్చిన అనతి కాలంలోనే చక్కని పాటలు పాడి అందరి మెప్పు పొందిందామె.

'బాలరాజు' సినిమాలో 'తీయని వెన్నెల రేయి - ఎడబాయని చిన్నెల హాయి' అంటూ అంజలీదేవికి ప్లేబ్యాక్ మధురంగా పాడారు. ఆమె పాడిన ఈ పాట ఎంతో ప్రజాదరణ పొందింది.

వుండేవారట. అయినా ఏలాగో వొప్పించి పెళ్ళి అయ్యేవరకే పాడతానని వాగ్దానం చేసిన సరళ ఆ మాటకి కట్టుబడి సినీ నేపథ్య గానానికి దూరం కావాల్సి వచ్చిందని ఆమె కుమార్తె, ప్రఖ్యాత నర్తకి స్వప్నసుందరి గారు కించిత్ బాధతో చెప్తారు.

ఎంతో ప్రతిభ వున్నప్పటికీ సరళ కుటుంబం లోని కట్టుబాట్ల వల్ల ఆకాశవాణి కళాకారిణిగా తమ జీవన మార్గాన్ని మళ్ళించుకున్నారు. స్త్రీకి

భర్త, పిల్లలు,కుటుంబం ఇవే ముఖ్యం అని చెప్పిన తల్లి మాటల్ని శిరసావహించారామె.

ఆమె పాడినవి అక్కడక్కడ చక్కని పాటలు వున్నాయి. 'లైలా మజ్ను' (1949)లో 'అనగనగా ఓ ఖానూ', మరదలు పెళ్ళి' (1952)లో 'పిలిచే గోదావరొడ్డు', 'నవ్వితే నవరత్నాలు' (1951)లో 'పరుగెత్తే మబ్బుల్లారా', 'వయ్యారిభామ' (1953)లో 'ఆటా - పాటా' ఇలా చెదురు మదురుగా ఆమె కొన్ని పాటలు పాడి అందరి మెప్పునూ పొందారు.

అకాశవాణిలో ఎన్నో సంగీత కార్యక్రమాలు నిర్వహించారు. లలిత సంగీతం పాడారు.

ఫిలిమ్స్ డివిజన్‌లో పనిచేస్తూ ఎన్నో సంగీత కార్యక్రమాలు చేశారు. మ్యూజిక్ కంపోజ్ చేశారు. ఈమె వక్కలంక సరళారావుగా ప్రసిద్ధులు.

ఆమె పాడిన కొద్ది పాటలు మంచి పాటలుగా ఇప్పటికీ అందరికీ గుర్తుండిపోయాయి. నేటికీ అపాటలు నిత్యనూతనంగానే వున్నాయి.

చిత్రం : బాలరాజు
గానం : వక్కలంక సరళ
సంగీతం : గాలి పెంచల నరసింహారావు. ఘంటసాల
రచన : సముద్రాల రాఘవాచార్య

తీయని వెన్నెల రేయి
ఎడబాయని చిన్నెల హాయి - ఓ రసపాయీ
నటనమే బ్రతుకోయీ...
ఊగే పూలలోన మునుసాగే అలలలోనా
చెలరేగే గాలిలో - నాకాలి మువ్వలలో
కదలికే కడుహాయి - నటనమే బ్రతుకోయి ॥ఈ తీయని॥
మొయిలు భామ వడిలో - నడలో సుడులు వాలీ
వన మయూరినై మీరీ తమిదీర ఆడుదునే
దరియగా రావోయీ -నటనమే బ్రతుకోయీ ॥ఈ తీయని॥

## శ్రీమతి వక్కలంక సరళ గురించి మరికొంత...

సరళలో బాల్యం నుండి సంగీత ప్రతిభ వికసించింది. సంగీత విదుషియైన తల్లి బృహత్సుందర కుచాంబ సరళకు తొలిగురువు. తరువాత కీ.శే. కాలక్కాడ్ రామనారాయణయ్యర్, కీ.శే. పి. సుందరం, కీ.శే. వోలేటి వెంకటేశ్వర్లు, శ్రీమంగళంపల్లి బాలమురళి గార్లవద్ద సంగీతంలో మెళకువలు నేర్చుకున్నది. కళాశాలలో చదువుతున్న రోజుల్లోనే చలన చిత్ర రంగం ఆమెను గుర్తించింది. ఆమె పాడిన పాటలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి.

వివాహం తరువాత ఆమె జెమినీ స్టూడియోలో చేరి అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టర్‌గా పనిచేసింది. హిందీ చిత్రాల స్వరకర్త సి. రామచంద్ర మొ॥వారితో కలిసి పనిచేసే అపూర్వ అవకాశం ఆమెకు లభించింది. భర్త డా॥ వక్కలంక కామేశ్వరరావు గారు ఆర్మీ డాక్టర్ కావటం వలన శ్రీమతి సరళ ఉత్తరాదిన పలు ప్రాంతాలు పర్యటించటం జరిగింది. ఈ ప్రయాణాలామె సంగీతానికి ఏ మాత్రం అడ్డుపడలేదు. పూనాలోను, ఢిల్లీలోను ఆమె హిందుస్తానీ సంగీతం అభ్యసించింది.

1957 ప్రాంతంలో సరళ హైదరాబాదు వచ్చి నాలుగైదు సంవత్సరాలు ఉండటం తటస్థించింది. ఆ సమయంలో అకాశవాణి హైదరాబాద్‌లో ఎన్నో లలిత సంగీత కార్యక్రమాలలోనూ, సంగీత రూపకాలలోనూ పాల్గొంటూండేది. నేను, సరళ కలసి ఎన్నో పాటలు పాడేవారం. 'శర్మిష్ఠ', 'ఏడాది పొడుగునా', మొ॥ సంగీత రూపకాలలో పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీత నిర్వహణలో అద్భుతమైన పాటలు పాడాం. మంచి స్వర జ్ఞానము కలిగి, సునిశితమైన అవగాహనతో ప్రజ్ఞతో హిందీ, ఉర్దు, తెలుగు, తమిళం, బెంగాలీ మొ॥ భాషలలో పాటలను ఎంతో భావయుక్తంగా గానం చేసే నేర్పుకల గాయని సరళ. మా యిద్దరి యుగళ గీతాలు, ఆమె సోలో గీతాలు యీనాటికీ ఆంధ్రదేశంలోని అకాశవాణి కేంద్రాల నుండి ప్రసారం అవుతూ ఉన్నాయి.

1968లో ఢిల్లీలోని సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌లో స్వరకర్తగా చేరి ఎన్నో మధురమైన బాణీలను సమకూర్చింది. సరళ సమకూర్చిన బాణీలను జేసుదాసు, ఎస్.జానకి, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం మొ॥ ప్రముఖులు పాడారు. అవేకాక విద్యారంగానికి, నాట్య రంగానికి సంబంధించిన క్యాసెట్లకు సంగీతాన్ని అందించింది శ్రీమతి సరళ. భక్తి సంగీతం ముఖ్యంగా అన్నమాచార్య శృంగార కీర్తనలకు ఆమె సురుచిరమైన బాణీలు కూర్చగా డా॥ మురళీకృష్ణ, వాణీజయరాం మొ॥వారు గానం చేశారు. మీరా, సూరదాస్, తులసీదాస్ మొ॥వారి భజనలను తన సంగీత నిర్వహణలో క్యాసెట్లుగా వెలువరించింది. ఎన్నో దేశ, విదేశ పురస్కారాలు, అవార్డులు ఆమెను వరించాయి. ఎన్నో సత్కారాలను పొందింది.

ఆమె కుమార్తె శ్రీమతి స్వప్నసుందరి ప్రపంచ విఖ్యాతి గాంచిన నర్తకీమణి. స్వప్నసుందరిని 2003 సంవత్సరంలో 'పద్మభూషణ్' బిరుదుతో కేంద్ర ప్రభుత్వం సత్కరించింది.

నిరంతరం సంగీత సేవకే అంకితమైన ప్రముఖగాయని, స్వరకర్త శ్రీమతి సరళ 1999 లో దివంగతురాలైంది.

**-ఎం.చిత్తరంజన్**

చిత్రం : కీలుగుఱ్ఱం(1949)
సంగీతం : ఘంటసాల
గానం : వక్కలంక సరళ, ఘంటసాల
రచన : తాపీ ధర్మారావు నాయుడు

ఆ: కాదు సుమా కల కాదు సుమా
కాదు సుమా కల కాదు సుమా
అమృత పానమును అమర గానమును
అమృత పానమును అమర గానమును
గగన యానమును కల్గినట్లుగా
గాలిన తేలుచూ సోలిపోవుటిది
కాదు సుమా కల కాదు సుమా
అ: ప్రేమలు పూచే సీమల లోపల...
ప్రేమలు పూచే సీమల లోపల
వలపులు పారే సెలయేరులలో
తేటి పాటలను తేలియాడితిని
కాదు సుమా కల కాదు సుమా

ఆ: కన్నె తారకల కలగానముతో
కన్నె తారకల కలగానముతో
వెన్నెల చేరుల ఉయ్యాలలో...ఓ...ఓ...ఓహో...ఓ...ఓ..ఓహో..
వెన్నెల చేరుల ఉయ్యాలలో
ఉత్సాహముతో ఊగుచుండుటిది
కాదు సుమా కల కాదు సుమా
ఇ: పూల వాసనల గాలి తెరలలో
వలపు చీకటుల వన్నె కాంతిలో ॥పూల॥
ఆహ...ఆ..ఆ..ఆహ...ఆ...ఆ...
దోబూచులాడుటిది
కాదు సుమా కలకాదు సుమా
కాదు సుమా కల కాదు సుమా

# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

నవలీకరణ
**ఇలపావులూరి మురళీమోహనరావు**

వెండితెర నవల
**12**

**జరిగిన కథ**

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. వసుంధర శనాదివారాలు కృష్ణమూర్తి దగ్గర ఆర్ట్సు నేర్చుకుంటానని చెప్పి అతని గదికి వస్తుంది. ఆ ఏర్పాట్లు చూడడానికి వచ్చిన కొండల్రావు, కృష్ణమూర్తి వసుంధరను వలలో వేసుకుంటున్నాడని చెప్పడంతో భయపడుతుంది. గదిలోకి దూసుకువస్తున్న వసుంధరను ఆపి భామ తాలూకు సామాన్లు పక్కవాటాలోకి తరలిస్తుంటారు దంపతులిద్దరూ..

-(ఇక చదవండి)



"అవును. ఇది పతివ్రతా ధర్మం. నా పతిని కాపాడు కోడానికి, చెడ్డరుచులు మరిగి చెడిపోకుండా చూసుకోడానికి...'' భామ అంటుండగా ఆమె మనసును తృప్తి పరచి మెల్లగా అవతల గదిలోకి పంపించి తలుపు మూశాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి గది సర్దుడు ఎంతసేపటికీ కాకపోవడంతో విసుగెత్తి "మిస్టర్ కే కే..." కేకేసింది వసుంధర.

"వచ్చేస్తున్నా...వన్‌మినిట్.." నవ్వుతూ తలుపుతీశాడు కృష్ణమూర్తి. గదిలోకొచ్చింది వసుంధర. గదంతా ఎంతో శుభ్రంగా ఉంది. షోకేస్‌లో రకరకాల బొమ్మలు, అక్కడక్కడా వేలాడుతున్న పూసలదండలు, అందంగా కుట్టబడిన సోఫాలు.. సోఫాకవర్లు... గోడలకు తగిలించిన రకరకాల పెయింటింగ్స్‌తో చూడముచ్చటగా -బ్రహ్మచారుల గది అంటే నమ్మడానికి వీలులేనట్లుగా ఉంది. ఆ గది అందాన్ని చూసి మురిసిపోయింది వసుంధర.

"సర్‌ప్రైజ్.. వావ్.... బ్యూటిఫుల్.. బ్యూటిఫుల్...బ్యూటీఫుల్..అబ్బ.. మీదెంత గొప్ప టేస్టండీ" అంటూ గదంతా కలయదిరిగింది.

"హి...హి....హి..." అరువు నవ్వు నవ్వాడు కృష్ణమూర్తి. గోడకు వేలాడుతున్న అతని ఫోటోను చూసి "అబ్బ..ఎంత బాగుందో..." అని ముద్దుపెట్టుకుంది.

వసుంధర చిలిపిచేష్టలతో తెగ సిగ్గుపడిపోయాడు కృష్ణమూర్తి.

"నౌ... ద రియల్ సర్‌ప్రైజ్. కళ్ళు మూసుకోండి" అన్నది వసుంధర.

కళ్ళుమూసుకున్నాడు కృష్ణమూర్తి.

తనవెంట తెచ్చిన నిలువెత్తు లామినేట్ ఫోటో ఫ్రేమ్‌కి ఉన్న కవర్‌ను చింపి ఫోటోను చూపించింది వసుంధర.



కృష్ణమూర్తి ఆ ఫోటోను చూసి ఆశ్చర్యపోయాడు. తను డిజైను చేసిన చీరలో వసుంధర బొమ్మ! ఆ అందాన్ని చూసి 'మైగాడ్' అన్నాడు సంభ్రమంగా.

"ఊహు...మైగాడెస్ అనాలి. మొన్న మీరు నా కోసం వేసిన స్కెచ్ ఇది. స్టూడియోకు తీసుకెళ్ళి చారెడు బొమ్మను బారెడు చేయించా. నా అంత సైజుకు బ్లోఅప్ చెయ్యమన్నాను. ఫెంటాస్టిక్ కదూ" అన్నది కిలకిల నవ్వుతూ వసుంధర.

వసుంధర చేష్టలను తలుపుచాటునుండి విస్తుపోతూ చూస్తున్నది సత్యభామ.

"ఆకలండోయ్.. మీరు బ్రహ్మాచారి కదాని అన్నీ తెచ్చాను. బిస్కెట్లు, కాఫీ, లంచ్..." అన్నది వసుంధర సంచుల్ని సరంజామాని బెడ్‌రూమ్‌లోకి తెస్తూ.

నవ్వాడు కృష్ణమూర్తి వాటిని చూసి. అపుడు అతని ముఖాన్ని పరిశీలనగా చూసింది వసుంధర.

"ముక్కుమీద కాటుక! ఎవర్ని ముద్దెట్టుకున్నారు?" అడిగింది పడిపడి నవ్వుతూ. అప్పుడు గుర్తొచ్చింది కృష్ణమూర్తికి. ఇందాక భామను అవతలగదిలోకి పంపేటప్పుడు అంటిఉంటుంది. ఉలికిపడి అద్దం చూసుకుని తుడుచుకున్నాడు.



"హ...హ్హ...హ్హ... అయితే మంచం కింద దాచారన్నమాట లవర్ భామని" అన్నది.

కంగారుపడ్డాడు కృష్ణమూర్తి "మంచమే లేదు. దాని కిందెక్కడ?" అన్నాడు.

"అయితే పెరట్లో

దాచుకుంటారు" అంటూ పెరట్లోకి వెళ్ళబోయింది.

వసుంధరేదో చిన్నపిల్లనుకుంటున్నాడు కానీ ఆవులిస్తే పేగులు లెక్క బెట్టేరకం అని ఇప్పుడే అర్థమౌతున్నది తనకు.

"హలో.... అమ్మో.... అక్కడంతా పాములు" అన్నాడు కృష్ణమూర్తి గబగబ వసుంధరకు అడ్డం వెళ్ళి.



భర్త అవస్థ గమనించి పెరటి చాటున దాక్కున సత్యభామ పాములా 'బుస్' మని శబ్దం చేసి సహకరించింది.

"...ఇది కాటుక కాదు. బ్లాక్ పెయింట్. రంగు. పొద్దున మీ బొమ్మేశానుగా" అన్నాడు.

పరుపుమీద వెల్లకిల్లా పడి కెవ్వున కేక పెట్టింది వసుంధర. "అయ్యో.... ఏవయింది? బైట ఎవరైనా వింటే" అన్నాడు కృష్ణమూర్తి విహ్వలంగా.

"బ్రహ్మాచారి కన్నెపిల్లని రేప్ చేస్తున్నాడు - అనుకుంటారు.... ఒకవేళ మనం మొగుడు పెళ్ళాలమే అనుకోండి....." మరింత ఉడికించింది భామ.

గుడ్లురిమి చూసింది సత్యభామ.



"అప్పుడు అరిచినా రేప్ అనే అంటారా?" అన్నది వసుంధర.

ఆమె తెంపరితనమేంటో అర్థంకాక తలబాదుకుంది భామ. గదిలో కృష్ణమూర్తి పరిస్థితీ అలాగే ఉంది.

"ఇష్..మేడం..." అంటూ తలపట్టుకున్నాడు.

పకపక నవ్వింది వసుంధర. "అయినా నాకు లేని భయం మీకెందుకండీ...? ఎనీవే...మనిద్దరికీ మొగుడూ పెళ్ళాల్లేరు. మనం పెళ్ళాడేస్తే?" ఉడికించింది వసుంధర.

"అమ్మో....."అన్నాడు కృష్ణమూర్తి.

"ఏం? నా అందం మీకు చాల్లేదా?"

"అబ్బే బ్బె...." అంటూ చేతులు అడ్డంగా ఊపి, "యువార్ ది లవ్లీయెస్ట్ గర్ల్" అన్నాడు.

"అయితే సరేనా?"

"ఐమీన్..యూమీన్...ఐమీన్..."

"మీనూలేదు మానులేదు. మా డాడికి ఫోన్ చేసి చెప్పేస్తాను".

"మా ఇంట్లో ఫోన్ లేదండీ..నేను బీదవాణ్ణి కదా.."

"ఓ ..అన్నట్లు ..మీలాంటి బీదవాళ్ళు నాలాంటి గొప్పదాన్ని పెళ్ళాడితే డబ్బు కోసమే కదా..." అన్నది వసుంధర కృష్ణమూర్తి మీది కొస్తూ.

"అయ్యుండొచ్చుండి.." అన్నాడు కృష్ణమూర్తి ఎడంగా జరుగుతూ.

"పెళ్ళయ్యాక మీరు నన్ను మోసం చేసి దోచుకోరని గ్యారంటీ ఏంటి?"

"ఏమీ లేదు"

"మీరిస్తారా?"

"ఇవ్వను"



"ఏం, మీరు మంచాళ్ళే కదా..."

"అవకాశాన్ని బట్టి మంచివాళ్ళు చెడ్డవాళ్ళవ్వచ్చు. అవకాశం లేకపోతే చెడ్డవాళ్ళుకూడా చేతకాక మంచి వాళ్ళుగా మిగిలిపోవచ్చు. వృద్ధనారీ పతివ్రతః హ..హ్హా...హ్హా.... పగలబడి నవ్వాడు కృష్ణమూర్తి.

పరుపు మీద పడి పొట్టపట్టుకుని నవ్వింది వసుంధర. "అయితే నేను మిమ్మల్ని పెళ్ళాడటం ప్రమాదం " అన్నది.

"చాలా...నేను తాడులా కనిపించే త్రాచుపామును"బెదిరించాడు కృష్ణమూర్తి.

"అయితే మనకు పెళ్ళొద్దు" అన్నదామె

"ఖచ్చితంగా వద్దు. హైలీ డేంజరస్"చెప్పాడు కృష్ణమూర్తి.



"మీరు నిజంగా పాముల వాళ్ళే అయితే ఇలా చెప్పరు. మీరు నిజంగా తాడు ముక్కగారే . అందుకే ఐలైక్ యూ..ఐలవ్ యూ" అన్నది వసుంధర కృష్ణమూర్తికి దగ్గరగా జరుగుతూ.

ఏం మాట్లాడాలో తోచలేదు. దిక్కుమాలిన నవ్వు నవ్వాడు కృష్ణమూర్తి.

"హమ్మో...ఆకలాకలి... రండి.... భోంచేద్దాం..మా ఇంట్లోంచి క్యారియర్ తెప్పించాగా" అన్నది వసుంధర. నిట్టూర్చాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తిని మూడు చెరువుల నీళ్ళుతాగించి వెళ్ళిపోయింది వసుంధర కిలకిల నవ్వుకుంటూ.

వసుంధర వెళ్ళగానే బుసబుసలాడుతూ వచ్చింది భామ. చీపురుతో గదంతా శుభ్రంగా చేస్తున్నది. వసుంధర, తన భర్త తినగా మిగిలిన బిస్కెట్లను, వాటి రేపర్లను, చెత్తాచెదారాన్నంతా విసిరి కొట్టింది బయటకు.



"అరెరె...... అందులో బిస్కెట్లు, చాక్లెట్లు ఇంకాచాలా ఉన్నాయి. మా చెల్లాయి, మీ తమ్ముడు తింటారుగా..." అన్నాడు కృష్ణమూర్తి.

భామ సమాధానం చెప్పకుండా అన్నింటిని చేతిలోకి తీసుకుని బయటకు చెత్తకుండీలో పారేసింది.

"ఎచ్చిలి చైదదు ఆరుం కళికిల్లా..." అంది మలయాళంలో.

"భామా...డోన్టాక్ నాన్సెన్స్" అన్నాడు కోపంగా.

"ఎంగిలి సరుకెవ్వరూ ఏరుకు తినరు" అన్నది భామ అవతలికెళ్తూ.



పెద్దగా నవ్వాడు కృష్ణమూర్తి.

"ఎంగిలి ఎంగిలి అనుకోవడమే కానీ లోకంలో పెద్ద పెద్దవే ఎంగిలివి. నదిలో నీటిని చేపలు ఎంగిలి చేస్తాయి. గాలిని మనం పీల్చేముందు కాకులు, పిచ్చుకలు, లారీలు, బస్సులు, కార్లు ఎంగిలి చేస్తాయి. ఇహపోతే ఆవు ఇచ్చే పాలను దూడ ఎంగిలి చేస్తుంది. ఆ పాలని పాలమనిషి నీళ్ళుకలిపి ఎంగిలి చేస్తుంది. ఎంగిలి కాకుండా ఉండగలిగేది ఒక్కటే. మనసు" ఉపన్యసించినట్టే ఇచ్చి సుత్తి కొట్టాడు కృష్ణమూర్తి .

భామకు కోపం తెప్పించింది అదే.. అసలే భర్తమీద అనుమానం పెరుగుతున్నది. వసుంధర వలలోపడి డబుల్‌గేమ్ ఆడుతున్నాడేమోనని సందేహం. కానీ అటువంటివాడు కాదేమోనని మరోవంక శంక. కానీ పరిస్థితులు, భర్త ప్రవర్తన అనుమానాస్పదంగా తోస్తున్నాయి. అందుకేనేమో"దాన్ని మనిషి ఎంగిలి చేస్తున్నాడు" అన్నది కోపంగా పరుపుమీది దుప్పటిని లాగి అవతల పారేస్తూ.

"దుప్పటి కూడా ఎంగిలేనా ?" అన్నాడు కృష్ణమూర్తి.

"కాదా...!?ఎక్కి తైతక్కలాడి తొక్కిపారేశారు. నాకు చిరాకు. కంపరం" అన్నది కోపంగా.

"కానీ రేపట్నుంచీ ఆవిడగారికి తైతక్కలు నేర్పే అంటీవి నువ్వే..."

అన్నాడు కృష్ణమూర్తి వెటకారంగా.



భామ ఉరిమి చూసింది. ఆ కళ్ళలో అగ్నిపూలు చూసి బెదిరిపోయాడు కృష్ణమూర్తి .

''అమ్మో... అదేమిటి? సత్యభామాగ్రహమా? వై? '' అన్నాడు వసుంధర ఫోటో వంక చూస్తూ.

"భామాగ్రహమో రామాగ్రహమో... పరాయి వాళ్ళు గుడ్లువెళ్ళబెట్టి నిలేసి చూస్తూంటే పడుకోలేను. మీకు బాగుండచ్చు" అన్నది భామ గోడకు వేలాడుతున్న వసుంధర ఫోటోవంక కోపంగా చూస్తూ.

"ఇక్కడ పరాయి వాళ్ళెవరున్నారు?" అని వసుంధర ఫోటోను గమనించి "ఓహో... అదా... గోడమీద బొమ్మకే ఇంతలా అయిపోతే ఎలా?" నవ్వాడు కృష్ణమూర్తి.

" ఆఫీసులో గోడమీద నా బొమ్మపెడితే- వాడివి వళ్ళంతా కళ్ళు- అని మీరు వార్నింగ్ ఇవ్వలే? ఈ బొమ్మకు కళ్ళు కూడా వళ్ళే" దెప్పింది భామ.

"అదా...అదివేరు-ఇదివేరు"

''అవును... తాను చేసేది శృంగారం...'' అన్నది భామ వెక్కి వెక్కి ఏడుస్తూ .



సీరియస్ అయిపోయాడు కృష్ణమూర్తి.

''తను చేసేది శృంగారం కావచ్చు నేను చేసేది మాత్రం వ్యభిచారం కాదు" అన్నాడు భామ కళ్ళలోకి సూటిగా చూస్తూ .

భామలో అపార్థపు పొరలు తొలగలేదు. అనుమాన బీజం అనేది మనసులోనే నాటుకుంటే ఎలాంటి ఎరువు వెయ్యకపోయినా మహావృక్షమౌతుంది. దాన్ని మొదట్లోనే మొదలు నరికితే జీవితం నల్లేరు మీద బండి నడకౌతుంది. లేకుంటే కష్టాలు తప్పవు.

కృష్ణమూర్తి ఎంత వివరణ ఇచ్చినా భామ మొండితనం వీడలేదు. చాప, దిండు, దుప్పటి తీసుకుని సావిట్లోకి వెళ్ళబోయింది. కృష్ణమూర్తి అడ్డుపడ్డాడు.

"తప్పు..నువ్వు సావిట్లో పడుకుంటే రెండుకాదు. పద్దెనిమిది కళ్ళు మనలను చూస్తాయి" అన్నాడు .

భర్త వంక ఆశ్చర్యంగా చూసింది భామ. ఆ కళ్లలో కనిపించిన సూటిదనానికి నిర్ఘాంతపోతూనే తగ్గిపోయింది.

"ప్లీజ్..లోపలకు పద" అన్నాడు. మౌనంగా అతన్ని అనుసరించింది.

కృష్ణమూర్తి తలుపు వేసేశాడు.



''ఆ దెయ్యపు బొమ్మని పీకేస్తాను, చింపేస్తాను, నమిలేస్తాను, ఓకే!?'' అన్నాడు కృష్ణమూర్తి సరదా మూడ్‌లోకి తెస్తూ.

భామ కొంచెం ప్రసన్నమైంది. "హు...హు... నమిలేస్తే! ఛ... ఎంగిలి. వద్దు" అన్నది కొంటెగా.

సరసుడు, రసికుడైన భర్తకు భార్యనుంచి ఆ మాత్రం స్పందన చాలు. ప్రతి స్పందన ఎలా ఉంటుందో వివరంగా చెప్పనక్కర్లేదు. ఇద్దరూ కలిసి పట్టెమంచం పరుపు మీద పడ్డారు-గోడ మీద పటంలో వసుంధర కన్నుకొట్టి ఈలవేసినట్టుగా కనిపించింది ఇద్దరికీ.

**(ఇంకావుంది)**

## హిందీ సినీ సంగీతంలో మైలురాళ్లు-మజిలీలు

### 1964

'వో కౌన్ థీ' చిత్రంలోని 'నైనా బర్‌సే రిమ్‌జిమ్ రిమ్‌జిమ్','లగ్ జా గలే కి ఫిర్ యే', 'జో హమ్నే దాస్తాన్' పాటలు లతా, మదన్‌మోహన్‌ల కాంబినేషన్ ఎంతటి సక్సెస్‌ఫుల్లో నిరూపిస్తే, 'ఛోడ్ కర్ తేరే ప్యార్ కా దామన్' (లతా-మహేంద్రకపూర్), 'శోఖ్ నజర్ కి బిజిలియాఁ, దిల్ పే మేరే గిరాయే'(ఆశా) ఈ చిత్రంలోని హిట్ గీతాలు.




'జహాఁ ఆరా' చిత్రంలోని 'ఐ సనమ్ ఆజ్ యే కసమ్ ఖాయేం, ముడ్ కే అబ్ దేఖనే....'(లతా, తలత్), 'ఫిర్ వోహీ షామ్ వహీ గమ్ వహీ తన్హాయీ హై..'(తలత్), 'మై తేరీ నజర్ కా సురూర్ హూఁ' పాటలు మంచి హిట్ అయ్యాయి. ఒక విధంగా తలత్ మెహమూద్ పాడిన పాటలలో చివరి హిట్స్‌గా వీటినే చెప్పుకోవాలి.

చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయే గీతాలను 'హకీకత్' చిత్రం కోసం కైఫీ అజ్మీ రాశారు. 'హోకే మజ్‌బూర్ ముఝే ఉసనే భులాయా హోగా...' (భూపేంద్ర, రఫీ, తలత్) అంటూ (కవ్వాలి గాయకుడు భూపేంద్ర కు ఇది తొలి చిత్రం. ఆయన పాడిన పంక్తులను ఆయనపైనే చిత్రీకరించటం ఓ విశేషం.) తెరపై తరహాలో సాగే గీతం ఆధారంగానే 33 సంవత్సరాల తరువాత 'బోర్డర్' చిత్రం కోసం 'సందేసే ఆతే హై' అంటూ జావేద్ అఖ్తర్ అద్భుతమైన గీతాన్ని మలిచారు. 'జరా సీ ఆహట్'(లతా) ఓ ముగ్ధ ప్రేమగీతం.'కర్ చలే హమ్ ఫిదా జాన్ - ఓ- తన్ సాథియో॰' అంటూ రఫీ పాడిన గీతం ఇప్పుడు విన్నా ఒళ్లు గగుర్పొడుస్తుంది.

'కశ్మీర్ కి కలీ' చిత్రంతో ఓ.పి.నయ్యర్ మరో సూపర్‌హిట్ కొట్టారు. ఈ సినిమా కోసం ఓ.పి. మొత్తం 56 ట్యూన్స్ ఇచ్చారని అందులోనుండి ఆణిముత్యాల్లాంటి 9 ట్యూన్స్ సెలెక్ట్ చేసుకుని, ఆ ట్యూన్స్ చుట్టూనే ఆ చిత్రకథ అల్లారని అంటుంటారు కొందరు. ఆ చిత్ర దర్శకుడు శక్తి సామంతా ఇదంతా కట్టుకథ అని కొట్టి పారేస్తారు. సరిగ్గా 26 సంవత్సరాల తరువాత నిర్మితమైన 'ఆషికి' చిత్రం కూడా ఇదే తరహాలో వార్తల్లోకి వచ్చింది.




'తారీఫ్ కరూఁ క్యా ఉసకీ...'(ఈ పాటలో తారీఫ్ అని వచ్చిన ప్రతీసారి రఫీ ఒక్కోరకంగా తన గొంతును పలికిస్తే, దానికి తగ్గట్లుగా షమ్మీకపూర్ నటించటం ఓ విశేషం. ఈ పాట సాహిత్యం ఇదే సంచికలో 31వ పేజీలో చూడవచ్చు)'దీవానా హువా బాదల్'(ఆశా, రఫీ), 'ఇశారోం ఇశారోం మే'(ఆశా, రఫీ), 'బల్‌మా ఖులీ హవా మే॰'(ఆశా), 'హై దునియా ఉసీకీ'(రఫీ), 'కిసీ నా కిసీసే'(రఫీ) పాటలు ఎప్పటికీ హిట్సే కదా..!

- వచ్చే సంచికలో మరికొంత...



# లలిత సంగీతం

ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## మనదేశం భారతదేశం

ప॥ మనదేశం భారతదేశం
మనరాష్ట్రం ఆంధ్రప్రదేశం
శుభచరిత సుగుణోపేత
జనవినుత మహిమోపేత
మాతా భరతమాత -మన
మాతా భరత మాతా ॥మనదేశం॥

చ॥ కులభేదం మనకెందుకని లేనేలేదు
మత భేదం మనకెందుకని రానేరాదు
కర్షకులం మనమందరము - కార్మికులం మనమందరము
కర్షకులం కార్మికులం అందరము మనమందరము
కష్టించి పనిచేస్తాము కలిసి మెలసి జీవిస్తాము ॥మనదేశ॥

చ॥ మనతల్లి దీవెనలుంటే మనబాపు మాటలు వింటే
సాధించనిదేముంటుంది బాధనేది ఏముంటుంది
మట్టిలోని బంగారం మనిషిలోని అనురాగం
చెట్టుపుట్టలన్నీ మనవే చేలన్నీ మనవే మనవే ॥మనదేశం॥

చ॥ తెలుగు తల్లి కోవెలలోన పలికింది పావనవీణ
ఏడుకోట్ల తెలుగు ప్రజాళి ఆనందంగా వుండాలి
మువ్వన్నెల జెండా అదిగో హరివిల్లై విరిసిందదిగో
ఆ జెండా నీడల్లోనే ఐక్యంగా జీవించాలి ॥మనదేశం॥

బృందగానం

**రచన** : కీ॥శే॥డా॥ దాశరథి
**సంగీతం** : చిత్తరంజన్
**రాగమాలిక** : పట్‌దీప్ - (హిందుస్తాని రాగం)
**తాళం** : చతురశ్రగతి (కర్ణాటక సం॥) కహరువా(హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : స గ మ ప నిస
**అవరోహణ** : స ని ద ప మ గ రి స
- షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం,కాకలి నిషాదం ఆరోహణలోను,
-షడ్జము, కాకలి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, సాధారణ గాంధారం, చతుశృతి రిషభం అవరోహణ లోను వుండేస్వరాలు.

**చంద్రకౌస్** : (హిందుస్తాని రాగం)
**ఆరోహణ** : స గ మ ద నిస
**అవరోహణ** : స ని ద మ గ స
- షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు

**ఆందోళిక** : (కర్ణాటక సంగీతంలో ని రాగం)
**ఆరోహణ** : స రి మ ప నిస
**అవరోహణ** : స ని ద మ రి స
- షడ్జము, చతుశృతి రిషభం,శుద్ధమధ్యమం,పంచమం కైశికి నిషాదం ఆరోహణలోను,
-షడ్జము,కైశికి నిషాదం, చతుశృతి దైవతం,శుద్ధ మధ్యమం, చతుశృతి రిషభం అవరోహణలోనూ వుండే స్వరాలు.

**బృందావన సారంగ :**
**ఆరోహణ** : స రి మ ప నిస
**అవరోహణ** : స ని ప మ రి స
- షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం,కాకలి నిషాదం ఆరోహణలోను,
-షడ్జము, కైశికి నిషాదం,పంచమం,శుద్ధమధ్యమం, చతుశృతి రిషభం అవరోహణలోను వుండే స్వరాలు.

కర్ణాటక సంగీతంలోని గౌరిమనోహరి రాగం 23వ మేళకర్త. ఆ మేళ కర్తకు జన్యరాగమే పట్ దీప్ అనే హిందుస్తాని రాగం. ఈ రాగం హిందుస్తాని సంగీతంలో బహుళ ప్రచారంలో వున్నది. లలిత సంగీతంలో కూడా యీ రాగం ప్రాచుర్యాన్ని పొందినది. చలన చిత్రాలలో, ఆకాశవాణి లోను కూడా యీరాగాన్ని ఉపయోగించి స్వరకర్తలు సుమధురమైన బాణీలను కూర్చారు. అలాగే చంద్రకౌస్ కూడా హిందుస్తాని సంగీతంలో పాప్యులర్ అయిన రాగమే. లలిత సంగీతంలో కూడా యీ రాగం ప్రాచుర్యాన్ని పొందినది. కర్ణాటక సంగీతంలోని ఆందోళిక 28వ మేళకర్త అయిన హరి కాంభోజి రాగానికి జన్యరాగం. ఈ రాగంలో త్యాగరాజస్వామి విరచితమైన 'రాగ సుధారస పానము జేసి రంజిల్లవే ఓ మనసా" అనే కీర్తన చాలా ప్రసిద్ధి చెందినది. లలిత సంగీతంలో యీ రాగాన్ని స్వరకర్తలు సాధారణంగా ఉపయోగించరు. శాస్త్రీయ సంగీతంలోనే యీ రాగంలో యితర వాగ్గేయకారుల కీర్తనలు ఉన్నట్లుగా తోచదు. అరుదైన యీ రాగాన్ని "మనదేశం భారత దేశం" అనే పాటలోని ఒక చరణానికి ఉపయోగించి బాణీని నేనుకూర్చాను. బృందావన సారంగ రాగం బృందావని అని కూడా పిలువబడుతుంది. శ్రీ బాలమురళీగారి తిల్లాన యీ రాగంలో బాగా ప్రసిద్ధి చెందినది. లలిత సంగీతంలో యీ రాగం ప్రాచుర్యంలో వున్నది. చలన చిత్రాలలోను,ఆకాశవాణిలోను కూడా స్వరకర్తలు యీ రాగం ఆధారంగా చాలా పాటలు మనకు అందించారు.



దాశరథి

1982 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవాన్ని పురస్కరించుకుని డా॥దాశరథి గారు రచించిన దేశభక్తి గీతం "మనదేశం భారత దేశం" ఆకాశవాణిలో ఉదయం "మాతృవందనం" కార్యక్రమానికై నా సంగీత సారథ్యంలో బృందగీతంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ప్రసారం చేసింది.



## పట్‌దీప్, చంద్రకౌన్స్, ఆందోళిక, బృందావన సారంగ్ రాగాలు ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. కన్నుల దాగిన అనురాగం | రంగుల రాట్నం | పి.బి. శ్రీనివాస్, పి.సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 2. మేఘాఛాయీ ఆధీరాత్ | షర్మిలీ(హిందిచిత్రం) | లత | యస్.డి. బర్మన్ |
| 3. ఎవరో రావాలి | ప్రేమ్‌నగర్ | సుశీల | కె.వి.మహదేవన్ |
| **చంద్రకౌన్స్** | | | |
| 1. ఆకాశాన సూర్యుడుండడు సందెవేళకి | సుందరకాండ | చిత్ర/బాలు | కీరవాణి |
| 2. గాలిలో నాబ్రతుకు తేలిపోయినదోయి | ప్రయివేటు గీతం | ఘంటసాల | ఘంటసాల |
| 3. అణువూ అణువున వెలసిన దేవా | మానవుడు -దానవుడు | బాలు, బృందం | అశ్వత్థామ |
| **ఆందోళిక** | | | |
| రాగసుధారసపానము జేసి (త్యాగరాజ కీర్తన) | మిస్సమ్మ | పి.లీల | యస్. రాజేశ్వరరావు |
| **బృందావన సారంగ** | | | |
| 1. పరుగులు తీయాలి | మల్లీశ్వరి | ఘంటసాల, పి. భానుమతి | యస్. రాజేశ్వరరావు |
| 2. చూపులు కలిసిన శుభవేళ | మయాబజార్ | ఘంటసాల, లీల | ఘంటసాల |
| 3. ఓడను జరిపే ముచ్చట కనరే | రాజేశ్వరీ కళ్యాణం | బాలు, చిత్ర | కీరవాణి |

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : సూర్య మ్యూజిక్
వెల : రూ.35/-

'ఆడుతూ... పాడుతూ...' అనే ఫుల్‌లెంగ్త్ కామెడీ చిత్రాన్ని అందించిన దర్శకుడు దేవీప్రసాద్ తాజాగా 'లీలామహల్ సెంటర్' అనే చిత్రానికి దర్శకత్వం వహించాడు. ఆర్యన్‌రాజేష్, సదా ఈ చిత్రంలో హీరో హీరోయిన్లు. కామెడీ మీదనే కాక మ్యూజిక్‌లో కూడా తనకు మంచి టేస్ట్ ఉందని నిరూపించుకునేలా ఈ చిత్రంలోని పాటలకు మంచి ట్యూన్‌లను రాబట్టుకున్నారాయన. ఎస్.ఎ.రాజ్‌కుమార్ స్వరపరిచిన ఈ చిత్రంలోని గీతాలు సూర్య మ్యూజిక్ ద్వారా విడుదలయ్యాయి.

ఆడియోలో తొలుత వినిపించే 'ఆ తుమ్మెద రెక్కలనడుగు ఈ పువ్వుల మొక్కలనడుగు' పాటని ఉదిత్‌నారాయణ్,సుజాత పాడేరు. ఎస్.ఎ.రాజ్‌కుమార్ కి చేదోడు వాదోడుగా వ్యవహరించే ఇ.యస్.మూర్తి ఈ పాటను రాశారు. లోగడ సూర్యవంశం, రాజా, నువ్వు వస్తావని వంటి చిత్రాలలోను, ఇటీవల'స్వామి' చిత్రంలోను పాటలు రాశారాయన. ఎస్.ఎ.రాజ్‌కుమార్ రెగ్యులర్ మెలోడీ ఫార్మాట్‌లోనే ఉంటుందీ పాట. 'బర్సాత్'(1949) సినిమాలో శంకర్‌జైకిషన్ స్వరపరిచిన 'హవామె ఉడ్‌తా జాయే మెర లాల్ దుపట్టా మల్‌మల్' పాట పల్లవి ట్యూన్‌ని ఈ పాట పల్లవి టేకాఫ్ కు ప్రేరణగా తీసుకున్నారని రవంత అనిపించటం సహజం.

'బాలామణెమ్మో బాలామణెమ్మో' అనే పాటను సుద్దాల అశోక్‌తేజ రాయగా శంకర్‌మహదేవన్, మాలతి బృందం పాడేరు. ఇందులోని 'దసరనాడు విడుదలైన హిట్టు సినిమాలా' అనే సాకీని ఎస్.ఎ.రాజ్‌కుమార్ ఆలపించారు. 1978 లో 'వయసు పిలిచింది' అనే చిత్రం ఒకటొచ్చింది. కమల్‌హాసన్, రజనీకాంత్ అందులో నటించారు. ఆ సినిమాలో ఇళయరాజా స్వరపరిచిన 'మబ్బే మసకేసిందిలే' అనే పాట ట్యూన్ ఆ రోజుల్లో దక్షిణాదిన అన్నిభాషల్లోనూ ఓ ఉపు ఊపేసింది. ఆ పాట సాకీ 'ముత్యమల్లే మెరిసిపోయే మల్లెమొగ్గా' అంటూవస్తుంది. ఆ సాకీ వరసని, ఈపాట సాకీకి వాడుకున్నారు. అంతేకాదు 'మబ్బే మసకేసిందిలే' ట్యూన్‌ని ఈ పాటలోని 'అబ్బో బల్లే బల్లే- దీని ఒళ్ళే బబ్బుల్‌గమ్ బిళ్ళ బళ్ళే' అనేలైన్‌కి , తర్వాత అలా వచ్చేలైన్లకి వాడుకున్నారు. ఒరిజినల్ పాట మీదున్న మమకారమే ఈ ప్రేరణకు కారణమని తెలిసేలా స్వతంత్రంగా రూపొందించిన మిగిలిన పాట తెలియజేస్తుంది. ఈ లైన్లకు అశోక్‌తేజ వేసిన కాయినింగ్స్ అన్నీ చాలా సరదాగా ఉన్నాయి.

సాయి శ్రీహర్ష రాసిన 'ఓ హంపి బొమ్మ ఎల్లోర గుమ్మ కళ్ళార్పలేనమ్మా' పాటను హరిహరన్, సుజాత పాడేరు. ఇది కూడా ఎస్.ఎ.రాజ్‌కుమార్ రెగ్యులర్ మెలోడీ ఫార్మాట్ లోనే ఉంటుంది. 'గుట్టు అంటూ శూన్యం -గుండెల్లో ప్రేమధన్యం-దేహాలు అన్ని దానిసైన్యం' అంటూ ప్రేమ గురించి సాయి శ్రీహర్ష ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్ ప్రశంసార్హంగా ఉంది. అంతే కాదు..'శకం' కి బహువచనంగా 'శకాల ప్రేమ' అంటూ ఓ పదాన్ని వాడారాయన ఈపాటలో. తమకి ఏమాత్రం అర్థం కాకపోయినా రచయితను అడగకపోవటాన్ని అటుంచి, నిర్మాణ బృందంలో ఎవరో ఒకరు స్వతంత్రించి తమకు తోచిన ఏదో ఒక మాట వేసేసి సర్దేసే ఈ రోజుల్లో ఇలాంటి ప్రయోగాలు యధాతథంగా రికార్డింగ్ దాకా వెళ్ళడం అదృష్టమే. కాకపోతే ఆ మాటను 'షకాల'అంటూ హరిహరన్ పాడటం దురదృష్టమే.

సుద్దాలఅశోక్‌తేజ రాయగా చిత్ర ప్రధాన గాయనిగా పాడిన 'సిరిమల్లే వువ్వల్లే నవ్వులే చల్లుతూ' పాట మెలోడి ఓరియెంటెడ్‌గానే కాకుండా చక్కని బీట్‌తో విన్నవారి మనసు మంచి ఊపందుకునేలా రూపొందింది. సుద్దాలఅశోక్‌తేజ కూడా ఈ పాటని మనసుపెట్టి రాశాడనిపిస్తుంది. 'అపురూపమైన ఈ లోకంలో మనం నూరేళ్ళ అతిథులం' అని చెప్పటంలో మంచి ఎక్స్‌ప్రెషన్ ఉంది. ఆడియోలో గల మిగిలిన పాటలతో పోలిస్తే ట్యూన్‌పరంగా ఈపాట పోకడ భిన్నంగా, ఆకర్షణీయంగా ఉంది. ఈ పాటలో చిత్రతో పాటు ఎస్.ఎ.రాజ్‌కుమార్, డా॥నారాయణ్ కూడా గొంతు కలిపారు. నారాయణ్‌గారు హోమియోపతి డాక్టరు. ఎస్.ఎ.రాజ్‌కుమార్ స్వర కల్పన చేసిన పాటల్లో ఆయన పాల్గొంటూ ఉంటారు. కాకపోతే - వీరి పేర్లు ఆడియో ఇన్‌లే కవర్‌పై కనిపించవు.

సుద్దాల అశోక్‌తేజ రాయగా యస్.పి.బాలసుబ్రహ్మణ్యం పాడిన 'గాలికి తెలియని రాగాలున్నవి' పాటకి 'రెగ్యులర్ సాంగ్' అనే ముద్రను వెయ్యరాదు. గుండెల్లోతుల్లోంచి పాతాళగంగలా ఎగజిమ్మిన సాహితీ విజృంభణ - శ్రుతిశుద్ధంగా, లయబద్ధంగా చెవులకు సక్రమంగా చేరడానికి స్వరపరంగా నిర్మించిన వంతెన లాంటి ప్రయత్నంగా అభివర్ణించాలి. శ్రీశ్రీ రాసిన 'నేను సైతం' కవితకు 'ఠాగూర్'లో కొనసాగింపు ఇచ్చాక సుద్దాలఅశోక్‌తేజకి అదే ధోరణిలో పాటలు రాసే అవకాశాలు ఎక్కువగా వస్తున్నాయని ఈ'గాలికి తెలియని రాగాలున్నవి' నిరూపిస్తుంది.

చరణాలలో - మాటల కందని హిందోళం, మనసుకు చెందని మధ్యమావతి,శివునికి తెలియని శివరంజని, చివరకు మిగలని శ్రీరంజని - అనిఎందుకు రాయవలసివచ్చిందో ప్రజలకు తెలియటానికి అశోక్‌తేజ ఓవ్యాసాన్ని పత్రికా ముఖంగా అందిస్తే బావుంటుంది. మిగిలిన వర్ణనలు కాస్త ఆలోచిస్తే అర్థమయ్యే అవకాశం ఉంది కానీ హిందోళం, మధ్యమావతి, శివరంజని, శ్రీరంజని వంటి రాగాల పేర్లు ఉపయోగించటంలో గల సాహితీ ప్రయోజనాన్ని తేట తెల్లం చేయగలిగేది కవి హృదయం ఒక్కటే! వీటన్నిటినీ పక్కన పెట్టేసి - మంచి పదాలు వాడే అదృష్టం - భాషా జ్ఞానం పెంపొందింపచేసుకోవడానికి పనికొచ్చే ప్రయోగాలు చేసే అవకాశం - ఈ పాట ద్వారా ఓ సినీకవికి కలిగినందుకు సంతోషించాలి. బాలసుబ్రహ్మణ్యం పాడబట్టే సదరు అక్షరాలకు అమృత స్పర్శసోకిందని చెబితే -స్పష్టంగా వినబడినప్పుడే ఆ సంగతి అర్థమైందనే వారుంటారు కనుక పునరుక్తి ప్రసక్తి వద్దు.

ఈ'గీతా'నికి ముందు బాలుచేత, ఏ సైడు దీపిక చేత పాడించిన 'చిట్టీ చిలకమ్మా అమ్మకొట్టిందా' బిట్, బీ సైడు బిగినింగ్‌లో 'పరమ పావన పాప యోచన' అంటూ కల్పన చేసిన స్వరాలు అన్నీ బావున్నాయి. ■

# జంధ్యా మారుతం





4

## ప్రణయ జీవుల కోసం జంధ్యాల రాసిన భగవద్గీత



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

గోపాలరెడ్డి రమేష్‌నాయుడు జయకృష్ణ



'ముద్దమందారం', 'నాలుగు స్తంభాలాట' చిత్రాలతో జంధ్యాల పట్ల యువతరం ప్రేక్షకుల్లో ప్రత్యేక ఆరాధనాభావం ఏర్పడింది. ఆ నేపథ్యంలో యువతరం కోసం జంధ్యాల ప్రత్యేకంగా రూపొందించిన చిత్రం 'రెండు జెళ్ళ సీత'.

జంధ్యాలకి కె.విశ్వనాథ్ అంటే ఎంతటి గౌరవాభిమానాలున్నాయో, బాపు-రమణలంటే కూడా అంతే!. ముళ్ళపూడి వెంకటరమణ- మాటల్లో హాస్యాన్ని అందంగా పొదిగిస్తే, మాటల్ని హాస్యరసంలో ముంచి తేల్చిన ఘనత జంధ్యాలది. ముళ్ళపూడి వెంకట రమణ 'బుడుగు' భాషలో సృష్టించిన కాయినింగే 'రెండు జెళ్ళ సీత'. బోలెడంత అందంగా కాస్తంత అమాయకంగా ఉండే అమ్మాయిని.... అబ్బాయిలంతా 'రెండు జెళ్ళ సీత' అనేసుకునేవారు. అలాంటి కుర్రకారు డ్రీమ్‌గర్ల్ అయిన 'రెండు జెళ్ళ సీత'ని తనదైన హాస్యపంథాలో తెరకెక్కించారు జంధ్యాల.

నలుగురు కుర్రాళ్ళు ఓ అమ్మాయిని ప్రేమిస్తారు. ఆ అమ్మాయి అప్పటికే వేరే అబ్బాయిని ప్రేమించి కట్నపిశాచి దురాగతం వల్ల అతనికి దూరమైపోతుంది. ఈ నలుగురు కుర్రాళ్ళు ఆ అబ్బాయిని సంస్కరించి ఇద్దరి పెళ్ళి జరిపిస్తారు. ఇదే ఈ చిత్ర మూలకథాంశం. ప్రథమార్థం క్రేజీగానూ, ద్వితీయార్థం కొంచెం సెంటిమెంట్‌తోనూ నడుస్తుంది.

ఇందులో నలుగురు కుర్రాళ్ళుగా నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్ లు నటించారు. ఈ నలుగురూ ఒకరకంగా తెలుగు తెరకి కొత్తవాళ్ళే. ప్రముఖ నటి, దర్శకురాలు విజయనిర్మల తనయుడైన నరేష్ 'పండంటి కాపురం'లో ఎస్వీఆర్ మనవడిగా, 'దేవదాసు'(కృష్ణ) లో చిన్నప్పటి దేవదాసుగా నటించి, 'ప్రేమ సంకెళ్ళు'తో హీరోగా తెరంగేట్రం చేసాడు. దర్శకుడిగా జంధ్యాల తొలి చిత్రం 'ముద్దమందారం'తో హీరోగా పరిచయమైన ప్రదీప్ ద్వితీయవిఘ్నం లేకుండా 'మల్లెపందిరి' లో కొద్దిసేపు కనిపించారు. 'నాలుగు స్తంభాలాట' లో కూడా హీరోగా నటించారు. ఆ తర్వాత నటించిన చిత్రమిది. ఇదే ఆయన ఆఖరి చిత్రం కూడా. ఈ సినిమా తర్వాత ప్రదీప్ ఏ

సినిమా చేయలేదు. చదువుకే తొలి ప్రాధాన్యమిచ్చిన ప్రదీప్, అటుపై బుల్లితెర్పై అగ్రపీఠాన్ని అలంకరించారు. శ్రీలక్ష్మి సోదరుడైన రాజేష్ ని 'నెలవంక' సినిమాతో జంధ్యాల హీరోని


నరేష్

చేసారు. ఆ తర్వాత రాజేష్ నటించిన సినిమా ఇది. తరువాతి రోజుల్లో 'మయూరి' శుభాకర్‌గా పేరుతెచ్చుకున్న శుభాకర్ కి ఈ చిత్రం మంచి గుర్తింపును తీసుకువచ్చింది.

హీరోయిన్ మహాలక్ష్మి ప్రేమికుడిగా సినిమాలో కనిపించిన అబ్బాయి పేరు కమలాకర్. ఇతగాడు ఓ సినిమాలో హీరోగా కూడా చేసాడు.

'రాము' సినిమా గుర్తుంది కదూ. అందులో ఎన్‌టిఆర్ తో కలిసి 'పచ్చని చిలుకలు రెండు' పాటలో నటించినావిడ పేరు పుష్పలత. అలా తెలుగు ప్రేక్షకులకు సుపరిచితురాలైన పుష్పలత కూతురు మహాలక్ష్మిని ఈ చిత్రంలో హీరోయిన్‌గా ఎంపిక చేసారు జంధ్యాల. కన్నడంలో కొన్ని సినిమాల్లో నటించిన మహాలక్ష్మికి తెలుగులో మాత్రం ఇదే తొలి ప్రయత్నం. పుష్పలత కూడా ఇందులో నటించారు. అది కూడా మహాలక్ష్మికి తల్లిగానే...

అమాయకపు ఇల్లాలి పాత్రలకు పెట్టింది పేరుగా భాసిల్లిన శ్రీలక్ష్మికి హాస్యనటిగా మంచి ముద్ర వేసిన చిత్రం 'రెండు జెళ్ళ సీత'. 1954లో వచ్చిన 'అమర సందేశం' వంటి చిత్రాల్లో హీరోగా నటించిన అమర్‌నాథ్ కూతురే ఈ 'శ్రీలక్ష్మి'. తమిళంలో, మలయాళంలో కొన్ని సినిమాల్లో కథానాయికగా నటించిన శ్రీలక్ష్మి 'నివురు గప్పిన నిప్పు' సినిమాలో తొలిసారిగా హాస్య పాత్ర చేసారు. ఆమె కెరీర్‌కి 'రెండు జెళ్ళ సీత' మంచి ఊతాన్నిచ్చింది. ఈ చిత్రంలో తాను ఎంపికైన విధానాన్ని శ్రీలక్ష్మి వివరిస్తూ "ఈ చిత్ర నిర్మాణ నిర్వాహకులు జయకృష్ణ మా నాన్నగారికి పర్సనల్ మేకప్‌మెన్‌గా పనిచేసేవారు. అప్పట్నుంచీ


మహాలక్ష్మి


శుభాకర్

## పాటలు

| పాటపల్లవి | అభినయం |
|---|---|
| 1. లేడి వేట.. ఇది లేడీ వేట | నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్ తదితరులు |
| 2. రెండు జెళ్ళ సీత తీపి గుండె కోత | నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్, మహాలక్ష్మి |
| 3. సరిసరి పదపదనీ నీ సరి ఎవరిక అవనీ | నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్, మహాలక్ష్మి |
| 4. మందారంలో ఘుమఘుమలై | కమలాకర్, మహాలక్ష్మి |
| 5. కొబ్బరి నీళ్ళా జలకాలాడి | 'శుభలేఖ' సుధాకర్, దేవి, నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్, మాస్టర్ చక్రవర్తి |
| 6. పురుషులలో పుణ్య పుణ్యపురుషులు వేరు | 'శుభలేఖ' సుధాకర్, నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్, అల్లురామలింగయ్య, మాస్టర్ చక్రవర్తి, వేలు తదితరులు |

**రిలీజ్**
మే, 1983

**నిర్మాణప్రాంతాలు**
వైజాగ్,అరకులోయ, విజయనగరం తదితర ప్రదేశాలు

**నిర్మాణవ్యయం**
13 లక్షల 75 వేల రూపాయలు

**వర్కింగ్ డేస్**
సుమారు 45 రోజులు

## పాత్రలు-పాత్రధారులు

| పాత్ర | పాత్రధారి |
|---|---|
| గోపి | నరేష్ (హీరో) |
| కృష్ణ | ప్రదీప్ (హీరో) |
| మోహన్ | రాజేష్ (హీరో) |
| మూర్తి | శుభాకర్ (హీరో) |
| సీత | మహాలక్ష్మి (తొలి పరిచయం) |
| కామేశ్వరరావు | 'శుభలేఖ' సుధాకర్ |
| మధు | కమలాకర్ |
| సూర్యనారాయణ | సాక్షి రంగారావు |
| సుబ్బారావు | వేలు |
| రిటైర్డ్ మేజర్ మంగపతి | వీరభద్రరావు |
| అనసూయ | శ్రీలక్ష్మి |
| కాత్యాయని | దేవి |
| సీత తల్లి | పుష్పలత |
| జ్యోతిష్య సామ్రాట్ ఏ.వి. రావు | పొట్టిప్రసాద్ |
| అప్పలకొండ | రాళ్ళపల్లి |
| రసశ్రీ | కృష్ణ చైతన్య |
| డుంబు | మాస్టర్ చక్రవర్తి. |
| సేట్‌జీ | టెలిఫోన్ సత్యనారాయణ |
| గండభేరుండం | అల్లురామలింగయ్య |

మరియు
కిరణ్, సుందరలక్ష్మి, ప్రకాశరావు, తాతబాబు, విజయకృష్ణ, రామారావు, ఎర్రాజీరావు, తాతా అప్పారావు, భాస్కర్, విశ్వనాథ్ తదితరులు.

**రచన : వేటూరి సుందరరామమూర్తి**
**గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం** 1

లేడి వేట ఇది లేడీ వేట
లేడి వేట ఇది లేడీ వేట
వేడి వేడిగా వెంటాడు వాడి వాడిగా వేటాడు
ఇది ఈ వయసు ముచ్చటరా బంగారు లేడి ఎచ్చటరా
ఎల్, ఎ, డీ, వై లేడి ఎచ్చటరా ॥ఎల్॥
చుక్క చుక్కల లేడి రామ్ భజన
సూది కన్నుల లేడి రామ్ భజన
చెంగు చెంగు మన్నాది లలన
దాన్ని చెంగుతో ముడిపెట్టగలనా
పట్టపగటి చందమామ ఇందువదన
పట్టబోతే కస్సుమంది ఎందువలన
కస్సుకాదు కిస్సు అంది పిచ్చి నాయనా
॥కస్సుకాదు॥చుక్క॥
శ్రీ మద్రమా...రమణ గోవిందో హరి ॥లేడి॥
మిత్రమా సత్రమా రుబ్బురోలు పొత్రమా
ఆత్రమా ఆగుమా ఉబ్బరాల గోత్రమా
బడాయి పప్పు లడాయి చారు
ఇటిక రాళ్ల ఇగురు గుండ్రాళ్ల గుగ్గి పులుసు
తిని పెరిగావా తిమ్మడి గారి అమ్మడు
నువ్వు కసిగా కౌగిలి పడితే మసి కాదా మానవుడు
ఓం శాంతి : శ్శాంతి శ్శాంతి : ॥లేడి వేట॥

పదాలుగా అర్థం వచ్చేట్టు, సంగీతపరంగా స్వరాలు చెప్తున్నట్టు 'సరిసరి పదపద నీ నీసరి ఎవరిక అవని' అని వేటూరి రాస్తే రమేష్‌నాయుడు అవే స్వరాలు స్వరపరంగా పడేటట్టు స్వరపరిచి స్వరాక్షర ప్రయోగం చేశారు ఈ సినిమాలో.

అలాగే 'మందారంలో ఘుమఘుమనై' పాట రమేష్‌నాయుడి మెలోడీని ధ్వని పరిస్తే, 'లేడివేట ఇది లేడీపాట' అనే పాట 'తనను స్వరపరిచింది రమేష్‌నాయుడేనా' అని ఎంతోమంది చేత ముక్కున వేలేయించింది. ఏరియాలలో కొనుక్కుందామని వచ్చిన వారు ఆ డిస్కో ట్యూన్ని, ఆ ఫాస్ట్‌ని కూర్చింది రమేష్‌నాయుడే అంటే ముందర ఆశ్చర్యపోయి తర్వాత అభినందించారట.

ఎప్పుడూ పాటల్ని ఎంతో టైమ్ తీసుకుని అనుకున్న ఎఫెక్ట్ వచ్చేవరకు వదిలిపెట్టని రమేష్‌నాయుడు 'రెండు జెళ్ల సీత' చిత్రంలోని పాటలు అరింటినీ రెండే రోజులలో కూర్చి ఓ.కే. అనిపించుకున్నారు. ఆయన స్వర జీవితానికి సంబంధించినంత వరకూ అదొక రికార్డు.

\- రాజా

**రచన : వేటూరి సుందరరామమూర్తి**
**గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం** 2

రెండు జెళ్ల సీత తీపి గుండె కోత
రెండు జెళ్ల సీతా... సీత తీపి గుండె కోత
ప్రణయ జీవులకు నీవే భగవద్గీత
ప్రణయ జీవులకు నీవే భగవద్గీత ॥రెండు॥
నీ క్రీగంటి చూపులే క్రికెట్
పడ నివ్వకు నా వలపు వికెట్
నడుం మీద జడ కుప్పెల టెన్నీసు
గుచ్చుతోంది గుండెల్లో ప్రేమ పిన్నీసు
దరికొస్తే మరికాస్త ఆడిస్తా ఓడిస్తా ॥రెండు॥
నీ అందం అప్పడమైతే నీ దర్పం దప్పళమైతే
అడ్డంగా విరిచేస్తా అన్నంలో కలిపేస్తా
ఆత్రంగా మింగేస్తా... ఆత్రంగా మింగేస్తా
ఓ సీత నా కవిత నేనేలే నీ మాతకు జామాతా ॥రెండు॥
ఓ బాలికా నా రాగ మాలికా ॥ఓ॥
నీ వదనం మోహనం చిరునవ్వే శ్రీరాగం ॥నీ॥
నీ పలుకే హిందోళం నీ నడకే ఆదితాళం ॥2॥
ఓ సీత సంగీతా దాటొద్దే నా గీతా ఓ సీతా ॥రెండు॥
వెన్నెలంటి నీ రూపు చదవాలంటే
ఆకాశం పుస్తకం నక్షత్రం అక్షరం
నీ వాలు చూపు అర్థాలు నిఘంటువులు చెప్పలేవు
నీ హంస గతులు భాష్యాలు
నాట్య శాస్త్రం చెప్పలేదు చెప్పలేదు
ఓ నెలత నా కలత నీ పేరే కవ్వింత నీ పేరే కవ్వింత॥రెండు॥




ఆయన మాకు మంచి ఫ్యామిలీ ఫ్రెండ్. ఆయన నాకు ఇందులో గెస్ట్ క్యారెక్టర్ ఉందని చెప్పారు. 'హీరోయిన్‌గా చేస్తున్నావ్ కదా ఇలాంటి గెస్ట్ క్యారెక్టర్స్ వద్ద'ని మా తమ్ముడు రాజేష్ వారించాడు. వచ్చిన అవకాశం వదులుకోకూడదనే పద్ధతిలో నేను సినిమా చేయటానికి సిద్ధమైపోయాను. తీరా రెండు రోజులు వేషం అనుకున్నది కాస్తా ఫుల్ లెంగ్త్ క్యారెక్టర్ అయిపోయింది. అమాయకత్వం, మూగ భాష మాట్లాడే తీరు వల్ల ఆ పాత్ర అందరినీ ఆకట్టుకుంది. ఇందులో నా పాత్ర పేరు అనసూయ. ఈ పాత్రే నేను హాస్యనటిగా మారటానికి బలమైన పునాది వేసింది. నేను హాస్యరసంలో ఏ మాత్రమైనా పేరు తెచ్చుకున్నానంటే అదంతా జంధ్యాల గారి చలవే. 'రెండుజెళ్లసీత'లోని నా పాత్రకు ఉత్తమ హాస్యనటిగా కళాసాగర్ అవార్డు లభించింది. ఆ తరువాత పదమూడేళ్లు ఏకధాటిగా ఆ అవార్డునందుకున్నాను." అని చెప్పుకొచ్చారు.

తొలుత మేకప్‌మెన్‌గా పేరు తెచ్చుకుని ఆ తరువాత ప్రముఖ దర్శకులతో తన అభిరుచికి తగ్గట్టుగా ఎన్నెన్నో ఉత్తమ చిత్రాలను నిర్మించారు జయకృష్ణ. 'శంకరాభరణం'




రిలీజ్ తరువాత జంధ్యాలతో జయకృష్ణకు పరిచయం ఏర్పడింది. అటుపై వాళ్లిద్దరూ రెగ్యులర్‌గా కలుసుకుంటుండేవారు. జంధ్యాల దర్శకుడైన తరువాత ఆయన షూటింగ్‌లకు రెగ్యులర్‌గా వెళ్తుండేవారు జయకృష్ణ. నవభారత్ పంపిణీ సంస్థకు చెందిన కేశవరావు, సాయికృష్ణ డిస్ట్రిబ్యూషన్ సంస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఇందులో హీరో కృష్ణ, దర్శకుడు దాసరి కూడా భాగస్వాములు. సినిమా నిర్మాణం మీద మక్కువ ఉన్న కేశవరావు తన అభిప్రాయాన్ని జయకృష్ణకు చెప్పి అండగా ఉండమని కోరారు. ఈ సందర్భంలో జంధ్యాల తనకు చెప్పిన ఓ స్టోరీ లైన్ గురించి వివరించారు జయకృష్ణ. అలా 'రెండు జెళ్ల సీత' మొదలయింది. ఆ తరువాత ఇదే బ్యానర్‌లో 'రావు-గోపాలరావు' చిత్రం కూడా రూపొందింది. జంధ్యాల, జయకృష్ణల అనుబంధం జంధ్యాల మృతి చెందేవరకూ కూడా కొనసాగింది. వీళ్లిద్దరి కాంబినేషన్‌లో 'ముద్దుల మనవరాలు',




'రాగలీల', 'వివాహ భోజనంబు', 'నీకు నాకు పెళ్లంట' చిత్రాలు

## కథాంశం

గోపి-కృష్ణ-మోహన్-మూర్తి నలుగురు కుర్రాళ్ళు. ఒకే కాలేజీ-ఒకే రూమ్ -ఒకే మాట- ఒకే బాట-ఒకే లవర్ అన్నట్టుగా వుంటారు. వీళ్ళు వుంటున్న ఇంట్లోకి 'సీత' అనే అందమైన అమ్మాయి తన తల్లితండ్రులతో కలిసి అద్దెకు దిగుతుంది. అక్కణ్ణుంచే ఆ నలుగురి మధ్యనా పోటీ మొదలవుతుంది. ఈ పోటీ ముదిరి నలుగురూ డబ్బులిచ్చి ఒకే రౌడీతో దెబ్బలు తినాల్సివస్తుంది. దాంతో వీళ్ళు ఓ నిర్ణయానికి వచ్చి కలిసికట్టుగా, సీతా దగ్గరికి వెళ్ళి తమలో ఎవరిని ప్రేమిస్తున్నావని అడుగుతారు. అప్పుడు సీత తన గతాన్ని చెబుతుంది. మధు, సీతలు ప్రేమించుకుంటారు. మధు తండ్రి గండభేరుండం వీళ్ళ పెళ్ళికి రెండులక్షల కట్నం అడుగుతాడు. బడిపంతులైన సూర్యనారాయణ అన్నింటికీ ఒప్పుకుంటాడు. పెళ్ళికి అంతా సిద్ధమవుతుండగా సీత మీద నింద మోపి పెళ్ళి కేన్సిల్ అయ్యేట్టు చేస్తాడు గండభేరుండం. ఆమె గతం విని కరిగిపోయిన ఈ నలుగురు కుర్రాళ్ళు మధు మనసుమార్చి ఈ పెళ్ళి జరిపిస్తామని హామీ ఇస్తారు. విజయనగరం వెళ్ళి గండభేరుండం కూతురు కాత్యాయని, కామేశ్వరరావు అనే కుర్రాడితో ప్రేమలో పడేలా చేస్తారు. మధు,సీతలను విడగొట్టడం కోసం గండభేరుడం, ఫోటోల్లో తలలు మార్పించి సీతకి వేరే కుర్రాడితో సంబంధం వుందని అబద్ధమాడతాడు. ఈ నలుగురూ అదే తరహాలో కాత్యాయని మీద అపనింద మోపుతారు. దాంతో గండభేరుండం తను చేసిన తప్పు ఒప్పుకుంటాడు. ఇలా ఆ నలుగురు మధును, సీతను కలుపుతారు.


మహాలక్ష్మి


కమలాకర్


శుభలేఖ సుధాకర్, దేవి

రూపొందాయి. 'శుభం' అనే చిత్రానికి ప్లానింగ్ జరుగుతున్న సమయంలోనే జంధ్యాల ఆకస్మికంగా కన్నుమూశారు.

సంగీత దర్శకునిగా రమేష్‌నాయుడు చేసిన సరిగమల సరసాలు ప్రేక్షకుల్ని కొబ్బరి నీళ్ళలో జలకాలాడించాయి. తెలుగు వారి వంటకాలు, రుచులు మీద మహా మక్కువున్న జంధ్యాల చాల ఇష్టపడి 'మాగాయే మహాపచ్చడి- పెరుగేస్తే మహత్తరి - అది వేస్తే అడ్డవిస్తరి - మానిన్యాం మహాసుందరి' అంటూ వేటూరితో ఊరగాయపద్యంలా అనిపించే ఓ రాలుగాయిపద్యాన్ని రాయించు కున్నారు. అంతేకాదు ఆకాశవాణిలో పనిచేసే ప్రసిద్ధ సాహితీవేత్త ఇంద్రగంటి శ్రీకాంత శర్మ చేత వరకట్న సమస్య మీద క్లైమాక్స్‌లో వచ్చే 'పురుషులలో పుణ్య పురుషులు వేరు' అనే పాటను రాయించారు.

అప్పుడు శ్రీకాంత శర్మ విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పనిచేస్తూండేవారు. 'కృష్ణావతారం' సినిమా కోసం బాపు ఆయనతో 'చిన్నారి నవ్వు - చిట్టి తామర పువ్వు' అనే పాటను రాయించుకున్నారు. శ్రీకాంత శర్మ రాసిన తొలి సినిమా పాట అదే. జంధ్యాల, శ్రీకాంత్ శర్మ మంచి స్నేహితులు. 'కృష్ణావతారం'లో పాట రాశారని తెలుసుకుని చాలా ఆనందపడి పోయారు జంధ్యాల. ఆ ఉత్సాహంతోనే అప్పుడు తను దర్శకత్వం వహిస్తున్న 'నెలవంక' సినిమాలో మొత్తం ఆరు పాటలూ ఆయనతోనే రాయించుకున్నారు. ఆ తర్వాత 'రెండు జెళ్ల సీత' కోసం 'పురుషులలో పుణ్యపురుషులు వేరు' పాట రాయించుకున్నారు.

"నేను మద్రాసు వెళ్లినప్పుడు ఈ పాట సిట్యుయేషన్ చెప్పారు జంధ్యాల. మర్నాడు నిర్మాత జయకృష్ణ ఇంట్లో కూర్చొని ఈ పాట రాశాను. రాస్తున్నప్పుడు సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు, జంధ్యాల కూడా అక్కడే ఉన్నారు. పాట పూర్తయ్యాక రమేష్‌నాయుడు ట్యూన్ కట్టారు. సాధారణంగా పాటల రికార్డింగ్ సమయంలో రచయిత తప్పని సరిగా ఉండాలి. కానీ, రేడియో పనుల బిజీ వల్ల నేను పాల్గొనలేకపోయాను" అని ఆ పాట రాసిన సందర్భాన్ని గుర్తుకు తెచ్చుకున్నారు శ్రీకాంతశర్మ.

పాటలు తీయడంలో కూడా జంధ్యాల కొత్త స్కీమ్ కనబరిచారు. 'రెండు జెళ్ళ సీత', 'సరిసరి వదవదనీ', 'మందారంలో ఘుమఘుమలై' పాటల చిత్రీకరణలో షాట్ డివిజన్ అద్భుతంగా కుదిరింది. 'సరిసరివదవదనీ' పాటలో 'భీతహరిణనేత్రిని నేనూ' అన్నప్పుడు కథానాయిక వదనంపై లేడి పరుగు పెడుతున్నట్టుగా షాట్ వేయడం ఆయన అభిరుచికి ఓ నిదర్శనం అనిపిస్తుంది. అలాగే నలుగురు హీరోల మీద చిత్రీకరించిన 'రెండు జెళ్ళ సీత... తీపి గుండె కోత' పాట సాహిత్యంలో - కథాపరంగా ఆ నలుగురు హీరోల పర్సనల్ టేస్ట్‌ల ప్రకారం - స్పోర్ట్స్ అయిటమ్స్‌ని నరేష్‌కి, ఫుడ్‌ని శుభాకర్‌కి, డాన్స్‌ని నరేష్‌కి, బుక్స్‌ని ప్రదీప్‌కి వాడుకోవడం చాలా కొత్తగా అనిపిస్తుంది.

'పురుషులలో పుణ్యపురుషులు వేరు' పాటలో గోపాలరెడ్డి ఫొటోగ్రఫీ పనితనం కొత్త పుంతలు తొక్కింది. బ్యాండ్‌మేళం వాయిస్తున్న నలుగురు హీరోల షాడోలని ఆడ్ మాంగిల్స్‌లో చిత్రీకరించి తోలుబొమ్మలు గెంతుతున్నట్టుగా భ్రమింపజెయ్యడం ఓ ప్రయోగంగా చెప్పుకోవాలి.

### మహత్తరి

'మాగాయే మహాపచ్చడి
పెరుగేస్తే మహత్తరి
అదివేస్తే అడ్డవిస్తరి
మానిన్యా మహాసుందరి'

అని వేటూరి 'రెండు జెళ్ల సీత' చిత్రంలోని ఒక పాటలో రాసేరు. 'మహత్తరి', 'మానిన్యా మహాసుందరి' లాంటి పదాలు ఎందుకు వాడేరు... ఇలా కాయిన్ చెయ్యాలని మీకెందుకనిపించింది... అని అడిగితే - "ఇదొక పేరడీ పద్యం. దీని ఒరిజినల్ వేరే ఉంది. సరదాగా చమత్కారంగా శ్రీ ద్వైతా గోపాలం గారు నాతో ఒక్కసారి అన్నారు అదెలా ఉంటుందంటే -

'శ్రీకాకుళే మహాక్షేత్రే
గుండేరే మహానదీ
అంకినీడే మహాప్రభూ
ఈతముల్లే ప్రాణహానీ..'

ఇలా వస్తుంది. దీన్ని ఈ 'మాగాయే మహాపచ్చడి' కోవలోకి మార్చుకున్నాను. అని విప్పిచెప్పారు వేటూరి.

-రాజా

# 'రెండు జెళ్ళ సీత' లో ప్రేక్షకుల మన్ననలను పొందిన డైలాగ్స్ లో కొన్ని....





1. 'మీరని తెలిస్తే అలా తిడతానా'
   'అంటే మరోటైపులో తిడతావా ?'
2. 'ఏం చేస్తున్నావు ?'
   'శవాసనం వేస్తున్నా'
   'తేలికైన ఆసనం అనా..
   అయినా గుమ్మం ముందు అలా
   పడుకోకండి. అవాంఛనం..
   ఎవరైనా చూస్తే ఏమైనా అనుకుంటారు'
3. 'నీకు నచ్చిన పువ్వుపేరు చెప్ప బాబూ'
   'కాలీఫ్లవర్'
   'నీ బొంద.. పువ్వంటే కాలీఫ్లవరూ
   కంట్లో పువ్వూ కాదు'
4. 'హుఁ... తమ్ముళ్ళు.. నాకు నలుగురు
   తమ్ముళ్ళు .. నేను ధర్మరాజుని వెర్రివెధవని
   అందుకే అన్నీ పంచుకోవాలని
   చూస్తున్నారు.'
5. 'ఛండాల్, పాపీ, కులటా, కకుంభరీ'
   'కకుంభరీలాంటి కొత్త తిట్లు
   కనిపెట్టి తిట్టెయ్యకండి మరి '
6. 'ఈ ఊళ్ళో సిటీబస్సెక్కి క్షేమంగా ఇంటికి
   రాగలను. యూనివర్శిటీలో ఉపన్యాసం
   ఇవ్వగలను. హౌరాబ్రిడ్జి రోడ్డులో ముక్కు
   మూసుకోకుండా నడవగలను. కానీ నిన్ను
   మాత్రం ఏలుకోలేను. ఇంతే మాటా వినను.
   విన్నా నాకు తెలుగు రాదు. మై హిందీకా
   ఆద్మీహూ.'
7. "ప్రాణాలు తియ్యటం తేలిక
   ప్రాణాలకేం కాకుండా చెయ్యి, కాలో
   తీసెయ్యడం ఎంత కష్టమో నీకేం
   తెలుసు మిస్టర్.'
8. 'పన్నెండేళ్ల దాకా ఆడది ఇండియా లాంటిది
   అందరూ ఎత్తుకుని ముద్దుపెట్టాలను
   కుంటారు!
   12 నుంచి18 దాకా ఆడది అమెరికా
   లాంటిది.
   ప్రతివాడు ఆ అందాన్ని అందుకోవాలని,
   పొందాలని చూస్తారు!
   18నుంచి 40 దాకా ఆడది ఇంగ్లాండ్
   లాంటిది.
   దూరం నుంచి చూసి ఆనందిస్తుంటారు!
   40 నుంచి 60 దాకా ఆడది ఆఫ్రికాలాంటిది.
   చూడగానే జడుసుకుని పారిపోతాడు!'
9. 'త్వరగా చెప్పు.. రైలుకి టైమైంది'
   'రైలెందుకూ'
   'దాని కింద తలపెట్టడానికేమో బావా'
10. 'వాడు నుయ్యో గొయ్యో చూసుకుంటే
    మనిద్దరం ఎవరికీ తెలియని నీ సొంత
    హిందిలో ఏడుస్తూ బ్రతకాలి.'
11. 'భాయ్ బందోంకో బురా నహీ కర్నారా
    నహీ కర్నా
    ఇస్ మే నహీ హోతారా
    అడయిరా -చాహియెరా'
12. 'వాడొట్టి మలపత్రాష్టుడు '
13. 'ఓ అర్నెల్లు ఢిల్లీలో కాపురం పెడితే ఊర్ని
    చెడగొడుతున్నాడని జనం అంతా
    చందాలేసుకుని ఓ లారిలో వీణ్ని అందులో
    కట్టిపడేసి దక్షిణ భారతదేశం పంపేశారు.
    అప్పట్నించీ చీటికీ మాటికీ వచ్చీరాని హిందీ
    మాట్లాడుకుంటూ బతికేస్తున్నాడు.'
14. 'పళ్ళు తినిపిస్తూ పళ్ళు పీకేస్తున్నారయ్యా
    మీరు'
15. 'అది టులెట్ కాదండి, టాయిలెట్!
    పెయింటర్ తప్పరాశాడు'
16. 'ఇది పరువుమర్యాదలు గల వారిల్లా -ఇంకా
    మీ ఇల్లనుకున్నానే!'
17. 'ఎందుకైనా మంచిది కొంచెం తెలుగులో
    ఆలోచించు బావా '
18. 'నాతో పెట్టుకోకు రెండుసార్లు పిచ్చాసుపత్రి
    నుంచి పారిపోయివచ్చా'





1. "నేను పొగొట్టినవన్నీ నా కందజేశారు
   నేనిప్పుడు నా మననును
   పోగొట్టుకున్నాను"
2. "అమ్మా సీతా! చిన్నప్పుడు కృష్ణమూర్తి
   బావని చేసుకుంటావా అని అడిగితే
   'నేను సీతను నా మొగుడు రాముడు'
   అంటే సీత పేరు పెట్టినందుకు ఎంతో
   మురిసిపోయానమ్మా! ఓ రోజున చిన్న
   కోతి పిల్లనెత్తుకొచ్చి 'నేను సీతను కదా
   ఆంజనేయుడు నా దగ్గరకొచ్చేశాడు
   నాన్నా' అని నువ్వన్నప్పుడు నీ పేరు సీత
   అని పెట్టినందుకు ఎంతో సంబరపడి
   పోయానమ్మా.. కానీ ఇవాళ నీకా పేరు
   పెట్టినందుకు ఎంతో
   బాధపడుతున్నానమ్మా, కుమిలి
   పోతున్నాను. ఆ రాక్షసులు నీ మీద
   అభాండం వేశారమ్మా."
3. "నాన్నా ఆయన కూడా.."
   "పిచ్చితల్లీ, కాకిపిల్ల కమ్మని సంగీతం
   పాడుతుందామ్మా అతను తండ్రి లాగే
   మాట్లాడేడు."
4. "కృష్ణ గోదావరుల్లో ప్రవహించేది నీరు
   కాదు కన్నీరు. కట్టమిచ్చుకోలేని
   కన్నెపిల్లల కన్నీరు."





రచన : వేటూరి **4** గానం :యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి

ఆ : కొబ్బరినీళ్ళా జలకాలాడి
ఆ : ఉ......కోనసీమా కోక గట్టి
ఆ : ఉ......పొద్దుటెండా తిలకాలెట్టి ముద్దపసుపు సందెల కొస్తావా
ముద్దు తీర్చే సందిటి కొస్తావా ॥ముద్దు॥
ఆ : కొబ్బరినీళ్ళ అ : ఉ..........
ఆ : కోనసీమా కోకగట్టి అ : ఉ..........
ఆ : పొద్దుటెండా తిలకా లెట్టి ముద్దపసుపు సందెల కొస్తాలే
ముద్దు తీర్చే సందిలి ఇస్తాలే ॥ముద్దు॥
ఆ : ఆకాశ వీణల్లో నేను అనురాగమే పాడుకుంటా
అ : గోంగూర పచ్చట్లో నేను ఉల్లిపాయే నంచుకుంటా
నేనుల్లిపాయే నంచుకుంటా
ఆ : ఆకాశ వీణల్లో నేను అనురాగమే పాడుకుంటా
అ : శృంగార వీధుల్లో నేను రసనాట్యమే ఆడుకుంటా
ప్రేమ రసనాట్యమే ఆడుకుంటా
ఆ : మాటివ్వు నాకు మనసిచ్చుకుంటా
అ : వదిలేస్తే వంకాయ వండించుకుంటా
అ : ఐ యామ్ సారీ వంకాయ వంటి కూరయు
పంకజ ముఖి సీత వంటి భార్యా మణియు
అన్నారు కదండి... అందుకే అలా పాడానన్నమాట
ఆ : ఓ హో.....
ఆ : కొబ్బరినీళ్ళా జలకాలాడి అ : ఉ.........
ఆ : కోనసీమా కోకా గట్టి అ : ఉ.........
అ : పొద్దుటెండా తిలకాలెట్టి ముద్దపసుపు సందెల కొస్తావా
ఆ : ముద్దు తీర్చే సందిలి ఇస్తాలే
ఆ : అమ్మవారి ఎదుట నేను నీ కుంకమే దిద్దుకుంటా
నీ కోసమే కాచుకుంటా
అ : అమ్మతో చెప్పి నేను అప్పచ్చులే తెచ్చుకుంటా ॥ఆ : అమ్మవారి॥
అ : అసుర సంధ్యవేళ నేను ఆలయంలో వేచి వుంటా
నీ హారతే అందుకుంటా
ఆ : మాగాయ లోన పెరుగేసుకుంటా
ఆ : వదిలేస్తే నాదారి నే చూసుకుంటా
అ : మాగాయి మహాపచ్చడి పెరుగేస్తే మహత్తరి
అది వేస్తే అడ్డ విస్తరి మానిన్యా మహాసుందరి
అన్నారు కదండి అందుకే అలాపాడానన్నమాట
ఆ : కొబ్బరి నీళ్ళా జలకాలాడి అ : ఆహా.......
ఆ : కోనసీమా కోకగట్టి అ : ఓహో.......
అ : పొద్దుటెండా తిలకా లెట్టి ముద్దపసుపు సందెల కొస్తావా
ముద్దు తీర్చే సందిటి కొస్తావా.......
ఆ : ముద్దు తీర్చే సందిలి ఇస్తాలే.......

రచన : ఇంద్రగంటి శ్రీకాంత శర్మ **4** గానం :యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

పురుషులలో పుణ్యపురుషులు వేరు
కలిపురుషుల్లో ఆకలి పురుషులు వీరు ॥పురుషులలో॥
వరకట్నాల విపణి వీధిలో కన్నెల కన్నుల నీరొలికించి
కన్నకొడుకులను కాసుకు అమ్మేవారు
వీరు, వీరు, వీరు, వీరు
కలిపురుషుల్లో ఆకలి పురుషులు వీరు ॥పురుషులలో॥
(పెళ్ళికొడుకుల్లారా ఖరీదైన కదిలే బొమ్మల్లారా
కట్నం తీసుకోవడం ఘనతనుకుంటే
రేపు మీరు తండ్రులయ్యాక మీ పిల్లలకి కట్నం ఇవ్వాల్సివస్తుందని
తెలుసుకోండి)
వ్యాపారంలో కొన్నవారిదే పై చేయనేది లోకాచారం
అమ్ముడు పోయిన మనిషి తిరగబడి
జులుం చేయడం విడ్డూరం
వివాహాన్ని వ్యాపారం చేసే
మలినాచారం అపచారం ॥వివాహాన్ని॥ ॥పురుషులలో॥
(ఓ అమ్మలారా అత్తల్లారా
మా కోడలు ఇంత కట్నం తెచ్చిందని చెప్పకోవడమే గొప్పనుకుంటే
మిమ్మల్ని అత్తవారింటికి పంపించే క్షణాన మీ తండ్రుల కళ్ళవెంట
రాలిన నెత్తుటి చుక్కల్ని ఒక్కసారి గుర్తు చేసుకోండి)
వరవిక్రయమే బానిసతనమని వివరించాడు కాళ్ళకూరి
కన్యాశుల్కం దురాచారమని ఖండించాడు గురజాడ
నారీ లోకం విముక్తి కోసం ఉద్యమించాడు కందుకూరి
ఆ మహనీయులు అందరొక్కటై యువతను ఆదేశించాలి
జాతికి నీతిని బోధించాలి ॥జాతికి॥పురుషులలో॥

వైజాగ్ కనకమహాలక్ష్మి కోవెలలో అక్టోబర్ 4,1982 నాడు షూటింగ్ ప్రారంభమైంది. వైజాగ్, చుట్టుపక్కల ప్రాంతాల్లో సుమారు 45 రోజుల పాటు ఈ చిత్రం షూటింగ్ జరిగింది.

వైజాగ్ రామకృష్ణా బీచ్‌కి ఎదురుగా ఓ బిల్డింగ్‌ని అద్దెకు తీసుకుని, దాన్నే ఈ చిత్రంలోని కథానాయకుల నివాసంగా తెర మీద చూపించారు.

నరేష్, ప్రదీప్, రాజేష్, శుభాకర్, కమలాకర్, శుభలేఖ సుధాకర్, మహాలక్ష్మి, శ్రీలక్ష్మి వీరందరిదీ ఇంచుమించు సరిసమాన వయసు. ఈ ఎనమండుగురూ ఓ టీమ్‌లా కలిసి మెలిసి వుండేవారు. షూటింగ్ పూర్తి కాగానే వీళ్ళంతా నాలుగు బైక్స్ మీద షికారుకి బయలుదేరి పోయేవారు. "ఈ సినిమా షూటింగ్‌ని చాలా బాగా ఎంజాయ్ చేసాం. ఓ రకంగా మేం కోతిగోల చేసేవాళ్ళం" అన్నారు ప్రదీప్ ఆనాటి సంఘటనలను తలుచుకుని ముసిముసిగా నవ్వుతూ.

BSA Falcon అనే 100 సి.సి. మోటార్ బైక్స్ అప్పుడే మార్కెట్లోకి వచ్చాయి. షూటింగ్ నిమిత్తం ఓ నాలుగు బైక్స్‌ని తీసుకున్నారు. రిజిస్ట్రేషన్ నెంబర్లు వేరేలా వున్నా గానీ, సినిమాలో తమాషాగా కనిపించాలనే ఉద్దేశ్యంతో 1111, 2222, 3333, 4444 అని ఏర్పాటు చేశారు.

ఓ రోజు ఈ ఎనమండుగురు బైక్స్ మీద షికారు చేస్తుంటే పోలీసులు ఆపారు. 'ఇవేవో దొంగ నెంబర్లలా వున్నాయే' అని సందేహపడి వీళ్ళని బైక్స్‌తో సహా పోలీస్ స్టేషన్‌కు తరలిస్తే జంధ్యాల వచ్చి విడిపించారట. ఈ విషయం ప్రదీపే స్వయంగా చెప్పారు.

సినిమాలో నలుగురు హీరోల ఇంట్రడక్షన్ కూడా కొత్తగా అనిపిస్తుంది. 'హాయ్' అంటూ ఆడియన్స్ వైపు ఓ చూపు విసిరి, క్లాస్‌రూమ్‌లోకి... (అసలు కథలోకి) ఎంటరౌతారు. హీరోలు ఇలా గ్రీట్ చేస్తుండగా వారి టైటిల్ కార్డ్స్‌ని ప్రదర్శించడం ఓ తమాషా థాట్. మిగిలిన టైటిల్స్ అన్నీ కేరికేచర్లతో ప్రెజెంట్ చేయడం అప్పట్లో అందరూ కొత్తగా ఫీలయ్యారు.

కథలో ఈ నలుగురూ ఓ అమ్మాయికి సైట్ కొడుతూ వాళ్ళింటికి వెళ్తారు. ఆ అమ్మాయి తాలూకు వాళ్ళు భీముల్లా వుండి తమని కొట్టేలా చూస్తుంటే తప్పించుకొచ్చేస్తారు, ఒక్క వ్యక్తి తప్ప. మిగతా ముగ్గురు హోటల్‌లో కూర్చుని కూల్‌డ్రింక్స్ తాగుతుంటారు. ఈలోగా మిగిలిన వ్యక్తి గాయాలతో వస్తాడు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : శ్రీ భ్రమరాంబికా ఫిలింస్ |
| సంగీతం | : రమేష్‌నాయుడు |
| పాటలు | : వేటూరి, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| నేపథ్యగానం | : బాలు, జానకి |
| ఎడిటింగ్ | : గౌతంరాజు |
| ఆర్ట్ | : తోట తరణి |
| స్టంట్స్ | : రాజు |
| నృత్యం | : శివ-సుబ్రహ్మణ్యం |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : ఇ.వి.వి. సత్యనారాయణ, బి.యస్.విఠల |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : బత్తుల రామకృష్ణ |
| కో-డైరెక్టర్ | : యు.వి.పాణి |
| కెమెరామెన్ | : ఎం.వి. రఘు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : యస్.గోపాలరెడ్డి |
| నిర్వహణ | : జయకృష్ణ |
| నిర్మాత | : కె. కేశవరావు |
| కథ-మాటలు,దర్శకత్వం | : జంధ్యాల |

వీళ్ళు డంగైపోయి 'ఏం తింటావురా' అనడుగుతారు. 'మీ ముగ్గుర్నీ' అంటాడు కోపంగా. 'ఏం తాగుతావురా' అని మళ్ళీ అడిగితే, 'మీ రక్తాన్ని' అంటాడతను. సంభాషణల్ని సందర్భోచితంగా ఎలా ఉపయోగించాలో జంధ్యాలకు బాగా తెలుసు.

చిత్రం చివర్న - తాము ప్రేమించిన అమ్మాయికి ఆమె ఇష్టపడిన అబ్బాయితో తమ చేతుల మీదుగా పెళ్ళి చేస్తూ ఓ పక్క ఆనందబాష్పాలు, మరోపక్క దుఃఖాశ్రువులు చిందిస్తూ ఈ నలుగురూ చేసిన అభినయం హార్ట్ టచింగ్‌గా వుంటుంది.

హీరోయిన్ ఇంట్రడక్షన్ కూడా భలే తమాషాగా తీశారు జంధ్యాల. హీరోయిన్ ఈ సినిమాలో ఆటో నుంచి దిగి తొలిసారిగా కనిపిస్తుందామె. ఆ ఆటో మీద 'బాపు - ముళ్ళపూడి వెంకటరమణ' అని రాసి వుంటుంది. అయితే ఇది షూటింగ్ కోసం ప్రత్యేకంగా రాయించలేదు. ఆ ఆటో కుర్రాడే బాపు-రమణల మీద అభిమానంతో రాయించుకున్నాడు. ఇది కాస్తా జంధ్యాల స్నేహితుడు, వైజాగ్‌లో వీళ్ళ షూటింగ్ వ్యవహారాలన్నింటినీ సమన్వయ పరిచే బాబన్న దృష్టిలో పడింది. ఈ విషయం జంధ్యాలకు చెబితే, ఆయన వెంటనే అతన్ని పిలిపించి ఈ సీన్ షూట్ చేయడం జరిగింది. అసలు 'రెండు జెళ్ళ సీత'ను ఆంధ్రప్రదేశంలో పాపులర్ చేసింది బాపు - రమణే కదా. ప్రేక్షకులకీ విధంగా 'రెండుజెళ్ళ సీత' అసలు సృష్టికర్తలను గురుతు చేయడం సముచితంగా అనిపిస్తుంది.

ఇందులో హీరోయిన్ పేరు సీత. కుందనపు బొమ్మలా వుంటుంది ఒక జడవేస్తే మరీ దిష్టి కొట్టేస్తారని వాళ్ళమ్మ పట్టుపట్టి రెండు జడలు వేస్తుంది. అలా రెండు జెళ్ళ సీత అయ్యిందన్న మాట. దానిక్కూడా సినిమాలో ఓ డైలాగ్ ప్రత్యేకంగా పెట్టారు జంధ్యాల.

కమలాకర్, మహాలక్ష్మిల మధ్య ప్రేమ సందేశాలకు క్షేత్రయ్య పదాలను ఉపయోగించడం జంధ్యాలలోని అభిరుచికి, స్పార్క్‌కి ఓ మచ్చుతునక.

రిటైర్డ్ మేజర్ మంగపతి పాత్రలో వీరభద్రరావు ఉన్నంతలో మంచి మోతాదులో హాస్యాన్ని నింపారు. జారుడు బల్లమీద జారడం,' సీ -సా' ఆట ఆడటం లాంటి విచిత్రమైన పనులు చేయడమే గాక 'నేను రెండుసార్లు పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి వచ్చాను తెలుసా' అంటూ కొనమెరుపు మెరిపించి అందర్నీ ఫొల్లుమనిపిస్తారాయన. అసలు ఆయన ఎంట్రెన్సే సుత్తితో కొడుతూ కనిపిస్తుంది - 'నేను సుత్తి తో పాపులర్ అయిన వాడ్ని సుమా' అన్నట్టు... దటీజ్ జంధ్యాల.

ఇందులో అల్లురామలింగయ్య పాత్ర పేరు 'గండభేరుండం'. ఈయనగారికి ఉత్తరభారత దేశమన్నా, హిందీ అన్నా చాలా ఇష్టం. ఆ వెర్రితోనే పిచ్చి హిందీలో తెగ మాట్లాడేస్తుంటారు.

విజయనగరం వెళ్ళి - సీత ప్రేమించిన మధు మనసు మార్చడానికి ఏం చేయాలా అని ప్లాన్ చేస్తుంటారు ఈ నలుగురు. వీరికి డుంబు అనే కుర్రాడు సాయం చేస్తుంటాడు. ఆ కుర్రాడి అసలు పేరు చక్రవర్తి. ప్రముఖ రచయిత డాక్టర్ తంబు గారబ్బాయ్. ఈ కుర్రాడే ఇప్పుడు కృష్ణవంశీ 'శ్రీ ఆంజనేయం' సినిమాకి గ్రాఫిక్స్‌ని సమకూర్చాడు.

## నాలుగు పల్లవులాట

'రెండు జెళ్ల సీత' చిత్రంలోని ఒక పాట కంపోజింగ్‌కని కూర్చున్నారు రమేష్‌నాయుడు. ఆ పాట 'రెండు జెళ్ల సీతా తీపి గుండె కోతా' అనే పల్లవితో మొదలవుతుంది. ఆ పల్లవినే నాలుగు రకాలుగా ట్యూన్ చేశారు రమేష్‌నాయుడు. వాటిని నిర్మాత కేశవరావు, జయకృష్ణ, వేటూరి, జంధ్యాల విన్నారు.

'ఏది బావుంటే అది ఉంచేద్దాం' అన్నారు రమేష్‌నాయుడు.

వచ్చిన నలుగురికీ తలా ఓ పల్లవీ నచ్చింది. 'నాది బావుంది అంటే నాది బావుంది' అన్నారు. రమేష్‌నాయుడు ఓ రెండు నిమిషాలు సందిగ్ధంలో పడ్డారు.

'నాలుగింటినీ ఉంచెయ్యండి. ఎలాగూ నలుగురు హీరోలున్నారుగా' అన్నారు జంధ్యాల.

అలాగే నాలుగు పల్లవుల్నీ ఉంచి చరణాల్ని వాటికి తగ్గట్టుగా కలుపుకుని ఓ కొత్తరకం ఫీట్ చేశారు రమేష్‌నాయుడు.

**- రాజా**

'రెండు జెళ్ళ సీత' విజయవంతంగా శతదినోత్సవం జరుపుకుంది గానీ, ఫంక్షన్ మాత్రం చేయలేదు.

వరకట్నం లాంటి అనాచారం మీద ఈ చిత్రం ఒక రకంగా పోరాటం. సమస్యని మరీ సీరియస్‌గా కాకుండా హాస్యమనే షుగర్ కోటింగ్ అద్ది ప్రేక్షకులందరికీ మింగుడుపడే ఓ గుళికలా అందించారు జంధ్యాల.

**- పులగం చిన్నారాయణ**



# కథానాయకుడిగా రఫీ

రఫీ నటుడు కాదు. హీరో అంతకన్నా కాదు. కానీ అనేక సినిమాలకు అతనే కథానాయకుడు. ఆయా హీరోల మనసుల్లో పరకాయ ప్రవేశం చేసి, వారి వ్యక్తిత్వాలను తన గానం ద్వారా ఆవిష్కరించాడు. అందుకే సినీ హీరోల సినిమాల సంఖ్య వందల్లో ఉంటుందేమో గానీ, రఫీ కథానాయకుడిగా వచ్చిన సినిమాలు వేలల్లోనే ఉన్నాయి.

'మేరీ కహానీ భూల్‌నే వాలే తేరా జహా ఆబాద్ రహే మేరీ కహానీ' **(దీదార్)** - అంటున్న రఫీని వింటూంటే దిలీప్‌కుమార్‌లోని విషాద నాయకుడు మన కళ్ళముందు నిలబడతాడు.

**'ఖోయా ఖోయాచాంద్ ఖులా ఆస్‌మా ఆంఖోమె సారీ రాత్ జాయేగీ, తుమ్ కోభీ కైసే నీంద్ ఆయేగీ'**(కాలా బజార్)... అంటున్న రఫీ - అల్లరి చిల్లరి ఎవర్‌గ్రీన్ అందగాడు దేవ్ ఆనంద్ సొగసుల్ని మన మనసుల్లో శాశ్వతం చేస్తాడు.

**'దీవానా హువా బాదల్ సావన్ కీ ఘటా ఛాయీ,యే దేఖ్ కే దిల్ ఝుమా లీ ప్యార్ నే అంగడాయీ'**(కశ్మీర్ కీ కలీ)షమ్మీ కపూర్ పిచ్చితనానికి, సుందరమైన వంకర హావభావాలకు ఇంత కంటే గొప్ప ఆవిష్కరణ ఎక్కడ లభిస్తుంది?

**'ఐ హుస్న్ జరా జాగ్ తుఝే ఇష్క్ జగాయే- బదలే మేరీ తకదీర్ జొ తూ హోశ్ మే ఆయే'** (మేరే మెహబూబ్)-రాజేంద్రకుమార్ మొహ మాటపు, నిష్కల్మషపు ప్రేమ అభివ్యక్తికి అసలు సిసలు సాక్షాత్కారం ఈ స్వరంలోనే సాధ్యం.

**'వో దునియా కే రఖ్‌వాలే-సున్ దర్ద్ భరీ మేరే నాలే'** (బైజూ బావరా)-భరత్ భూషణ్‌కు చారిత్రక, పౌరాణిక భక్త పాత్రలు లభించడం ఈ పాటలో రఫీ చూపిన ఆర్తి వల్లేనంటే అతిశయోక్తి కాదేమో.

**'దిల్ జో న కెహ సకా, వొహీ రాజె దిల్ కెహనేకీ రాత్ ఆయీ' (భీగీరాత్)**-ప్రదీప్ కుమార్ అమాయకపు గాంభీర్యానికి, మనసు లోలోపలి మథనానికి భాష్యం చెప్పిన కంఠం అది.

**'ముఝే దర్ద్ దిల్ కా పతా నథా-ముఝే ఆప్ కిస్‌లియే మిల్ గయే'-(ఆకాశ్‌దీప్)** అంటున్న ధర్మేంద్ర స్వచ్ఛమైన, సహజ సుందరమైన అభివ్యక్తికి ఆధారమైన స్వరం రఫీది.

**'బహుత్ శుక్రియా - బడీ మెహర్ బానీ-మేరీ జిందగీ మే హుజూర్ ఆప్ ఆయే'** (ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా)-జాయ్ ముఖర్జీ సోఫిస్టికేటెడ్ వ్యక్తీకరణకు సొగసులు దిద్దిన ఘనత రఫీదే.

ఈ కథానాయకులందరివీ ప్రత్యేకమైన నటనా శైలులు. వీరిలో రాజేంద్రకుమార్ ఒక్కరే 'పూర్ మాన్స్ దిలీప్ కుమార్'గా గుర్తించబడ్డాడు గానీ (ఆ రోజుల్లో నిర్మాతలు దిలీప్ కుమార్ రేట్లు భరించలేక రాజేంద్రకుమార్‌ను తీసుకోవడం వల్లే అతను ట్రాజెడీ రొమాంటిక్ హీరోగా నిలబడ గలిగాడట), తక్కిన వాళ్ళు ఒకరి కొకరు పోలిక లేనివారు. కానీ వీరందరికీ రఫీయే ప్రధాన గాయకుడు. (దేవ్ ఆనంద్‌కు కూడా కిశోర్ కంటే రఫీయే ఎక్కువ పాటలు పాడాడని ఒక గణాంక వివరం చెబుతోంది. లెక్కల మాటెలా ఉన్నా, దేవ్ ఆనంద్ అత్యుత్తమ పాటల్లో రఫీవి చాలా

### కశ్మీర్ కి కలీ(1964)

సంగీతం: ఓ.పి.నయ్యర్ గానం : రఫీ రచన : ఎస్.హెచ్.బిహారీ

యే చాంద్‌సా రోషన్ చెహరా జుల్ఫోంకా రంగ్ సునెహరా
యే ఝీల్‌సి నీలీ ఆంఖే కోయి రాజ్‌హై ఇన్‌మె గెహరా
తా...రీఫ్ కరూఁ క్యా ఉస్‌కీ జిస్‌నే తుమ్హే బనాయా ॥యే॥
ఇక్ చీజ్ కయామత్‌సీ హై
లోగోం సె సునా కర్‌తే థే
తుమ్హె దేఖ్‌కె మైనే మానా
వో ఠీక్ కహా కర్‌తే థే ॥2॥
హై చాల్‌మె తేరీ జాలిమ్
కుఛ్ ఐసీ బలాకా జాదూ
సౌ బార్ సమ్హాలా దిల్ కో
పర్ హోకె రహో బేకాబూ ॥తా..రీఫ్॥
హర్ సుబహ్ కిరణ్ కీ లాలీ
హై రంగ్ తెరే గాలోంకా
హర్ షామ్‌కీ చాదర్ కాలీ
సాయా హై తెరే బాలోం కా ॥హర్॥
తూ బల్‌ఖా ఎక్‌కె నదియా
హర్ మౌజ్ తెరీ అంగ్‌డాయీ
జో ఇన్ మౌజోఁ మె డూబా
ఉస్‌నేహీ దునియా పాయీ ॥తా..రీఫ్॥
మైఁ ఖోజ్ మె హూఁ మంజిల్‌కీ
ఔర్ మంజిల్ పాస్ హై మేరే
ముఖ్‌డే సె హటాదో ఆఁచల్
హోజాయె దూర్ అంధేరే॥హోజాయె॥
మానాకీ యె జల్‌వే తేరే
కర్‌దేంగె ముఝె దీవానా
జీ భర్‌కె జరా మై దేఖూ
అందాజ్ తెరా మస్తానా ॥తా..రీఫ్॥















ఉంటాయి)ఇంత వైవిధ్యం ఉన్న నాయకులందరికీ ఒకే స్వరం ఎలా న్యాయం చేయగలిగింది? ఆ స్వర ప్రదాత ఒక్కొక్క నాయకుడి కోసం చూపిన ప్రత్యేకత ఏమిటి? అదే అవగాహన చేసుకుని, ఆనందించాల్సిన విషయం.

ముఖ్యంగా మూడు విభిన్న నటనా వ్యక్తిత్వాలున్న దిలీప్‌కుమార్, షమ్మీ కపూర్, దేవ్ ఆనంద్ లను పోల్చి చూస్తే రఫీ ఎన్ని రకాల కథానాయకుడిగా విశ్వరూపం ప్రదర్శించాడో అర్థమవుతుంది.

దిలీప్ కుమార్ కథానాయకుడిగా విషాదానికి పేరుపొందిన నటుడు. ఆ పాత్రల్లో గుంభన, తనలో తను మథనపడే తత్వం, అంతర్నిగూఢమైన తాపం, అణచిపెట్టుకున్న ఆవేదన.

మనసును పిండేసే నటన అది. **'యే జిందగీ కే మేలే -దునియామే కమ్ న హోంగే ఆఫ్ సోస్ హమ్ న హోంగే'**(మేలా), **'హువే హమ్ జిన్ కేలియే బర్‌బాద్'** (దీదార్), **'వో దూర్ కే ముసాఫిర్, హమ్ కో భీ సాథ్ లేలే రే'**( ఉరన్ ఖటోలా), **'కోయి సాగర్ దిల్‌కో బహలాతా నహీ'** (దిల్ దియా దర్ద్ లియా), **'ఆజ్ పురానీ రాహోమే కోయి హమే ఆవాజ్ న దే'** (ఆద్మీ)ఇలా ఎన్నైనా చెప్పుకోవచ్చు. రఫీ దిలీప్‌కు పాడిన పాటల్లో 'దిల్ దియా దర్ద్ లియా' లో **'గుజరే హై ఆజ్ ఇష్క్‌మే హమ్ ఉస్ మకామ్ సే - నఫరత్ సీ హోగయీ హై మొహబ్బత్ కే నామ్ సే'** అని పాడుతున్న రఫీ కంఠంలోని కసి, వేదన వింటే దిలీప్ ముఖంలోని హావభావాలను చూడకుండానే ఊహించవచ్చు.

అదే రఫీ దేవ్ ఆనంద్ కోసం ఎంత గారాలు పోతాడో. కథానాయికపైన అలగడం, ఆమె అలిగితే బతిమాలడం దేవానంద్ అభివ్యక్తిలోని ప్రత్యేకత. అది రఫీ గొంతులో ఎలా పలికిందో ఉదాహరణకు ఈ రెండు పాటలు గుర్తు తెచ్చుకుంటే చాలు.

**'అభీ న జావో ఛోడ్ కర్ కె దిల్ అభీ భరా నహీ'** (హమ్ దోనో) ఆ నహీ పలకడంలో రఫీ చేసే మారాం దేవ్ ఆనంద్ మొహం కంటే ఎక్కువ ఎఫెక్టివ్‌గా ఉంటుందంటే అతిశయోక్తి కాదు. అలాగే **'అచ్ఛా జీ మై హారీ చలో మాన్ జావోనా'** (కాలా పానీ)రఫీ పాడుతుంటే దేవ్ ఆనంద్ కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాడు. దేవానంద్ మాట్లాడినపుడు 'హాయే' అని ఎలా అంటాడో **'దిన్ ఢల్ జాయే హాయె రాత్ నజాయే'**(గైడ్)లో అలాగే అంటాడు రఫీ. **'తెరె ఘరె కే సామ్ నే'** లో ఒక్కొక్క పాట సంభాషణ తర్వాత వస్తుంటే, దేవానంద్ కంఠస్వరాన్ని రఫీ ఎంత అద్భుతంగా అనుకరించాడో అర్థమవుతుంది (ఉదా: **దిల్ కా భవర్ కరే పుకార్, దేఖో రూఠా న కరో, బాత్ నజరోంకీ సునో**)

దిలీప్‌కుమార్‌కు ఆత్మసదృశమైన కంఠస్వరం, షమ్మీకపూర్ కు కూడా ప్రాణం కావడం అత్యద్భుతమైన విషయం. రఫీ గాన వైదుష్యానికి, వైవిధ్యానికీ ఈ ఒక్క నిదర్శనమే చాలు. దిలీప్ నటనలో ఇంట్రావెర్ట్ మనస్తత్వం ఉంటే, షమ్మీ నటనలో ఎక్స్ట్రావర్ట్ మనస్తత్వం కనిపిస్తుంది. దిలీప్ కోసం కొంత మందమందంగా పాడితే (**'కోయీ సాగర్ దిల్ కో బహలాతా నహీ'** లా), షమ్మీ కపూర్ కు నోరంతా తెరిచి, అల్లరిగా పాడాలి.

జీవితాన్ని తాత్వికంగా విశ్లేషిస్తూ అనుభవించే నటన దిలీప్‌దయితే, అనుక్షణం ఎంజాయ్ చేస్తూ గడిపేసే నటన షమ్మీది. అందుకే **'యాహూ, చాహే కోయి ముఝే జంగ్లీ కహే'**, **'యే చాంద్ సా రోషన్ చెహరా'**, **'లాల్ ఛడీ మైదాన్ ఖడీ'**, **'బదన్ పే సితారే లపేటే హువే'**, **'యూతో హమ్ నే లాఖ్ హసీ దేఖే హై'**, **'చక్కే పే చక్కా, చక్కే పే గాడీ'** లాంటి షమ్మీ పాటలు అతని రూపాన్ని మన కళ్ళెదుట పెట్టాయి. దిలీప్ కుమార్ కోసం నైన్

---

**రఫీ** కుమారుడు షాహిద్ ఒకసారి అన్నారు - "నాన్న **యాహూ** పాడినపుడు, మేం చాలా ఆశ్చర్యపోయాం. ఎప్పుడూ ఇంట్లోగాని, బయటగానీ, గొంతెత్తి మాట్లాడ్డానికి కూడ ఇష్టపడని నాన్న అలా ఎలా అరిచాడా అని, నిజంగా యాహూ అని అరిచింది నువ్వేనా అని కూడా అడిగాం. చిరునవ్వు నవ్వి అవునన్నాడు. ఆ పాత్రకు అలా పాడాలని అన్నాడు. తను ఏ పాట పాడే ముందయినా, నటుడు ఎవరనీ, పాత్ర ఎలాంటిందని నాన్న తెలుసుకునే వాడు".

షమ్మీకపూర్ కూడా తను, రఫీ కలిసి **'తా...రీఫ్ కరూ క్యా ఉస్ కీ'** పాటకు ఆ రూపం ఎలా ఇచ్చారో గుర్తు తెచ్చుకున్నాడు. నిజానికి ఆ వాక్యం అన్ని సార్లు పాడ్డం, 'తా' అని అంత గట్టిగా అరవడం ఓ.పి.నయ్యర్ ఉద్దేశం కాదు. 'తా' అన్నది తారాస్థాయికి వెళ్తే బాగుంటుందని షమ్మీ సూచిస్తే, మొత్తం వాక్యాన్ని ఒకసారి పాడినట్టు మరొకసారి పాడక, అద్వితీయమైన సంగతులతో దానికి అపురూపమైన అందాన్ని తీసుకు వచ్చింది రఫీయే(అప్పటికి ట్రాక్ సిస్టమ్ లేదు). నిజానికి చాలా పాటలను తన మనోధర్మంతో రఫీ అద్భుతంగా మార్చేవాడు. షమ్మీ కపూర్ ఎప్పటికీ గర్వంగా చెప్పుకునే విషయం ఏమిటంటే, రఫీ అందరు టాప్ హీరోలకు పాడినా, తనతోనే అతనికి ఐడెంటిఫికేషన్ ఉండేది అని. అది తన భాగ్యంగా భావిస్తాడు షమ్మీ.

---

**చిత్రం : ఖిలోనా (1970)**

సంగీతం: లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ రచన: ఆనంద్‌బక్షి గానం : రఫీ

ఓ..... ఖిలోనా జాన్ కర్ తుమ్ తో మేరా దిల్ తోడ్ జాతే హో... ॥2॥
ఓ... ముఝే ఇస్ హాల్ మే కిస్ కే సహారే ఛోడ్ జాతే హో ॥ ఖిలోనా॥
ఖుదాకా వాస్ తా దేకర్ మనాలూ దూర్ హూఁ లేకిన్
తుమ్హారా రాస్తా మై రోక్‌లూ మజ్‌బూర్ హూఁ లేకిన్
కే మైఁ చల్‌భీ నహీ సక్‌తా హూఁ ఔర్ తుమ్ దౌడ్ జాతే హో... ॥ ఓ ఖిలోనా॥
గిలా తుమ్‌సే నహీ కోయీ మగర్ అఫ్‌సోస్ థోడా హై
కే జిస్ గమ్‌నే మేరా దామన్ బడీ ముష్కిల్ సే ఛోడా హై ఉసీ గమ్ సే
మేరా ఫిర్ ఆజ్ రిశ్తా జోడ్ జాతే హో... ఓ... ఖిలోనా
మేరే దిల్ సే నా లో బద్‌లా జమానే భర్‌కీ బాతోంకా
ఠహర్ జావో సునో మెహమాన్ హూఁ మై చంద్ రాతోంకా
చలే జానా అభీ సే కిస్‌లియే ముహ్ మోడ్ జాతే హో ॥ఓ.. ఖిలోనా॥











లడ్ గయి హైరే మనవామా కసక్ హో బేకరీ, 'మేరీ పైరోమే ఘుంఘురూ బనాదే తొ ఫిర్ మేరీ చాల్ దేఖ్ లే' వంటి హాస్య గీతాలు షమ్మీ కపూర్ కోసం 'దిల్ కీ ఝరోంకోమే తుఝ్ కో బిఠాకర్', 'హై దునియా ఉసీకీ జమానా ఉసీకా మొహబ్బత్ మే జో హో గయా హో కిసీ కా', 'తుమ్ నే ముఝే దేఖా, హోకర్ మెహరుబా'

**ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా (1962)**

సంగీతం: ఓ.పి.నయ్యర్ రచన:ఎస్.హెచ్.బిహారీ

గానం : రఫీ, ఆశా

అ: ఆ...ఆ...ఆ... బహుత్ శుక్రియా... బడీ మెహర్‌బానీ
మేరీ జిందగీ మే హుజూరాప్ ఆయే
కదమ్ చుమ్‌లూ(యా కే ఆంఖే బిచాదూ
కరూ క్యా ఏ మేరే సమఝ్ మే న ఆయే
బహుత్ శుక్రియా.....
కరూ పేశ్ తుమ్‌కో నజ్‌రానా దిల్ కా... నజ్‌రానా దిల్ కా
కరూ పేశ్ తుమ్‌కో నజ్‌రానా దిల్ కా... నజ్‌రానా దిల్ కా
కే బన్ జాయే కోయీ ఆప్ సానా దిల్ కా...
ఖుదా జానే ఐసీ - సుహానీ ఘడీ ఫిర్ ॥2॥
మేరీ జిందగీ మే ఫలక్ కే న ఆయే
బహుత్ శుక్రియా... బడీ మెహర్ బానీ
మేరీ జిందగీ మే హుజూరాప్ ఆయే
బహుత్ శుక్రియా...
ఖుషితో బహుత్ హై మగర్ ఏ భీ గమ్ హై...
మగర్ ఏ భీ గమ్ హై
కే ఏ సాత్ అప్‌నా కదమ్ జో కదమ్ హై
మగర్ ఏ ముసాఫిర్ - జువా మాంగ్‌తా హై ॥2॥
ఖుదా ఆప్ సే ఫిర్ కిసీ దిన్ మిలాయే
బహుత్ శుక్రియా... బడీ మెహర్ బానీ
మేరీ జిందగీ మే హుజూరాప్ రాయే
బహుత్ శుక్రియా...
ఆ: ఓ... ముజే డర్ హై ముజ్ మే గురూర్ ఆ న జాయే
లగో జూమ్ నే మై సుర్ ర నజాయే... సుర్ ర నజాయే....
కహీ దిల్ న మేరా - ఏ తారీఫ్ సున్‌కర్ ॥2॥
తుమ్హారా బనే ఔర్ ముజే భూల్ జాయే
అ: బహుత్ శుక్రియా... బడీ మెహర్‌బానీ
మేరీ జిందగీ మే హుజూరాప్ ఆయే
కదమ్ చుమ్‌లూ(యా కే ఆంఖే బిచాదూ
కరూ క్యా ఏ మేరే సమఝ్ మే న ఆయే
బహుత్ శుక్రియా.....







'**ఎహసాన్ తెరా హోగా ముఝ్‌పర్**' వంటి సున్నితమైన గీతాలు కూడ రఫీ, వారి ప్రత్యేకత ఏమాత్రం చెడకుండా అంతే అందంగా పాడాడు.

ఇలా దాదాపు రఫీ తను పాడుతున్న ప్రతి నటుడికి సంబంధించిన, మరీ ముఖ్యంగా ఆ పాత్రకు సంబంధించిన ప్రత్యేకతలను దృష్టిలో ఉంచుకుని పాడాడు. 'ఖిలోనా'లో సంజీవ్ కుమార్ ఉన్మాది. ఆ ఉన్మాది అభివ్యక్తిని, ఆ సినిమాలో సంజీవ్ కుమార్ పలికే విధానాన్ని రఫీ అచ్చు గుద్దినట్లుగా '**ఖిలోనా జాన్‌కర్ తుమ్‌తో మేరా దిల్ తోడ్ జాతే హో-ముఝే ఇస్ హాల్ మే కిస్ కే సహారే ఛోడ్ జాతే హో**' పాటలో వినిపించాడు.

ముఖ్యంగా 'తుమ్‌తో' పదాన్ని పలికే విధానం సంజీవ్ కుమార్ నటనకు ఎంత సన్నిహితంగా ఉందో చూస్తే, రఫీ పాటలో ఎంత బాగా నటిస్తాడో అర్థమవుతుంది. (హాస్యగీతాల గురించి ప్రస్తావించినపుడు ఈ ప్రత్యేకతను మరింత విస్తారంగా చెప్పుకోవచ్చు). రఫీ పాడని ఆ తరం నాయకుడెవ్వడూ లేడు. మామూలుగా వేరే గాయకులెక్కువ పాడిన వారికి కూడా రఫీ పాడ్డం, ముఖ్యంగా మేటి గాయకుడు కిశోర్ కుమార్‌కు కూడా నేపథ్యం ఇవ్వడం, రఫీ ప్రత్యేకతగా చిరకాలంగా చెప్పుకుంటూనే ఉన్నాం. ఇలా తక్కువ పాటల్లోనే ఆ హీరోలకు చిరస్మరణీయమైన పాటలు అందించిన వారిలో ప్రముఖులు సునీల్‌దత్, మనోజ్‌కుమార్,రాజేశ్‌ఖన్నా మొదలైనవారు.

రఫీ కథానాయకుడు అనడానికి గొప్ప నటుల హావభావాలను, పాత్రల మనః స్థితిని ప్రతిబింబించేలా పాడడం ఒక్కటే కారణం కాదు. కొందరు నటులు పాత్రకు, సన్నివేశానికి తగిన నటన చేయకపోయినా, రఫీ మాత్రం తన గానంలో ఆ ఎఫెక్ట్ తీసుకురావడం అసాధారణమైన విషయం. జాయ్ ముఖర్జీ, బిశ్వజిత్, జితేంద్ర, ఫిరోజ్ ఖాన్', అనిల్‌ధావన్ వంటి అనేకమంది సామాన్య నటులు తెరపైన పాటల సన్నివేశంలో చూపిన హావభావాలు కంటే, నేపథ్యంలో రఫీ ప్రదర్శించిన భావావిష్కరణే గొప్పగా ఉంటుంది. '**ఆంచల్ మే సజా లేనా కలియా, జుల్ఫో మే సితారే భర్ లేనా**' (**ఫిర్ వహీ దిల్ లాయాహూ**)లో జాయ్ ముఖర్జీ, '**పుకార్ తా చలా హు మై**' (మేరే సనమ్ )లో బిశ్వజిత్, '**హం తుమ్ సే జుదా హోకే మర్ జాయేంగీ రో రోకే**' (ఏక్ సపేరా ఏక్ లుటేరా )లో ఫిరోజ్‌ఖాన్ ,'**బార్ బార్ దిన్ యే ఆయే**' (**ఫర్జ్**)లో జితేంద్ర, '**తేరీ గలియో మే న రఖేంగే కదమ్**' (హవస్)లో అనిల్‌ధావన్‌ల ముఖాల్లో కంటే రఫీ గొంతులోనే ఎక్కువ భావం పలికిందంటే అతిశయోక్తి కాదు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

'ఒక్క సినిమా హీరో' అని చెప్పుకునే వారికి కూడ గళం అమర్చిన ఘనత రఫీదే. హిందీ సినీ చరిత్రను తిరగేస్తే, 1940 దశకంలో త్రిలోక్ కపూర్, సుశీల్ కుమార్ శామ్, రణధీర్, జయరాజ్, రహమాన్, మహీపాల్, జయంత్ వంటి నాయకులకూ,1950దశకంలో సుప్రసిద్ధులతో పాటు, ప్రేమ్‌నాథ్ (కొద్ది రోజుల తర్వాత విలన్, కారెక్టర్ నటుడు), కరన్ దివాన్, ప్రేమ్ అజీజ్, అభి భట్టాచార్య, అజిత్, చేతన్ ఆనంద్ (అనంతరం దర్శకుడు), చంద్రశేఖర్ వంటి వారికీ, 1960 దశకంలో సుధీర్ కుమార్, రంజన్,సుజిత్ కుమార్, శైలేశ్ కుమార్, పరీక్షిత్‌సహానీ వంటి హిందీ నటులతోపాటు, దక్షిణాది సినిమాల డబ్బింగ్ చిత్రాల్లో ఎన్టీఆర్, ఎం.జి.ఆర్., శివాజీ గణేశన్‌లకు,1970 దశకంలో ధీరజ్ కుమార్, కమల్‌జిత్, దారాసింగ్ మొదలైన వారికీ వారు కథానాయకులుగా నటించిన ఒకటీ, అరా చిత్రాలకు రఫీయే గాయకుడు.

ఒక వైపు అశోక్‌కుమార్ నుంచి అమితాబ్‌బచ్చన్‌వరకు అతి ప్రసిద్ధులైన నాయకులందరికీ పాడుతూ, మరోవైపు పైన చెప్పిన చిన్న నాయకులకూ పాడుతూ, ఇంకోవైపు హాస్య పాత్రధారులకు, నేపథ్యగానాలకూ భిక్షుక పాత్రలకూ, వృద్ధ పాత్రలకూ...ఇందు గలడందులేడని సందేహము వలదు, రఫీ సర్వోపగతుండులా కనీసం మూడు దశాబ్దాలు ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన రఫీ కథానాయకుడు కాకపోతే మరెవరు కథానాయకుడు? ప్రమాణాల విషయంలో మాత్రం నటుడు, సంగీత దర్శకుడు, గీత రచయిత, దర్శకుడు, బ్యానర్ వేటితోను రఫీకి ప్రమేయం లేదు. దిలీప్ కుమార్‌కు పాడినా, దారాసింగ్‌కు పాడినా, పాటకు న్యాయం చేయడంలో రఫీ ఏ తేడా చూపలేదు. నటుడిని బట్టి, కథను బట్టి, సన్నివేశాన్ని బట్టి అపారమైన వైవిధ్యాన్ని చూపుతూనే, అందరికీ తన గళాన్ని సమాన స్థాయిలో అరువిచ్చిన మహనీయుడు రఫీ.

**- మృణాళిని**

**రఫీ గాన వైదుష్యాన్ని ఇంకొక కోణంలో వివరించే మరొక వ్యాసం వచ్చే సంచికలో...**



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**చిత్రం** మేరే మెహబూబ్
**రచన** షకీల్ బదయూనీ
**సంగీతం** నౌషాద్
**గానం** రఫీ, లతా
**అభినయం** రాజేంద్రకుమార్, సాధన



షకీల్‌బదయూనీ పండితకవి,ఉర్దూ భాషపై,నుడికారంపై అసాధారణమైన పట్టు ఉన్నకవి. అతను తొలి నుంచి,సినీ సంగీతంలోనూ విద్వాంసుడిగా పేరుపొందిన నౌషాద్‌కు సహచరుడై,అద్భుతమైన పాటలు అందించాడు. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన బైజూబావరా, మొగల్-ఎ-ఆజమ్, మేరే మెహబూబ్, పాల్‌కీ, రామ్ ఔర్ శ్యామ్ మొదలైన సినిమాలు కథా పరంగానే కాదు; పాటల పరంగానూ సూపర్‌హిట్లు.

సన్నివేశానికి తగిన అభివ్యక్తి, భావానికి తగిన భాష,ఆలంకారిక ప్రయోగాల్లో అందెవేసిన చేయి షకీల్ బదయూనీ,ఆయన రాసిన ఎన్నో గొప్ప పాటల్లో తొలి వరసన నిలిచేది మేరే మెహబూబ్ సినిమాలో టాండమ్ సాంగ్ (రఫీ,లతా), శీర్షికా గీతం కూడా అయిన 'మెరె మెహబూబ్ తుఝే మేరీ మొహబ్బత్ కీ కసమ్'

ఇది ముస్లిం కుటుంబాల నేపథ్యంలో నడిచిన కథ, చిత్రంలో భాష ఉర్దూ, ఈ చిత్ర కథలో ముఖ్యమైన అంశం కథా నాయకుడు ముప్పాతిక సినిమా వరకూ తన ప్రియురాలిని గుర్తించకపోవడం. రాజేంద్రకుమార్, సాధన ఒకే కళాశాలలో విద్యార్థులు. సనాతన ముస్లిం కుటుంబానికి చెందిన సాధన సహజంగానే బురఖా ధరించి



శాలకు వస్తుంది. ఒక రోజు రాజేంద్రకుమార్‌తో ఢీకొని, ఇద్దరూ పరస్పరం సుకుంటారు. బురఖాలోంచి కనిపించిన ఆమె నేత్రద్వయం, కింద పోయిన పుస్తకాలు తీసుకుంటున్నప్పుడు కలిగిన స్పర్శా సుఖం-ఆ ంలోనే ఇద్దరి మనస్సుల్లోనూ ప్రేమను అంకురింపజేస్తాయి. అంతకు ంచి సాధన ముఖం కూడ అతను చూడడు. ఇది అనేక అపార్థాలకు తీయడం,తర్వాత గుర్తించి ప్రేమించుకోవడం, మళ్ళీ విఘాతాలు రావడం సుఖాంతం కావడం...మామూలే.

ఈ పాట సన్నివేశం ఆద్యంతం మధురం. ఆ రోజు కళాశాల చివరి ు. మరుసటి రోజుతో అందరూ విడిపోతారు. ఆ సాయంత్రం గజల్ టీ ప్రకటిస్తారు. అప్పటికే గజల్ నాయకుడిగా ప్రసిద్ధి చెందిన అన్వర్ జేంద్రకుమార్),ఈ పోటీలో మిత్రుడు జానీవాకర్ ప్రోద్బలంతో పాల్గొని, ప్రేయసిని అన్వేషిస్తూ, ఆమెకు తన ప్రేమ సందేశాన్ని తెలుపుతూ డతాడు. సభ నిండుగా జనం,చివరి చివరి వరసల్లో,ఎవరి కంటా



డకుండా కూర్చుని, పాటలోని ప్రతి అక్షరం తన గురించేనని అర్థమైన నందంతో, ఆరోజు తర్వాత అతన్ని చూడనేమోనన్న దుఃఖంతో కళవళ డుతూ కూర్చున్న సాధన ప్రతి ముఖ కవళికలోనూ తన ప్రేమను, వేదనను క్తం చేస్తూ, సభంతా కలయజూస్తూ, ఆమె వింటూనే వుంటుందని శిస్తూ, వ్యథను అనుభవిస్తున్న రాజేంద్రకుమార్, పదపదంలోనూ థానాయకుడి ఆర్తిని, కోరికను, ప్రేమను, విషాదాన్ని అద్భుతంగా లికించిన రఫీ గానం, అజరామరమైన బాణీతో, పాటను ప్రవాహంలా డిపించిన నౌషాద్ సంగీతం కలిసి ప్రేమించిన ప్రతి పురుషుడి భావనలనూ తిధ్వనింపజేసిన షకీల్ శాయరీకి అమరత్వాన్ని కల్పించాయి.

**మేరే మెహబూబ్ తుఝే-మేరీ మొహబ్బత్ కీ కసమ్**
**ఫిర్ ముఝే నర్గీసి ఆంఖోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

ఇది పల్లవి,మెహబూబ్ అంటే ప్రేయసి. మొహబ్బత్ అంటే ప్రేమ. సమ్ అంటే ఒట్టు. నర్గిస్ అంటే అందమైన ఒకపువ్వు. సహారా అంటే సరా. ఖోయా హువా అంటే పోగొట్టుకున్న, కోల్పోయిన, నజారా అంటే ృశ్యం.

**ఓ నా ప్రేయసీ, నా ప్రేమ మీద ప్రమాణం చేసి చెబుతున్నాను**
**మళ్ళీ నాకు నీ (కలువ) పువ్వులాంటి కనుల ఆసరా ఇవ్వవా**
**నేను కోల్పోయిన రంగురంగుల దృశ్యాలను చూపవా**

ఈపాట మొత్తంలో సహారా పదం చాలా సార్లు వస్తుంది. ప్రేయసి వరో తెలీదు. కానీ ఆమె తన జీవికకు, తన ఆనందానికి ఆధారమై ోయింది. ఆ ఆత్మార్పణ తత్వాన్నే ఈ పాట మొత్తంగా ప్రతిఫలిస్తుంది. ఇది రఫీ పాడిన ఆరుచరణాల సుదీర్ఘమైన పాట.

అందులో మొదటి చరణం:

**ఐ మేరే ఖాబ్ కీ తాబీర్ మేరీ జానె గజల్,**
**జిందగీ మేరీ తుఝే యాద్ కియే జాతే హై**
**రాత్ దిన్ ముఝే కో సతాతా హై తసవ్వుర్ తేరా**
**దిల్ కీ ధడ్‌కన్ తుఝే ఆవాజ్ దియే జాతే హై**
**ఆ ముఝే అప్‌నీ సదావోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

ఖాబ్ అంటే స్వప్నం. తాబీర్ అంటే ప్రభావం. జానె గజల్ అంటే గజల్ ఆత్మ. తసవ్వుర్ అంటే స్వప్నం. సతానా అంటే వేధించడం. దిల్‌కి ధడ్ కన్ అంటే గుండె చప్పుళ్ళు.

నా కలలను ప్రభావితం చేసిన దానా అంటే తన కలల్లో నిరంతరం ప్రత్యక్షమవుతున్నావు అని చెప్పడం. అతను పాడుతున్నది గజల్. అందుకే ఆమెను తన గజల్‌కు ఆత్మగా సంబోధించాడు. తన జీవితం ఆమెను జ్ఞాపకం చేసుకుంటోందట. రాత్రింబగళ్ళు ఆమె కలలు అతన్ని వేధిస్తున్నాయి. రాత్రులు మాత్రమే అని చెప్పడం లేదిక్కడ. పగలు కూడా. అంటే అతనికి ఆమె సాక్షాత్కారంతో రాత్రీ,పగలు తేడా తెలీడం లేదో, లేక పగటి కలలు కంటున్నాడో, అతని గుండె చప్పుళ్ళు ఆమెను పిలుస్తున్నాయి (ఆవాజ్ దేతాహై)

'రా, మళ్ళీ నాకు ఆ జ్ఞాపకాల ఆసరా ఇవ్వు. నేను కోల్పోయిన రంగురంగుల దృశ్యాన్ని తెచ్చివ్వు' అని అంటున్నాడు. ఇక్కడ కలలు,అతని గుండె చప్పుళ్ళూ ,చివరికి అతని జీవితం యావత్తు ఆమెను జ్ఞాపకం చేసుకుంటున్నదని,ఆమెను పిలుస్తున్నాయని చెప్పాడు.

రెండో చరణం :

**భూల్ సకతే నహీ ఆంఖే వో సుహానా మంజర్**
**జబ్ తెరా హుస్న్ మేరే ఇష్క్ సే టకరాయా థా**
**ఔర్ ఫిర్ రాహమే బిఖ్‌రేతే హజారో నగ్‌మే**
**మై వో నగ్‌మే తెరి ఆవాజ్ కో దే ఆయాథా**
**సాజె దిల్ కో ఉన్హీ గీతోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

ఆ కనుల సౌందర్యాన్ని మరిచిపోలేనని పదేపదే చెబుతున్నాడు. అవును మరి. ముఖసౌందర్యమంతా చూసివుంటే, ఇంకా పొగిడేవాడే. కానీ చూసింది ఓ పాయ జుట్టునూ, నయనాలనూ, చేతులనే. అందుకే వాటినే తలుచుకోవడం. రెండో వాక్యం చాలా గొప్ప కవితా పంక్తి. జబ్ తేరా హుస్న్ మేరే ఇష్క్ సే టకరాయా థా - నీ అందం నా ప్రేమతో ఢీకొన్నపుడు. ఉర్దూ కవితా సమయాల్లో ప్రముఖమైనది - స్త్రీని సౌందర్యంగా, పురుషుడిని ప్రేమగా ప్రతీకీకరించడం. అవి రెండు ఎదురయ్యాయి. ఇక్కడ నిజంగానే వీళ్లిద్దరూ భౌతికంగా ఢీకొన్నారు. దాన్ని ఈ కవితా సమయంతో అద్భుతంగా వర్ణించాడు షకీల్. (ఈ సినిమాలోని మరో పాటలో 'ఐ హుస్న్ జరా జాగ్ తుఝే ఇష్క్ జగాయే' అన్నాడు షకీల్. అంటే, సౌందర్యమా నిద్రలే. ప్రేమ



నిన్ను మేల్కొలుపుతోంది) మూడో వాక్యంలో బిఖర్ నా అంటే చెల్లాచెదరు కావడం. నగ్మే అంటే పాటలు. ఈ సన్నివేశంలో చెల్లాచెదరైనవి పుస్తకాలు. కానీ వీరిద్దరి పాలిటికి అవి ప్రేమగీతాలు. ఆమెను ఢీకొనడం వల్ల, దారి పొడుగునా వేలవేల పాటలు చెల్లాచెదరయ్యాయట. ఆ పాటలనే నీ స్వరానికి అలదడానికి తీసుకువచ్చాననంటున్నాడు (మై వోనగ్మే తేరీ వాక్యం). దానికి ముక్తాయింపు మరీ అందంగా ఉంది. సాజె దిల్ అంటే శ్రావ్యమైన హృదయం. నా శ్రావ్యమైన హృదయానికి నీ గీతాల ఆసరా ఇవ్వు అని విన్నపం వినిపించుకుంటున్నాడు. హృదయానికి శ్రావ్యం అనే విశేషణం సుమధురం.

మూడో చరణం:

**యాద్ హై ముఝ్ కో మేరీ ఉమ్ర్ కీ పెహలీ వో ఘడీ**
**తెరీ ఆంఖోంసే కొయి జామ్ పియాథా మైనే**
**మేరీ రగ్‌రగ్ మే కొయీ బర్క్ సీ లెహరాయీ థీ**

**జబ్ తేరే మర్ మరీ హాథోంకో చువా థా మైనే**
**ఆ ముఝే ఫిర్ ఉన్హీ హాథోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

తన జీవితంలోని ఆ అత్యద్భుతమైన ఘడియలు అతనికి గుర్తుకొస్తున్నాయి. ఆమె కనులలోంచి మదిరను తాగిన ఆ దివ్యానుభూతి, అతని అణువణువులోనూ విద్యుత్ ప్రకంపనలే. ఆమె నునుపైన చేతులు తాకినపుడు. మళ్ళీ ఆ మెత్తని చేతుల ఆసరా ఇవ్వవా అని ప్రాధేయపడుతున్నాడు. కథను, సన్నివేశాన్ని బట్టి రాయడమంటే ఇదే., అంతకు ముందు వాళ్ళిద్దరూ కళాశాల వరండాలో నడుస్తూ పొరపాటున ఢీ కొట్టుకున్నారు. ఆ క్షణంలో ఆమె బురఖా కనుల మీద నుంచి తీయడం వల్ల అతనికి కళ్ళు మాత్రమే కనిపించాయి. ఆమె చేతుల్లోని పుస్తకాలు కిందపడ్డాయి. అవి తీసుకోవడానికి ఇద్దరూ ఒకే సారి వంగి పుస్తకం పట్టుకోవడం వల్ల,చేతులు తగిలాయి. ఆ రెండు క్షణాలే అతని ప్రేమకు బీజం వేసాయి. ఈ సన్నివేశాన్ని ఆమెకు గుర్తు చేయడానికే ఆ రెండు విషయాలు ఈ చరణంలో ప్రస్తావించడం .

నాలుగో చరణం:

**మైనే ఎక్‌బార్ తేరీ ఏక్ ఝలక్ దేఖీ హై**
**మేరి హసరత్ హై కి మై ఫిర్ తేరా దీదార్ కరూ**
**తెరె సాయే కో సమఝకర్ మై హసీ తాజ్‌మహల్**
**చాంద్‌నీ రాత్ మే నజరోంసే తుఝే ప్యార్ కరూ**
**అప్‌ని మెహకీ హుయి జుల్ఫోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**









ఇందులో అద్భుతమైన కవిత్వం ఉంది. ఝలక్ అంటే ఒక్క తటిల్లత లాంటి మెరుపు మాత్రమే. ఆమెను రెప్పపాటున మాత్రమే చూసాడు. హసరత్ అంటే కోరిక. దీదార్ అంటే చూడడం. సాయా అంటే నీడ. మెహకీ అంటే సుగంధభరితమైన, జుల్ఫ్, అంటే శిరోజాలు.

**నేను ఒకే ఒకసారి నిన్ను మెరుపులా చూశాను**
**నిన్ను మళ్ళి మళ్ళి చూడాలని కోరుతున్నాను**
**నీ నీడను తాజ్‌మహల్‌గా అనుకుని**
**వెన్నెల రాత్రిలో కనులతో నిన్ను ప్రేమిస్తాను**
**పరిమళాలు వెదజల్లే నీ శిరోజాల ఆసరా నాకివ్వవా**

ముందు చరణంలో చెప్పిన సన్నివేశానికిక్కడ వివరణ ఇస్తున్నాడు. నిన్ను మళ్ళీ చూడాలని ఉంది. అందరూ తాజ్‌మహల్ నీడలో, వెన్నెలరాత్రి ప్రియురాలని కలుసుకోవాలని ఉందని అంటారు. ఈ కవి గొప్పతనం ఏమిటంటే, ఆమె నీడనే తాజ్ మహల్ అనుకుంటాడు. అంటే అతనికి వెన్నెల రాత్రి వేరే తాజ్‌మహల్ అక్కర్లేదు. ఆమె సాన్నిహిత్యం, తాజ్‌మహల్ సాన్నిహిత్యమే.

అయిదో చరణం:

**ఢూండ్ తా హూ తుఝే హర్ రాహ మే**
**హర్ మెహఫిల్ మే**
**థక్ గయే హై మేరీ మజ్‌బూర్ తమన్నా కే కదమ్**
**ఆజ్ కా దిన్ మేరీ ఉమ్మీద్ కా హై ఆఖరీ దిన్**
**కల్ న జానే మై కహా ఔర్ కహా తూ హూ సనమ్**
**దో ఘడీ అప్ నీ నిగాహోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

ఆమె అందాన్ని పొగిడాడు. ఆమె తనలో కల్గించిన ప్రకంపనాలను విశదం చేసాడు. ఆమె సాన్నిహిత్యం కావాలన్నాడు. తన అణువణువూ ఆమె ఆసరాను కోరుకుంటున్నదని పదేపదే చెప్పాడు. ఎవరికి అందాలో ఆమెకు తన సందేశం అందిందో లేదో అన్న నిరాశతో నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పు ఈ చరణంగా రూపుదిద్దుకుంది.

**నిన్ను అన్ని దారుల్లోనూ, సభల్లోనూ వెతుకుతున్నాను.**
**నా నిస్సహాయ కోరిక అనే పాదాలు అలిసిపోయాయి**
**(మజ్‌బూర్ అంటే నిస్సహాయత)**
**ఈ రోజు నా విశ్వాసానికి ఆఖరిరోజు (ఉమ్మీద్ అంటే నమ్మకం, విశ్వాసం)**
**రేపు నువ్వెక్కడో, నేనెక్కడో, ప్రియా (సనమ్ అంటే ప్రియా)**
**రెండు క్షణాలు నీ చూపుల ఆసరా ఇవ్వవా (నిగాహే అంటే చూపులు)**

నిజంగానే ఆ రోజు తర్వాత ఆమెను చూసే ఆశలేదు. అదే కళాశాలకు చివరిరోజు కనక. కథను, సన్నివేశాన్ని, వేదనామయమైన హృదయాన్ని అన్నిటినీ ధ్వనింపజేసే వాక్యం.

ఆరో చరణం:

**సామ్‌నే ఆకే జరా పరదా ఉఠాదే రుఖ్‌సే**
**ఇక్ యహీ మేరా ఇలాజే గమె తన్‌హాయీ హై**
**తేరి పురఖత్ నే పరేశాన్ కియా హై ముఝ్‌కో**
**అబ్ తో మిల్‌జాకే మేరీ జాన్ పే బన్ ఆయీ హై**
**దిల్ కో భూలీ హుయీ యాదోంకా సహారా దేదే**
**మేరా ఖోయా హువా రంగీన్ నజారా దేదే**

రుఖ్ అంటే ముఖం. ఇలాజ్ అంటే చికిత్స, వైద్యం, తన్‌హాయి అంటే ఒంటరితనం. ఫుర్‌ఖత్ అంటే వియోగం. జాన్ పె బన్ ఆయీ హై అంటే ప్రాణం మీదికి వచ్చినంత పనయింది. సదావోంకా అంటే ఎల్లప్పటికీ.

అలిసిపోయానని చెబుతూనే చివరగా ధైర్యం చేసి అనేసాడు.

**నా దగ్గరికి వచ్చి, ఆ ముఖం మీది**
**బురఖా తీయి**
**అదొక్కటే నా ఒంటరితనం అనే బాధకు**
**ఉపశమనం ఇవ్వగలదు**
**నీ వియోగం నన్ను చాలా బాధిస్తోంది**
**ఇప్పటికైనా రా - నా ప్రాణం కొడిగట్టింది**
**ఎప్పటికీ నీ ఆసరాను నాకివ్వు**

ఇంతవరకూ నీ చేతులు, శిరోజాలు, జ్ఞాపకాలు, పాటలు, చూపుల ఆసరా అడిగాడు. ఇది చాలదని ఎప్పటికీ పూర్తిగా నీ ఆసరా ఇవ్వమని అంటున్నాడు. నిజానికిది ఇది ఒక ప్రేమికుడు ఒక ప్రేయసితో జరుపుతున్న సంభాషణ (అందుకే దీన్ని గజల్ అన్నారు). కానీ, ఏకాంతంలో చేయాల్సిన విన్నపాలను బహిరంగ సభలో చేస్తున్నాడు. అందరూ ఉన్నచోట కూడా తామిద్దరే ఉన్న అనుభూతి కలిగేలా, కాస్సేపు స్వగతంలా, కాస్సేపు సంభాషణలా సాగే పాటకు గొప్ప సాహిత్యాన్ని అందించిన షకీల్ బదయూనీ, గజల్‌లో సాధారణంగా కనిపించే పరిమిత స్వరాలను అధిగమించి, ముఖ్యంగా చరణాలకు ఎంతో వైవిధ్య భరితమైన బాణీని అందించిన నౌషాద్, స్వరంతో కాక ఆత్మతో పాడిన రఫీ నిజంగా ధన్యులు!

ఒకే పాటని రెండు వెర్షన్‌లుగా, రెండు వేర్వేరు కంఠాలు పాడితే వాటిని టాండమ్ సాంగ్ అంటారు. రఫీ పాడిన ఈ పాటకు టాండమ్ సాంగ్ లతా వెర్షన్ కూడా ఉంది. రఫీ పాటలోని ఒకటవ,మూడవ,ఆరవ చరణాలు లతా పాటలో ఒకటి, రెండు, మూడు చరణాలుగా వినిపిస్తాయి.

**- మృణాళిని**

రచన: యం.యం.కీరవాణి (1) గానం: టిప్పు, మధుశ్రీ

ఆ: తొలి తొలి కోరిక తొంగి చూస్తుంటే
కంటికి కరువయ్యే కునుకమ్మా..
ఆ..బులిబులి ఆశలు పుట్టుకొస్తుంటే
ఒంటికి బరువయ్యే పైటమ్మా..
దొంగ మేత పెడతా నీకు ఎంగిలంటనిస్తే నాకు.. ॥2॥
అందుకే.. ఇక దూరాలు వద్దంట మనకు మనకు
ఆడుకుందామా.. తెగ కూడుకుందామా.. ॥2॥
అ: చలి చలిగాలులు చంపుతూవుంటే
గుర్తుకు వచ్చావే బుల్లెమ్మా..
నీ చిరు చిరు నవ్వులు గుర్తుకు వస్తే
గుండెకు గుబులాయె బుల్లెమ్మా
తిక్క తిక్కగా వుంది నాకు తిమ్మిరెక్కిపోనీమాకు ॥2॥
అందుకే.. ఇక దూరాలు వద్దంట మనకు మనకు
ఆడుకుందామా.. తెగ కూడుకుందామా.. ॥2॥
కో: తబుతా..తబుతా..తబుతబు తబుతా..
ఆ: అమ్మ అప్పచ్చి కమ్మనప్పిచ్చి కోరి తెచ్చాలేరా..
నీకు సగం నాకు సగం చేసి చూడరా..
కో: లా..లా..లా..లా..
అ: ముద్దు అప్పిచ్చి పిచ్చి రప్పిచ్చి తెగ మురిసే చెలియా
కన్నె ఒడి సాగుబడి కాదని అననే
ఆ: మారాకు చెయ్యొద్దురా.. మాటల్తో చంపొద్దురా
అ: చేసేది చెయ్యొద్దని ఊరిస్తూవుంటే ఎలా..
ఆ: అందుకే ఎండకొండెక్కిపోయాక వెన్నెల వచ్చాక
మేలుకుందామా.. తెగ కోలుకుందామా..
అ: కోలుకుందామా.. మళ్లీ కోరుకుందామా
ఆ: తొలితొలి కోరిక తొంగి చూస్తుంటే కంటికి
కరువయ్యే కునుకమ్మా..
అ: నీ చిరు చిరు నవ్వులు గుర్తుకు వస్తే
గుండెకు గుబులాయె బుల్లెమ్మా...
కో: హె..హే..హెహే..హె..హే.. నరనన నన్నా
ననన నరనన నన్నా నననన
అ: మాటి మాటికి మల్లెతోటకి నిన్నురమ్మంటుంటే
రానంటూనే వస్తుంటే నిన్నేమనుకోనూ
ఆ: పూటపూటకి పిల్లగాడికి తెగ వివరాలడిగే
ఒపికకి తీరికకి ఎట్టా పొగడను
అ: చూసింది ఏముందనీ ఇంకెంతో చూడాలనీ
ఆ: ఊరించే ఊసులన్నీ ఊరంతా చెప్పొద్దనీ
అ: అందుకే.. ఎవరేమన్నా అనుకున్నా వింటున్నా వినకున్నా
నవ్వుకుందామా.. తెగ లవ్వుకుందామా
ఆ: వలపు వరదలో పడి కొట్టుకు పోదామా..
అ: చలి చలిగాలులు చంపుతూవుంటే
గుర్తుకు వచ్చావే బుల్లెమ్మా..
ఆ: ఆ..బులిబులి ఆశలు పుట్టుకొస్తుంటే
ఒంటికి బరువయ్యే పైటమ్మా..

రచన: భువన చంద్ర (3) గానం: శ్రేయాఘోషల్, బృందం

ఆ : కుర్ కు కూరు.... కో : కు కు కు
ఆ: కుర్ కు కూరు.... కో : కు కు కు
ఆ: కుర్ కు కూరు.... కో : కు కు కు
ఆ: కు కు
కో: కుర్ కు కూరు....కు కు కు కుర్ కు కూరు....
కు కు కు కుర్ కు కూరు....
ఆ: కు..కు..గుంటూరు గుండమ్మ వరిచేలు దాటాక
కో: వస్తాది సుబ్బయ్య మావిడి తోట
ఆ: మావిడి తోటకి కావలి వస్తాడు
కో: పక్కూరి పాలేరు పుల్లయ్య మావ
ఆ: పుల్లయ్య ఏస్తాడు కల్లునీ...
కల్లు తాగాక తీస్తాడు గురకనీ....
గురక పెట్టాక చెట్టెక్కికాయల్ని తెంపేసి
ముక్కలుగా కోసేసు కుందాములే...
కోసిన ముక్కల్లో ఉప్పుని కారాన్ని
కలిపేసి కమ్మంగా నంజుకు తింటూ వుంటే ...
కో: ॥కుర్ కు॥
ఆ: గంగమ్మ గంపకింద.....
కోడి గుడ్లన్నీ కొట్టేద్దామా.... కో: మా...
సాలూరు సంతకెళ్లి... గుడ్లు
ఎంచక్కా అమ్మేద్దామా.... కో: మా....
కొప్పాక తిరణాలలో.... రంగుటద్దాలు కొనితెద్దామా..... కో: మా..
మంగమ్మ గుడిపక్కన...... బొమ్మ పెళ్లిళ్లు చేసేద్దామా...
ఇటురా...... రో...... బసవ..... న్నా...... తాటి
ఆకుల్ని చుట్టేసి బూరాలు చేసేసి
ఊదుతున్న వేళ ఊరంతా గోలమ్మ గోల..... ॥కుర్ కు॥
ఆ: దొరగారి చెరువొడ్డున....
చేరి చేపల్ని పడదామా...... కో: మా...
రెడ్డన్న లేదూడతో...
పరుగు పందాలు వేద్దామా.... కో: మా...
పలకల్ని పక్కనెట్టి....
తేనె పట్టుంది పడదామా....
బంగారు ధనలక్ష్మికీ.....
లేత ముంజల్ని పెడదామా....
బడికా.... డ.... దడిమీ.... ద
కొత్త సినిమాల బొమ్మల్ని అంటించినారంట
పరపరపర చింపేసుకొచ్చామంటే ॥కుర్ కుక్కూరు॥

రచన: భువన చంద్ర (2) గానం: కీరవాణి, బిందు

అ: ఓ..ఓ..ఓ...కనులకేల ఎరుపురంగు బుగ్గలకే చాలులే...
ఈ దాసుని తప్పులకు.. ఇంత శిక్ష వద్దులే...
ఎలా.. ఎలా.. ఎలా ఎలా
చిలకగారి అలక తీరడం ఎలా....ఓ..ఓ..ఓ.. ॥కనుల॥
అ: నీ గోటి ఆనవాళ్లకై తపించుతున్న వేళ్లకూ...
నీ కూతలోని తీపినీ... తినాలనుంది చెవులకూ..
ముద్దుగా.. గుండెపైన... తన్నినా...
మువ్వలో.. ప్రేమ నవ్వే... ఘల్లునా...
ఔనంటే ప్రణయమూ... కాదంటే ప్రళయమూ...
నవ్వవా.... మరీ..
ఆ: ఎలా.. ఎలా.. ఎలా ఎలా..
మునగచెట్టు ఎక్కి నిలవడం ఎలా ? అ: ॥కనుల॥
అ: నీ కంటిచూపు చాలనీ అంటోంది వెండి వెన్నెల
నీ శ్వాస తగలలేదనీ... కాగింది ఒళ్లు సలసలా
కినుకతో... మూగవైన ఏమిలే...
మనసుకే.. మనసుభాష.. తెలుసులే...
ఏకాంత సమయమూ ఎదలోన విరహమూ
నవ్వవా..చెలీ...
ఆ: ఎలా.. ఎలా.. ఎలా ఎలా..
మొగుడి మాటనమ్మి నవ్వడం ఎలా ?
అ: ఓ..ఓ..ఓ...కనులలోని ఎరుపురంగు బుగ్గలలో చేరెలే
చిలకగారి నవ్వులతో అలక ఎగిరిపోయెలే
అ: ఎలా.. ఎలా..
అ: ఇలా.. ఇలా.. వలపుసీమ తలుపు తీయడం ఇలా..
ఆ: లాలాలా..లాలా...లాలాల...
ఇ: ఊహూ..హు హు హు హు హే..హే..

రచన: కొసరాజు రాజేంద్రబాబు **4** గానం : సునీత

తాననాన తాననాన తాననాన తాననాన
తాననా...నాన... నాన... ననా
నానన ననా లేత మనసా... లేతమనసా...
లాలాలల లాలాలల ఊహు హూ హు ఉహు హూహు
లాలలాలాలల.... లలలలా లలలాలలా లేతమనసా...
లాలలాల ఊహు హూ హూ లాలలాల...ఆ(....
తాననాన తాననాన తాననాన తాననాన
తాననా...నాన... నాన... ననా
తరేరా... లేతమనసా....
లాలలాల లాలలాల..లాలలాల...లా...ఆ(....ఆ(....

రచన: కీరవాణి **5** గానం : కీరవాణి, చి

అ: తన్నానా తన్నానా బళ్ళోన దేవుడి గుళ్ళోనా
తన్నానా తన్నానా ఏనాడైనా అనుకున్నానా
చెట్టా పట్టాల అల్లరే సిగ్గుల మొగ్గలా ఒదుగుతుందని
ఉత్తి ఉత్తుత్తి స్నేహమే ఊహల్లో స్వర్గమై ఎదుగుతుందని
వానా చినుకుల్లా రాలి వరద పొంగుల్లో తేలి తేలి
కలలేవో మురిపిస్తాయని...
నిన్న మొన్నటి చెలిమి దూరం అయినట్టే అయ్యి
మళ్ళీ మనకోసం తిరిగొస్తుందని
ఆ: తన్నానా తన్నానా బళ్ళోన దేవుడి గుళ్ళోనా
తన్నానా తన్నానా ఏనాడైనా అనుకున్నానా
చెట్టా పట్టాల అల్లరే చూపుల్లో
మౌనమై పలుకుతుందని
ఉత్తి ఉత్తుత్తి స్నేహమే ఊహల్లో
స్వర్గమై ఎదుగుతుందని
వాన చినుకుల్లా రాలి వరద పొంగుల్లో తేలి తేలి
కలలేవో మురిపిస్తాయని
నిన్న మొన్నటి చెలిమి దూరం అయినట్టే అయి
మళ్ళీ మనకోసం తిరిగొస్తుందని
ఆ: తన్నానా తన్నానా
అ: తన్నానా తన్నానా
కో: రప్పపే... రప్పపే.... రప్పప్పా రప్పప్పే
ఆ: తనతో నడిచే నిమిషం
దారిలోన ముళ్ళే పూలై తగిలే..
అ: తనలో ఏదో బిడియం నన్ను చూసి
మెరిసే మెరుపై తోచే
ఆ: తనతో వుంటే గడియారంలో చిన్నముల్లే
పరుగే తీసే పెద్ద ముల్లులా
అ: పడుతుంది గుండె ఉలికి ఉలికి
తనతో మాటాడాలంటే ఏదో పిరికి
ఆ: ఇది వరకెన్నడెరుగని హాయి సొంతం అవుతుందనీ...
అనుకున్నానా..
అ: తన్నానా తన్నానా బళ్ళోన దేవుడి గుళ్ళోనా
ఆ: తన్నానా తన్నానా ఏనాడైనా అనుకున్నానా
ఆ: చిలకే నేనై పోయి
తన పేరే రోజూ పలకాలనిపిస్తుంది
అ: పలకాబలపం పట్టి
తనపేరే నాకు దిద్దాలనిపిస్తుంది
త్వరగా లేచి కోడి పుంజుకి మెల్లగా
మేలుకొలుపే పాడనా
ఆ: పడుతుంది సిగ్గు ఉలికి ఉలికి
అద్దం నావంకే చూసి నవ్వే సరికి
అ: ఇదివరకెన్నెడురుగని వింత జ్వరమే సోకేననీ....
అనుకున్నానా
అ: తన్నానా తన్నానా బళ్ళోన దేవుడి గుళ్ళోనా
ఆ: తన్నానా తన్నానా ఏనాడైనా అనుకున్నానా
ఆ: చెట్టా పట్టాల అల్లరే చూపుల్లో మౌనమై
పలుకుతుందని
అ: ఉత్తి ఉత్తుత్తి స్నేహమే ఊహల్లో స్వర్గమై
ఎదుగుతుందని
ఆ: వాన చినుకుల్లా రాలి వరద పొంగుల్లో తేలి తేలి
కలలేవో మురిపిస్తాయని
అ: నిన్న మొన్నటి చెలిమి దూరం అయినట్టే అయ్యి
మళ్ళీ మనకోసం తిరిగొస్తుందని
ఆ: తన్నానా తన్నానా
అ: తన్నానా తన్నానా

రచన: భువన చంద్ర **6** గానం: కీరవాణి, సాధనాసర్గమ్

అ: ఆనాటి మన చెలిమీ.. కాదా.. ఒక కల
ఈనాడది మెదిలిందీ.. నా మదిలో.. ఇలా
ఆ: ఆ...ఆ..ఆ... ఆ నవ్వుల చల్లదనం.. ఆ శ్వాసల వెచ్చదనం...
మమతలతో ఎద నింపిన ఆ మనసుల తియ్యదనం..
అ: ఎద వీడి పోని జ్ఞాపకాలుగా...
ఆ: వసివాడి పోని ఊహలై ఇలా... అ: ॥ఆనాటి॥
అ: పొగడ చెట్టు నీడలో.. బొంగరాల ఆటలూ
కూనలమ్మ కోనలో.... కొంటె కొంటె పాటలు
ఆ: వెన్నెలమ్మ మేడలో.. ఆడుకున్న ఊసులూ
గున్న మావి తోటలో.. పెంచుకున్న ఆశలూ
అ: గోడ మీద రాసుకున్న ముద్దు పేరులూ
ఊరి బైట మర్రికాడ కుర్రచేష్టలూ
అ: తాయిలాలు పంచుకున్న తీపి గుర్తులూ
గుండె దాచుకున్న వెండి చందమామలూ
అ: చిరు చినుకులలో మన సరిగమలూ
ఎద పిలువక పిలిచిన పిలుపుల సవ్వడిలో ఆ: ॥ఆనాటి॥
ఆ: అట్లతద్ది రోజున.. పిట్టగోడ దూకుతూ..
చేసుకున్న బాసలూ.. మనసు మరిచి పోదుగా
అ: మొదటిసారి పైటతో... ఎదుట నిలిచి నవ్విన..
కన్నె జాబిలమ్మనూ.... కనులు మరువ లేవుగా
ఆ: పుస్తకాల చాటునించి దొంగ చూపులు
చెరువుకాడ గురువుగారు పడ్డ తిప్పలూ
అ: కాలమన్న సాలెగూడు కట్టి వేయగా
గొంతు దాటి పైకి రాని మూగప్రేమలూ
ఆ: ఒక అలజడిలో.... ఒక వురవడిలో
మది తెరువక తెరిచిన తలపుల తాకిడిలో.. అ: ॥ఆనాటి॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుదు
...రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



శ్రీ శివసాయి పిక్చర్స్
కొసరాజు రాజేంద్రబాబు
సమర్పించు

# లేత మనసులు

LETHA MANASULU

**తారాగణం**

శ్రీకాంత్, కళ్యాణి, గోపిక, ఎ.వి.యస్., రఘునాథరెడ్డి, శివాజీరాజా, శివపార్వతి, కృష్ణచైతన్య, కాంచి తదితరులు

నిర్మాతలు: బాలశౌరి, యమ్. అనంతవర్మ  స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: యస్.వి. కృష్ణారెడ్డి M.Com

యం.యం. కీరవాణి - చింతపల్లి రమణ - కంతేటి శంకర్ - ముత్యాల నాని

**...ంకేతిక ...పుణులు**

| | | | |
|---|---|---|---|
| సంగీతం | : యం.యం.కీరవాణి | కో-డైరెక్టర్స్ | : కుర్రా రంగారావు, కృష్ణ చైతన్య |
| మాటలు | : చింతపల్లి రమణ | అసోసియేట్ డైరక్టర్స్ | : మహానందరెడ్డి, నితీష్, బాలు |
| ఛాయాగ్రహణం | : శంకర్ | ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : రాంప్రసాద్, |
| నృత్యం | : రమణి | ప్రొడక్షన్ మేనేజర్స్ | : టి. రామిరెడ్డి, సురేష్‌వర్మ, లక్ష్మీపతి |
| కూర్పు | : ముత్యాల నాని | సమర్పణ | : కొసరాజు రాజేంద్రబాబు M.Com, |
| కళ | : జె.పి. | నిర్మాతలు | : యమ్.అనంతవర్మ M.B.A., |
| స్టిల్స్ | : మనీషా ప్రసాద్ | | బాలశౌరి B.A., |
| మీడియా రిలేషన్స్ | : భగీరథ | స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఎస్.వి.కృష్ణారెడ్డి M.Com, |
| పబ్లిసిటీ | : జిమ్మిక్స్ | | |



...సరాజు రాజేంద్రబాబు



బాలశౌరి



యమ్.అనంతవర్మ



ఎస్.వి.కృష్ణారెడ్డి



యం.యం.కీరవాణి



భువనచంద్ర

**సినీ గీతానికి సినారె అద్దిన సొగసులు, జిలుగులు మహత్తరమైనవి. సమకాలీన కవులలో ప్రతిభామూర్తులెందరున్నా 'ఆయనదొక శకం ఆయనదొక యుగం' అనిపించుకోవడం సామాన్యమైన విషయం కాదు. అది ఒక సినారెకే సాధ్యపడింది. సీనియర్ సముద్రాల నుండి సీతారామశాస్త్రి దాకా సినారె తన అనుభూతులను గత సంచికలో ఆవిష్కరించారు. ఆ తర్వాతి తరం గురించి, సినీ గీతం గురించి ఈ సంచికలో....**



# సినీ గీతం - సినారె మనోగతం

(గత సంచిక తరువాయి)

తరువాత వచ్చినది కొత్త తరం... కొత్తస్వరం... కొన్ని పాటలేంటి ఇంత బాగా రాశాడు అనిపించేది నాకు ఎప్పుడన్నా! కానీ సమస్యఏమిటంటే - ఎన్నో సభల్లో చెప్పాను... గీత రచయితలుండగా చెప్పాను. సంగీత దర్శకులుండగా చాలా తీవ్రంగా చెప్పిన ఘట్టాలున్నాయి. "అయ్యా.. సమకాలీన హిందీ సినిమా పాటలు వినండి. వాడు సమర్థుడా..అసమర్థుడా...కేవలం అంత్యప్రాసలు కూర్చే కవా...తర్వాత సంగతి. అసలు అతను ఏది రాస్తున్నాడన్నది వినిపించింది. కవి శబ్దాలు సంగీత మాధ్యమం ద్వారా, మీడియం ద్వారా అందంగా శ్రవణపేయంగా మనకు వినిపించాలి. అది గీత లక్షణం. కవి ఇచ్చిన గీతం అనే సాహిత్య ఖండం అశ్వికుడిలాంటిది. సంగీతం, ట్యూన్, బాణీ, దానికిచ్చే నేపథ్యసంగీతం.... అశ్వం లాంటిది. కాబట్టి గీతం అనే అశ్వికుడు, సంగీతం అనే అశ్వాన్ని అధిరోహించి కదను తొక్కిస్తుంటాడు. ఎక్కడ మెత్తగా కదను తొక్కించాలి - ఎక్కడ తీవ్రంగా కదను తొక్కించాలి - ఎక్కడ బుడి బుడి నడకలతో సాగిపోవాలి - ఎక్కడ పవనగతిలో సాగిపోవాలి - ఎక్కడ ఎగిరిపోవాలి - ఎక్కడ ఎగిసిపోవాలి అనేది ఆ గీతంలోని రచనను బట్టి ఉంటుంది. కాబట్టి గీతం అనేది ఏమిటో ట్యూన్ అనే మీడియం ద్వారా స్పష్టంగా వినిపించాలి.

కానీ ఇప్పుడేమైంది ...!? గుఱ్ఱం మీద అశ్వికుడు స్వారీ చేసే బదులు...అశ్వికుడి మీద గుఱ్ఱం స్వారీ చేస్తోంది. ట్యూన్ తప్పు లేదు. ఆ ట్యూన్ రికార్డింగ్ చేసిన పద్ధతి...మిక్సింగ్ అంటారు దాన్ని... ఆ మిక్సింగ్ చేసిన వాద్యఘోష... అది మాటల్ని మింగేస్తుందని, తొక్కేస్తుందని నా అభిప్రాయం. కాబట్టి రికార్డింగ్‌లో ఉన్న అస్పష్టత వల్ల ప్రతిభావంతుడైన రచయిత రచించిన పంక్తులు కూడా మరుగున పడిపోయి బీట్ కొడుతోంది. మాట కాదు బీట్ ముఖ్యం అయింది. కాబట్టి తర్వాతి తరంలో వస్తున్న కవులు...కొత్త స్వరం కవులు..కొత్త తరం కవులు...అక్కడక్కడ... ఎప్పుడైనా బాగా రాశాడే ఇది.. అనుకునేలోగా మళ్లా మూడో పంక్తి వినపడదు. కొన్నేమో పల్లవికి, చరణానికి సంబంధం ఉండదు. కొన్నేమో ప్రతి రెండో పంక్తికి సంబంధం ఉండదు. అంటే అంతఃసూత్రం ఉండదు. అది మంచి లక్షణం కాదు. ఉన్నదాంట్లో అన్వయం ఉండాలి. పల్లవితో లింక్ ఉండాలి. దేనికి అదే అయితే ఇక పాట ఎందుకు..!? ఇందులో సమర్థులైన, ప్రతిభావంతులైన గీత రచయితలు చాలామంది ఉన్నారు. నేను ఏదో ఒక్క పేరు చెప్పటం భావ్యం కాదు.

ఇక పాటల్లో అంత్యప్రాసలు అనేవి ఆరుద్రతో ఊపందుకున్నాయి. అంతకుముందు కూడా రాశారు. అయితే భావం కుదరాలి.. మాటా కుదరాలి. ఇప్పుడేమిటంటే ఏం చెబుతున్నాడో కాదు ఎంత చమత్కారంగా

తున్నాడనేది ప్రధానం అయ్యింది. అసలు
అంత్యప్రాసలలో - శబ్దం, నాదం వినిపిస్తుంది
అర్థం కుదరటం లేదు... కొన్ని అట్లా
న్నాయి. ఇతర భాషా పదాలు కూడా...
వసరంగా ప్రయోగిస్తున్నారు. హిందీ
ంగ్స్‌లోని లైన్లుకి లైన్లే ఎగిరివచ్చి
టుచేనుకుంటున్నాయి. 'ఓ...ఓ.. నా
ా..అరె..ముజే లే జా...'ఇది కామెడీ అయితే
ు... మా కాలంలో వేమూ రాశాం.
ౌచితంగా రాశాం. ఇక్కడ పాత్రోచితం కాదు
్ని పాత్రలు ఒకటే. వెనకటి కాలంలో
టకొంగు జారిందే గడుసుపిల్లా...' అన్నాడంటే
పైట.. అలా జారటం.. ఆ పిల్ల
స్థకోవటం..''నీ జిలుగు పైట నీడలోన
ువనీ....'' అని నేనన్నప్పుడు ఆ జిలుగు పైట
ా చూపించారు. ఇప్పుడు పాటలకు
లున్నాయి తప్ప కంటికి లేవు. పోనీ ఈ
టను తీసేద్దామన్నా కూడా 'ఏముంది ఎవరు
స్తారండి...'అంటారు. కారణం అక్కడ స్టెప్స్...
వెనక కాలంలో నాగేశ్వరరావు గారి స్టెప్స్ వేరు.
ను వేసే అడుగులు భావానికి పోషకంగా
ండేవి. ఇప్పుడు హీరో హీరోయిన్ ఇద్దరూ
రుతుంటారు, వాళ్లతో పాటు చుట్టూ జనం
స్... అప్పుడు కోరస్ అని రాస్తేనే కోరస్
ట్టేవారు. బృంద నృత్యాలు వేరేగా ఉండేవి.
ప్పుడు పాట మొదలయిందంటే హీరో
రోయిన్... చుట్టూ ఇటు అటు మంద.
క్కొకసారి హీరోయిన్ ఎవరో తెలీదు. వాళ్లలో
ిసి పోతుంది. అందుకే నేనన్నాను ఇవి బృంద
ాలు కావు... మందగీతాలని.

నేనెప్పుడూ ఆశావాదినే. ఒక కవిగా, నా
ాతి మూడు నాలుగు తరాలకు చెందిన
ర్తమాన కవుల కవితా సంపుటాలకు పీఠికలను
శాను. అందరూ నాకు అంకితం చేసిన వాళ్లే.
రు ఎదుగుతున్న దశలో వాళ్ల ఎదుగుదల చూసి
ంతోషించాను. లిఖితరూపంగా మెచ్చుకున్నాను.
లాగే ఇప్పుడు కూడా చెప్పాలని ఉంటుంది.
ైనా సభలో... సినిమా సభలోనైనా సరే...
ానా కవి కలుస్తారు. కొత్తగా రాస్తున్నాడు.
ాస్తుంటాను. 'హాసం'ను బట్టి తెలుసు
ంటుంటాను. ఓహో..ఇందులో సత్తా ఎంత
ంది. ఎవరి సత్తా ఎంత ఉంది. రచనాపరంగా.
క్షరక్షర సంయోగం అన్నానే అది ప్రింట్‌లో
ంటితో చూసినప్పుడు ఇది మంచి రచన
నుకుంటాను. మరుగున పడిపోయిందని
ధపడతాను.... వింటే!

గాయనీ గాయకుల గురించి చెప్పాల్సొస్తే
ంటసాల గారు మహానుభావుడు...ఆయనది
ముఖీన ప్రతిభనా... పంచముఖీనా, షణ్ముఖీనా
ి నేను చెప్పలేను. సార్వముఖీన ప్రతిభ
యనది. అద్భుతంగా పాడేవాడు.
.బి.శ్రీనివాస్... మార్దవం ఆయన గొంతు.
ృదువుగా పాడినా అందులో కూడా స్పష్టత
ండేది. పై స్థాయిలో పోయేది కాదు. కామెడీ
చ్చేటప్పటికీ మాధవపెద్ది, పిఠాపురం...ఇలా
పాడేవారు. ఏది పాడినా ఉచ్చారణలో స్పష్టత,
రికార్డింగ్‌లో స్పష్టత అవసరం. ఇప్పుడు నేను
వింటుంటాను ...కొన్ని గొంతులు వస్తున్నాయి.
పురుషుడు పాట ఉండే అందులో గొంతు
స్త్రీత్వానికి దగ్గరగా ఉంటుంది. మెత్తగా
ఉంటుంది. నత్తి నత్తి మాటలు మాట్లాడే
గొంతులు కూడా పాడుతున్నాయి. ఏం చేస్తాం.
అవి పాపులర్ అయ్యాయి.



ఇక స్త్రీ కంఠాలున్నాయి. తెలివైన వాళ్లు. బాగా
పాడతారు. కానీ ఏంటో కొంచెం పైకి వెళితే
కీచుమంటాయి. సుశీల, జానకి...ఆ తరం
అయిపోయింది. 'పగలే వెన్నెలా' టైంలో
బి.ఎన్.రెడ్డి గారు 'కొంచెం క్లారిటీ.. క్లారిటీ'
అనేవారు. 'అమ్మా జానకి ఇలాగమ్మా...' అని
నేను అంటే 'నేను అలాగే పాడుతున్నానండి'
అనేది. 'మీరు అలాగే పాడుతున్నారమ్మా..
రికార్డింగ్‌లో ఇలా వినిపిస్తోంది' అనేవారు బి.ఎన్.
...అంటే.. ఒక వాక్యం.. ఒక పదం సుస్పష్టంగా
వినిపించకపోతే ఆపేసేవారు. ఎన్టీఆర్ కూడా
అలా జాగ్రత్తగా రికార్డు చేయించేవాళ్లు. ప్రతి
శబ్దం శ్రావ్యంగా, నిర్దుష్టంగా వినిపించాలి.
బ్యాక్‌గ్రౌండ్‌లో ఇంటర్‌లూడ్స్ మ్యూజిక్ నీ ఇష్టం.
ఇప్పుడేమయిందంటే పైకి వెళ్లేనరికి
కీచుమంటున్నాయి.

ఏదయినా బాల సుబ్రహ్మణ్యం దాకా అదో
యుగం. బాలసుబ్రహ్మణ్యం స్వర
సార్వభౌముడు. ఎన్నోసార్లు అన్నాను అతడు
ఆబాల గోపాల సుబ్రహ్మణ్యం అని. చాలా
సమర్థుడు. అసాధారణ ప్రతిభావంతుడు. అతడు
కూడా స్పష్టత లేకపోతే చాలా
కోపగించుకుంటాడు. నేను సూచనప్రాయంగా
కొంచెం లోపాలు ఎత్తి చూపుతున్నాను.
బాలసుబ్రహ్మణ్యం అయితే వేదికలమీద
విరుచుకుపడుతున్నాడు - ఆ పాటలమీద,
ఆ గొంతుల మీద.

తెలుగులో మహమ్మద్ రఫీతో ఎక్స్‌పరిమెంట్
చేశాం. నేను కూడా దానిలో భాగస్వామిని.
సాధ్యమైనంత వరకూ నూటికి 90 పాళ్ళు బాగా
పాడేటట్టు చూశాం. అయితే రఫీ ఉర్దూ
గాయకుడు. తెలుగుపాట ఉర్దూలో నేను
రాసిచ్చేవాడ్ని. చెప్పేవాడ్ని. ఒక విద్యార్థిలా
నేర్చుకునేవాడు రోజంతా. 'ఇద్దరి మనసులు
ఒకటాయె ' అని ఉండాలి... ఉర్దూలో ఏంటంటే
'ఇద్దరి మనసులు ఒకటాయె' అన్నప్పుడు కొంచెం
స్ట్రెస్ ఉంది. కాబట్టి ఉచ్చారణ దోషాలు లేకుండా
చూసుకున్నాం. కానీ ఇప్పుడేంటి... 'రామ
చిలకమ్మా' అంటే పాడినవారు 'రావ్మా
చిలకమ్మా' అని పాడారు.

ఇప్పుడు సంగీత దర్శకులలో సమర్థులు
ఉన్నారు కదా, పాటలు ఉచ్చారణ పరంగా కానీ,
శ్రవ్యత పరంగా కానీ ఎందుకు శ్రద్ధ తీసుకోవట్లేదు
అని అంటే... నాకు తెలిసింది ఏంటంటే...
చాలావరకూ వారు రికార్డింగ్ సమయంలో
ఉండరు. రికార్డింగ్ అప్పుడు ఉన్నా... మిక్సింగ్
అని ఉంటుంది.. ట్రాక్ మిక్సింగ్... అప్పుడు
ఉండరు. ఆ రోజుల్లో ఏది పాడినా అందరూ
ఉండాల్సిందే.. ఇప్పుడలా కాదుగా. గిటార్
అతను వస్తే ఆ బిట్ వేరే తీసుకుంటారు. ఆర్గన్
వేరే... ఎవరికి వారే రికార్డింగ్‌కు వస్తారు. అవన్నీ
మిక్స్‌చేస్తూ పాట చేస్తారు. చేసేటప్పుడు ఆ
మిక్సింగ్ చేసే రికార్డిస్ట్ తప్ప చాలా వరకూ వీళ్లు
ఉండరని నాకు తెలిసింది. వాళ్లకు ఏంటి ...
పాటలో మ్యూజిక్ ఎంత బాగా వినిపిస్తుందనే
తప్ప 'మాట గొంతు' మీద ఎక్కడ నొక్కు
పడుతుందో తెలియదు కదా. అందులోనూ భాష
తెలియని వాళ్లు ఉంటారు. అనేక కారణాల వల్ల
పాటకు ఈ పరిస్థితి వచ్చింది. నా బాధ ఏమిటంటే
హిందీ తెలిసిన వాణ్ణి. అరబిక్ మ్యూజిక్ చూసి
'వాహ్' అని అరిచేశాను. కాబట్టి సంగీతం
ఎక్కడైనా ఒక్కటే. ట్రాక్ మిక్సింగ్‌లో కూడా జాగ్రత్త
పడకపోవటం పాట సరిగా రాకపోవటానికి ఒక
కారణం.

నా అనుభవాలు నేను చెప్తున్నాను. ఇవి
శాసనాలు కావు. నా మనసులో మెదిలిన భావాలు
... ప్రతిభ అనేది ఒక సృజనాత్మక శక్తి. అది
నిరంతర ప్రవాహిని. 'ఈ నది అలలు ఇంతవరకే
ఆగిపోయాయి. తరువాత ఇక సాగిపోదు'
అనుకోవటం అజ్ఞానం. అలలు సాగిపోతూనే
ఉంటాయి. కొన్ని అలలు మృదువుగా
సాగిపోతాయి. కొన్ని ఉవ్వెత్తుగా ఎగిసి
సాగిపోతాయి. అన్నిటి లక్ష్యం అవతలి తీరం
చేరుకోవటం. అంటే సాగరం చేరుకోవటం.
కాబట్టి ఆ చేరుకునేలోగా అలల గతులు, అలల
సంగీత శ్రుతులు విని ఆనందిస్తాం. మన తెలుగు
సినీ గీతం కూడా ఆ రకంగా ఉండాలని
కోరుకుంటున్న వాళ్లలో నేనొకడ్ని కాబట్టి నాకున్న
అనుభవాలు కొన్ని... అనుభూతులు కొన్ని..
స్పందనలు, ప్రతిస్పందనలు కొన్ని. వీటిని
సంక్షిప్తంగా పుటలను అతిక్రమించకుండా
చెప్పడానికి ప్రయత్నించాను. సెలవ్.

రచన: ఇ.యస్.మూర్తి **(1)** గానం: ఉదిత్ నారాయణ్, సుజాత

కో: షలలాలలాయ్...షలలాలలాయ్..సోణియె.. ॥2॥
అ: ఆ తుమ్మెద రెక్కలనడుగు
ఈ పూవుల మొక్కలనడుగు
నా గుండెల సవ్వడి వింటూ వున్నవి
ఆ: చలి నచ్చని కౌగిలినడుగు
నులి వెచ్చని ఆశల నడుగు
ఇంకెన్నాళ్ళో ఈ దూరం అన్నది
అ: నీ ఒక్క చూపు తాకి
నా ఎద తేలిపోయి
ఎటో వెళ్ళెనే ప్రియతమా..
ఇటే వచ్చె నా ప్రాణమా... ॥ఆ తుమ్మెద॥
అ: ఎడారంటి ఎదలో నువ్వు
ప్రేమ జల్లువై కురిశావు
ఎలా శిలను ప్రేమించావో చెలియా చెప్పవా..
ఆ: గులాబిలో ముల్లుని చూసి
అదే దాని గుణమనుకుంటే
అమృతాలు పంచే మనసు మళ్ళీ దొరుకునా
అ: ఇలా పూలతోటను విడిచి రాళ్ళదారిని
ఎలా చేరగలవో నడిచి ప్రేమగూటిని
ఆ: ఒకే పిలుపు చాలునులే
ప్రాణాలే పోయినా
నా మనసే ఆగునా...
అ: ప్రాణాలే పోయినా
నా మనసే ఆగునా ఆ : ॥ఆ తుమ్మెద॥
ఆ: మనసులేని కాలం మనకు
విధించింది ఈ ఎడబాటు
నవ్వుతూనె కవ్వించాలి లోకం తీరుని
అ: రమ్మంటేనె పండగరాదు
ప్రతీరాత్రి పున్నమికాదు
వలే వేసి రప్పించాలి వాసంతాలని
ఆ: ఒకేమాట ఒకటేగమ్యం ప్రేమ జంటకీ
ప్రపంచాన్ని ఓడించాలి గెలుపు మాదనీ
అ: విధే వచ్చి తలవొంచాలి
ప్రేమే నిజమని
మీకెదురే లేదని
ఆ: ప్రేమే నిజమని
మీకెదురే లేదని.....
అ: ఆ తుమ్మెద రెక్కలనడుగు
ఈ పూవుల మొక్కలనడుగు
నా గుండెల సవ్వడి వింటూ వున్నవి
ఆ: చలి నచ్చని కౌగిలినడుగు
నులి వెచ్చని ఆశల నడుగు
ఇంకెన్నాళ్ళో ఈ దూరం అన్నది

రచన: సుద్దాల అశోక్ తేజ **(4)** గానం : దీపిక

చిట్టీ చిలకమ్మా
అమ్మకొట్టిందా
తోటకెళ్ళావా
పండు తెచ్చావా
ఉయ్యాల జంపాలా
నిన్నెవరూ ఊపాలా
నీలాల కన్నులకు
జోల ఎవరు పాడాలా
ఈ నేలే నీకు ఉయ్యాలా....
ఈ గాలే నీకు ఓ జోలా...

రచన: సుద్దాల అశోక్‌తేజ **(2)** గానం: శంకర మహాదేవన్,మాలతి,
సాకీ : ఎస్.ఎ.రాజ్‌కుమార్

సాకీ:దసరనాడు విడుదలైన హిట్టు సినిమాలా.....
మనోడదిగో.... వచ్చేశాడు మాసు హీరోలా....
అ: బాలామణెమ్మో....బాలామణెమ్మో
లీలామహల్ ఎనక నీతో చాలా పనమ్మో
ఆ: బుచ్చి మల్లయ్యో బుచ్చి మల్లయ్యో
వచ్చిపోయె దారిలోన గిచ్చామాకయ్యో
అ: మసక చీకటేల వచ్చి చేయి పట్టుకో
ఆ: మాటు చూసి బొడ్డు మీద ముద్దు పెట్టుకో
అ: అబ్బో బల్లే బల్లే దీని ఒళ్ళే బబ్బుల్‌గం బిళ్ళే బిళ్ళే
ఆ: అమ్మో ముల్లే ముల్లే వీడి కళ్ళే గుండెల్లో గిల్లే గిల్లే అ:॥బాలా॥
అ: ఐస్క్రీముందయ్యో... బుగ్గలనిండా చూడయ్యో
పిజ్జా చూడయ్యో పెదవుల్లోన వుందయ్యో
అ: ఆకలి తీరదే....చూపులతోనె తింటుంటే
దాహము ఆరదే ఊహలతోనే తాగేస్తే
ఆ: మిర్చి బజ్జీ నీకిచ్చి ..పట పట పట నమిలిస్తా
గోళీ సోడా కొట్టేసి... గట గట గట తాగిస్తా
అ: మిడ్నైటు వచ్చేసి...కిల కిల కిల నవ్విస్తా
బెడ్డులైటు ఆపేసి...తళ తళ తళ మెరిపిస్తా
ఆ: వినోదాల లీలామహల్ నేనే నీకు రేయిపగల్
అ: అబ్బో పిల్లే పిల్లే దీని ముందు రంభైనా డొల్లే డొల్లే
ఆ: అమ్మో జిల్లే జిల్లే దుప్పటల్లే వీడుంటే చాల్లే చాల్లే అ:॥బాలా॥
అ: గ్రాఫిక్ బొమ్మలా రోడ్డుకు అడ్డం నువ్వుంటే
ట్రాఫిక్ ఆగదా బొడ్డు కిందకు చీరుంటే
ఆ: రైకే తడవదా అబ్బాయ్ నువ్వే లుక్కేస్తే
లైకే కలగదా జబ్బల మీద నొక్కేస్తే
అ: రబ్బరు బొమ్మ నీ మూటర్ తగ్గదు లేవే నీ టెంపర్
సూపర్ డూపర్ నీ పిక్చర్ ఎట్టావుందే నా లెక్చర్
ఆ: నాది కొత్త థియేటర్ నువ్వే నాకు ప్రొప్రైటర్
పోతే పోనీ జన్రేటర్ పవరుఫుల్లు నా మీటర్
అ: దేనికైనా నేనే తయార్ దిగానంటె ఖుస్తా బహార్
ఆ: అబ్బో తుళ్ళే తుళ్ళే వీని వైపే నా ఈడు మళ్ళే మళ్ళే
అ: అబ్బో ఫుల్లే ఫుల్లే దీని కైపే నాటు సారా త్రిల్లే త్రిల్లే ॥ బాలా ॥

రచన: సాయిశ్రీ హర్ష **(3)** గానం : హరిహరన్,సుజాత

అ: ఓ హంపి బొమ్మా ఎల్లోరగుమ్మా కళ్ళార్పలేనమ్మా
ఆ: నీ కన్నువేస్తే ఈ కన్నెకేమో ఇక ధన్యమీ జన్మా
అ: ఏ బ్రహ్మ చేశాడో ఈ అందమూ
ఆ: ఈ బొమ్మ జన్మంతా నీ బంధమూ
అ: అందాలు అందాలి అందాల క్షణమూ ॥ఓ హంపి॥
అ: జారు పైట నీదీ- ఆ జామపండు నాదీ
జన్మంత ఉంది ప్రేమసందీ
ఆ: జోరుపాట నీదీ-నీ పల్లవేమొ నాదీ
జన్మంత నీకు నేను బందీ
అ: సితార.. మీటు..కోగా
ఆ: సుతార.. రాగం.. రేగా
అ: వరాలు... అందుకోగా..
ఆ: స్వరాలు.. స్వాగతమీగా..
అ: జగాలనంత ఏలుప్రేమ చెంతవచ్చి నిలిచినంత
నిన్ను నేను నన్ను నువ్వు గెలుచుటెంత ॥ ఓ హంపి ॥
ఆ: పట్టుమంటు నిమిషం పట్టేదికాదు సమయం
పుట్టంగ ఈ ప్రేమ విషయం
అ: గుట్టు అంటు శూన్యం గుండెల్లో ప్రేమ ధన్యం
దేహాలు అన్ని దాని సైన్యం
ఆ: షికారు.. చేయు..నమ్మా..
అ: శకాల.. కాలం.. ప్రేమా
ఆ: సుఖాలు.. కోరదమ్మా
అ: శుభాలు.. తెచ్చునులేమ్మా
ఆ: స్వరాజ్యమొచ్చి స్వర్గమందు ఇల్లు మనము కట్టినంత
లోకమంత లోకువంట ప్రేమచెంతా.. అ: ॥ఓ హంపి॥

**5** గానం: కల్పన

సా... సనిదామగ
దసరీ గస
సనిదాసరి
గమాద సనిద నిదమగ సరిగమద సరిగసా
నిదమ సనీదమగ సరిగమద
పరమపావనా
పాపమోచనా
పరమపావనా

రచన: సుద్దాల అశోక్ తేజ **6** గానం: చిత్ర, ఎస్.ఎ.రాజ్‌కుమార్, డా॥ నారాయణ్, కోరస్

ఆ: లాలాలా..లాలాల..లాలాల...లాలాల
సిరిమల్లీ పువ్వల్లే నవ్వులే చల్లుతూ
ఆనందం పొందాలీ ఆడుతూ పాడుతూ...
అపురూపమైనదీ.. ఈ లోకమూ...
నూరేళ్ళ అతిథులం... మనమందరం...
ఈ కూకూల బండల్లె సాగాలి మన జీవితం....
కో: గుండెలోన కోరికున్నది
నింగిదాక వెళ్ళమన్నది
కొత్తగొంతు విప్పమన్నది
కోయిలల్లె కూయమన్నది
ఆ: సిరిమల్లీ పువ్వల్లే నవ్వులే చల్లుతూ
ఆనందం పొందాలీ ఆడుతూ పాడుతూ...
అపురూపమైనదీ.. ఈ లోకమూ...
నూరేళ్ళ అతిథులం... మనమందరం...
ఈ కూకూల బండల్లె సాగాలి మన జీవితం....
ఆ: లేలేత అరిటాకు అమ్మాయేననీ
అనుకుంటే... మన పరుగు వెనుకవుతుందనీ
ఎదురొచ్చే ... అవకాశం మనకే అనుకునీ...
ఎదురెళ్ళి.. సంధిస్తే గెలుపే మనదనీ...
మా నాన్నే నేర్పిన... చినినాటి మాటిదే...
తన వేలే చూపినా... విజయాల బాటిదే...
మా నాన్న మాటంటే శ్రీకృష్ణ గీతంటిదే....
కో: మనసు నిండ ఆశలున్నవి
మళ్ళి మళ్ళి పొందడానికే ఆ: ॥సిరిమల్లీ॥
ఆ: ఇంటింట... తానుండే వీలే లేదనీ...
పంపించే.. ఆ దైవం తల్లీతండ్రినీ...
మననీడ.. మనదంటు.. అనుకోకెన్నడూ...
అది నాన్న ...కనుపాప ...చలువే ఎప్పుడూ
తన రక్తం.. పంచిన ప్రతి తల్లీ దేవతే...
అనుబంధాలల్లిన.... ప్రతి ఇల్లూ స్వర్గమే...
మా నాన్న గుండెల్లో గువ్వంటె నేనేనులే...
కో: అమ్మ నాన్న ఎదురుచూపుతో
రైలు వేగమందుకున్నదే
కో: లాలాలా..లాలాల..లాలాల...లాలాల
అ: చిన్నారీ నెలవంకా స్వాగతం.. స్వాగతం..
ఆ: నీతోనే మాకింకా జీవితం జీవితం
అ: నను కన్నతల్లివే నా కంటికీ
ఆ: నువు వెన్నెలమ్మవే మా ఇంటికీ
ఇ: నీకాలి మువ్వల్లె మా గుండె మోగిందిలే...
చిన్ని నవ్వు నువ్వు నవ్వితే
జాబిలమ్మ మాకు ఎందుకే
అ: నాన్న అంటు నన్నుచేరితె
ప్రాణమింక లేచివచ్చులే
ఇ: లాలాలా..లాలాల..లాలాల...లాలాల

రచన: సుద్దాల అశోక్ తేజ **7** గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

చిట్టీ చిలకమ్మా
అమ్మకొట్టిందా
తోటకెళ్ళావా
పండు తెచ్చావా
ఉయ్యాల జంపాలా
నిన్నెవరూ ఊపాలా
నీలాల కన్నులకు
జోల ఎవరు పాడాలా
ఈ నేలే నీకు ఉయ్యాలా....
ఈ గాలే నీకు ఓ జోలా...

గాలికి తెలియని రాగాలున్నవి
వానలు కురవని మేఘాలున్నవి
ముళ్ళుగ మారిన పువ్వులు ఉన్నవి
రాళ్ళలోదాగిన కన్నీళ్ళున్నవి
మాటలకందని హిందోళం ఇది
మనసుకు చెందని మధ్యమావతి
శివునికి తెలియని శివరంజని ఇది
చివరకు మిగలని శ్రీరంజని ఇది
ఉపిరితిత్తుల వాయులీనమిది
గుండెధ్వనించిన మృదంగ జతి ఇది
ఎవ్వరు ఎన్నడు కనని వినని ధ్వని
ఎవ్వరు తోడుగ లేని బతుకు అని
కనుల కలల అలలు విరిగిపడు ధ్వని
మనసు చితిలో మంటలెగసిపడు ధ్వని
వినాలి హృదయము చెవిగ మార్చుకొని
కనాలి తనువును కనులు చేసికొని
తబలా లెరుగని తళాంగు తకధిమి
నరాలు తెగిపడు నెత్తురొలుకు ధ్వని
తల్లిపాలకై తల్లడిల్లు పసి
బిడ్డ ఘోషకో రాగమున్నది
తండ్రి గుండెపై నిదరపోని పసి
కంటి రెప్పకో తాళమున్నది
నిప్పులు కురిసే మండుటెండలో
భగ్గున మండే అరిపాదాలతో
నడిచే నడకే నాట్యమైనది
అడుగు అడుగు ఒక భంగిమైనది
పిడికెడు మెతుకులు దొరకనప్పుడు
కడుపులో పేగులు కదిలిప్పుడు
అమ్మా అంటూ అరచినప్పుడు
ఆ పిలుపే ఒక వేదమైనది
ఆకలి నాకో పాట నేర్పినది
అశ్రువు ఇంకో పాట నేర్పినది
రాళ్ళబాటలో తగిలిన గాయం
పల్లవి లేని పాట నేర్పినది
కరగని కన్నీళ్ళు రాతిగుండెలో
పగిలిన శతఘ్ని పాటలైనవి
నాకే సవాలు విసురుతున్నవి
నన్నే స్వరాలు కట్టమన్నవి
చితికిన చిరిగిన శ్రుతిలయ విరిగిన
చితివలె రగిలిన చిటపట పదముల
పా....టే చేశానా..
ప్రాణం పోసి పాడానా..
మంటై నా పాటే
నన్నే దహించి వేసేనా....ఓ..ఓ...


పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.
శ్రీమతి. CH.శ్రీలక్ష్మి సమర్పించు
మేధ మీడియా
తారాగణం
ఆర్యన్ రాజేష్, సదా,
అతుల్ కులకర్ణి,
యం.యస్.నారాయణ,
ధర్మవరపు సుబ్రహ్మణ్యం,
సూర్య, చంద్రకాంత్,
మాధురి, ప్రగతి,
మాస్టర్ స్వప్నిల్,
బేబి భవ్య,
తదితరులు
సాంకేతిక నిపుణులు
మాటలు : వేగేశ్న సతీష్
సంగీతం : ఎస్.ఏ.రాజ్‌కుమార్
సినిమాటోగ్రఫీ : కె. శంకర్
ఎడిటింగ్ : నందమూరి హరి
ఫైట్స్ : స్టన్ శివ
ఆర్ట్ : కె.వి. రమణ
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : శ్రీనివాస్
కో-డైరెక్టర్ : నట్టి. బ్రహ్మాజీ, గోపాల్‌రెడ్డి
పబ్లిసిటీ : అంజన్ డిజైన్స్
పి.ఆర్.ఓ. : ఆర్.డి.యస్. ప్రకాష్
సమర్పణ : సి.హెచ్. శ్రీలక్ష్మి
నిర్మాత : సి.హెచ్.ఎస్. మోహన్
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : దేవీప్రసాద్
CH.S.మోహన్
దేవీప్రసాద్
ఎస్.ఏ.రాజ్‌కుమార్
సుద్దాల అశోక్‌తేజ
సాయిశ్రీహర్ష
ఇ.యస్.మూర్తి
లీలామహల్ సెంటర్
CH.S.మోహన్ ఎస్.ఏ.రాజ్‌కుమార్ దేవీప్రసాద్
వేజండ్ల సత్యనారాయణ - ముళ్ళపూడి సురేంద్రబాబు
హాసం

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 18

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహా వచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు. కానీ అశ్విని ఆత్మహత్యకు ప్రయత్నించడంతో మనసు మార్చుకుంటాడు.

**- ఇక చదవండి**




"శుభలేఖల ప్రింటింగు" ప్రస్తావన రాగానే వీరభద్రం కొంచెం మెత్తపడ్డాడు. శ్రీరామ్ పెళ్ళికి ముహూర్తాలు పెట్టగానే తానుకూడా శుభలేఖలు ప్రింటు వేయించాలి... అందుకని ఆ వివరాలు ముందుగానే తెలుసుకోవాలనుకున్నాడు.

"శుభలేఖ లేమిటి? వివాహం ఎవరికి?" అడిగాడు.

"చిత్తం!... మా అమ్మాయి జలజ పెళ్లి నిశ్చయమైందండి...వచ్చేనెల పదహారున ముహూర్త మండి... శుభలేఖలు టౌన్లో ప్రింటు చేయించుకొచ్చాను.." అంటూ చేతిసంచిలో వున్న శుభలేఖల కట్టను చూపించాడు...ఆ మాటలు వినగానే అంతకు ముందెపుడో అనంతం... తన కూతురు జలజను శ్రీరామ్‌కి చేసుకొమ్మని అడిగిన సందర్భం గుర్తుకొచ్చింది వీరభద్రానికి.

"ఇంతకూ వరుడెవరు?" అడిగాడు యధాలాపంగా.

"సీతాపురం హైస్కూల్లో హిస్టరీ టీచరుగా పనిచేస్తున్న రంగనాథం గారి పెద్దబ్బాయండి.. ఎమ్.ఎ. చదివాడు... శ్రీకాకుళంలో లెక్చరర్ ఉద్యోగం చేస్తున్నాట్ట!"

"మరి ఈ పాఠశాలలోనే-తమరితో పనిచేస్తున్న ఉపాధ్యాయుడి పుత్రునితో మీ కుమార్తె వివాహము జరుగునని -మీ బంధువెవరో ఆ మధ్య జ్యోతిష్యం చెప్పితిరి గదా...?"

"చిత్తం"!

"ఆ మాట నిజం కాలేదు కనుక... ఆయనగార్కి జ్యోతిష్యంలో ప్రవేశం లేదన్న మాట!".

"అబ్బెబ్బే....అలా కొట్టిపారేయకండి! కొన్ని కొన్ని విషయాల్లో సమయాన్ని బట్టీ సందర్భాన్ని బట్టీ ... మనకి మనం ..ఆ అంశాన్ని అన్వయం చేసుకోవాలని కూడా తమరికి ఆనాడు మనవి చేసుకున్నాను!" చెప్పాడు అనంతం...

అర్థం కానట్టు చూశాడు వీరభద్రం.

"సీతాపురం స్కూల్లో పనిచేస్తున్న ఆ రంగనాథం మేస్టారు తమరికి బంధువేనట. మాటల సందర్భంలో తెలిసింది.. వారి పితామహులూ, మీ పితామహులూ... మూడోతరం అన్నదమ్ములట.. మీ మధ్య రాకపోకలూ,పురుడు పుణ్యాలూ లేవట!... కానీ వరసలన్నీ చూసుకుంటే ఆయన మీకు తమ్ముడవుతాడట!...వారి కుమారుడు ఇప్పుడు నాకు అల్లుడవుతున్నాడు కనుక.. మీ కుమారుడి స్థానంలోకి అతను చేరుతున్నాడు కనుక...జ్యోతిష్యం ఆ విధంగా అన్వయించ బడిందని నేననుకున్నాను!"

ఆ వివరణంతా విన్న వీరభద్రం ఏదో అర్థం అయినట్టు తల పంకించాడు.. ఆ వెంటనే ఏమీ అర్థం కానట్టు... బుర్రగోక్కున్నాడు. ఈలోగా అటెండెన్సు రిజష్టర్లో సంతకం చేసి బయటకు వెళ్లిపోయాడు అనంతం.

* * *

గోపాలం చాలా దిగులుగా వున్నాడు....

తనకు అశ్వినితో పెళ్ళవుతుందనీ - ఆ తర్వాత కొన్నాళ్ళకో, కొన్నేళ్ళకో విష్ణుమూర్తి పరలోకానికి ప్రయాణం కడితే - లెఖ్ఖలేనంత ఆస్తీ, అంతస్తూ, తన సొంతమవుతాయని ఇన్ని రోజుల్నించీ గాలి మేడలు కడుతున్నాడు... ఇప్పుడు 'అశ్విని' నడిపిన ఆత్మహత్యా ప్రహసనంతో ఆ మేడలన్నీ పునాదులతో సహా కూలిపోయాయని అల్లాడి పోతున్నాడు.

ఆ బాధను దిగమింగటానికి తన గదిలో కూర్చుని - పట్టపగలే విస్కీ బాటిల్ ఓపెన్ చేశాడు... వరుసగా నాలుగు పెగ్గులు కడుపులో పోశాడు... అయిదో పెగ్గు పోసుకుంటున్న సమయంలో హనుమంతు ఆ గదిలో అడుగుపెట్టాడు.... అక్కడి వాతావరణం గమనించాడు... కొడుకు ఆవేదన గ్రహించాడు.

"అయ్యయ్యో! పొద్దు వాలకముందే కుంపటి పెట్టేశావేమిట్రా?.... నువ్విలా మీ మామయ్య కంటపడ్డావంటే మన కొంప కొల్లేరై పోతుంది..."- అంటూ గాభరాగా అక్కడున్న విస్కీ సీసానీ, గ్లాసునీ బల్లకింద దాచేశాడు.

"చూస్తే చూడనియ్ డాడీ!...అశ్విని తోడులేని ఈ బ్రతుకు వ్యర్థమన్న బాధతో తాగుతున్నానని చెప్తాను... అప్పుడైనా నేను అశ్వినిని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నానో అర్థం చేసుకుంటాడు!" - చెప్పాడు గోపాలం.

"ఏడవలేకపోయావ్‌లే! నీ ప్రేమ సంగతి ఎలా వున్నా - ఇలాంటి తాగుబోతుతో తన బిడ్డ పెళ్లి తప్పిపోయిందని ఆనందిస్తాడు...ఆ తర్వాత



నిన్నూ నన్నూ మెడపట్టి వాళ్ళ గూర్ఖాతో బయటకు గెంటిస్తాడు!" విసుక్కున్నాడు హనుమంతు.

గోపాలం మాట్లాడలేదు...

"అయినా నువ్వాపిల్లని 'అంత' గాఢంగా ప్రేమిస్తున్నావా?" - ఇంతలోనే అడిగాడు హనుమంతు.

"ప్రేమిద్దామని అనుకున్నాను డాడీ! అశ్విని చాలా బాగుంటుంది... మంచి ఛలాకీ గుర్రంలా వుంటుంది''- మందు తలకెక్కటంతో మాటలు కొంచెం మత్తుగా వస్తున్నాయి.

"నీకు మాత్రం ఏం తక్కువ?... హైటూ, వెయిటూ వున్నవాడివి... ఇది కాకపోతే మరో అరేబియా గుర్రం లాంటి ఆడపిల్ల నీకు దొరక్కపోదు!... బాధపడకు"

''అశ్విని చేజారిపోయినందుకు బాధలేదు డాడీ!... దాంతో పాటు ఆస్తి దక్కకుండా పోతోందే! - అని ఆవేదన పడుతున్నాను... అయినవాణ్ణి - మేనల్లుణ్ణి నేనుండగా ఆ అనామకుడెవరో - శ్రీరామ్‌గాడట - ఆ గొట్టం గాడికి ఈయన గారు వట్టం కడుతున్నారని వర్రీ అవతున్నాను!'' - సోఫాలో వెనక్కి జారగిలబడి బాధగా కళ్లు మూసుకున్నాడు గోపాలం...

అతని పక్కనే కూర్చుని - భుజం మీద చేయివేసి చెప్పాడు హనుమంతు -

''మీ మావయ్య అశ్వినితో నీ పెళ్లి జరిపించనన్నాడే తప్ప - ఈ ఇంట్లోంచి మనల్ని గెటౌట్ అన్లేదుగా?" -

అర్థం కానట్టు చూశాడు గోపాలం.

"నువ్ తనకు అల్లుడివి కాకపోయినా - మేనల్లుడివేనని మెచ్చుకున్నాడు. తన కంపెనీ వ్యవహారాలు చూడవచ్చునన్నాడు... అలా చూస్తూ చూస్తూ నువ్వు 'నీ' వ్యవహారం




నడపచ్చు... కంపెనీకి 'కంచె'లా నిలబడి చేనంతా మేసెయ్యచ్చు... వ్యాపారంలో నష్టాలు చూపించి నువ్వు లాభాలు చేసుకోవచ్చు..."

తండ్రి మాటలు గోపాలానికి అంతగా రుచించలేదు... ఒక్క ఉదుటున సోఫాలోంచి లేచాడు... మందు ప్రభావంతో తన మనసులో మాట చెప్పాడు -

"అదంతా లాంగ్‌రూటు వ్యవహారం... నాదంతా షార్ట్ కట్ పద్ధతి... అందుకే ఓ 'ప్లాన్' వేశాను"

"ప్లానా? ఏమిటి?" - ఆత్రంగా అడిగాడు హనుమంతు.

"మనం హైదరాబాద్ జైల్లో వున్నప్పుడు 'బాషా' అనే రౌడీషీటర్‌తో పరిచయమైంది... గుర్తుందా?"

గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం చేస్తున్నాడు హనుమంతు... ఇంతలో మళ్లీ గోపాలం చెప్పాడు-

"మనకంటే ఆర్నెల్ల ముందే జైల్లోంచి రిలీజైపోయాడు... హైదరాబాదులో అతడికో పెద్ద అడ్డా వుంది... నాకు అడ్రసిచ్చాడు... ఫోన్ నంబరు కూడా రాసిచ్చాడు..."

"అయితే?"

"అతనికి ఫోన్ చేసి పిలిపిస్తాను!"

"ఎందుకూ?"

"అశ్వినిని పెళ్లి చేసుకోబోయే ఆ శ్రీరామ్ గాడి అడ్రస్సు చెరిపెయ్యటానికి!" - అంటూ గ్లాసు తీసి మరో పెగ్గు పోసుకున్నాడు గోపాలం.

హనుమంతు గాభరాగా చూశాడు...

''వద్దులే!... ఇన్నాళ్లూ ఇలాంటి 'షార్ట్‌కట్టు' ప్లాన్లే వేసి - అష్టకష్టాలు అనుభవించాం... జైల్లో చిప్పకూడు తిని బతికాం... ఇప్పుడు రోజులు బాగుండి పెద్ద మనుషుల్లాగా మీ మావయ్య బంగళాలో ఆశ్రయం సంపాదించుకున్నాం... కొద్ది రోజుల్లో అశ్విని పెళ్లి చేసుకుని అత్తవారింటికి వెళ్లిపోతుంది... కంపెనీ వ్యవహారాలు ఎలాగా నీ చేతికొస్తాయి... అప్పుడు దర్జాగా బ్రతికేయచ్చు... నామాట విని..." అంటూ ఏదో చెప్పబోతున్న తండ్రిని పక్కకు తోసేసి టెలిఫోన్ వైపు నడిచాడు గోపాలం...

* * *

సరిగ్గా అదే సమయంలో - విష్ణుమూర్తి బంగళా ముందు టాక్సీ ఆగింది..

అందులోంచి వీరభద్రం - చిదంబరం దిగి లోపలకు ప్రవేశిస్తున్నారు... **-(ఇంకావుంది)**

# 'ఫ్యూజన్' గురించి హరిప్రసాద్ చౌరాసియా

గతపక్షం హైదరాబాదులో 'బర్‌ఖా రితు ఆయీ' పేరుతో జరిగిన కార్యక్రమంలో ప్రసిద్ధ వేణుగాన నిపుణుడు, 'సిరివెన్నెల' సినిమా ద్వారా తెలుగుప్రేక్షకులకు పరిచితుడు, హరిప్రసాద్ చౌరాసియా పాల్గొన్నారు. తొలుత సరస్వతిని స్తుతిస్తూ యమన్ రాగం (కర్ణాటక సంగీతంలో కళ్యాణి)లో స్వరాలావన చేశారు. వరుణుడి కటాక్షం కోరుతూ మేఘ్ రాగంలో మురళీ గమకాలను ఆలపించి ప్రేక్షకుల కోరికమేరకు పహాడీ రాగంలో ఆహ్లాదకరమైన స్వరాలను వినిపించారు. యువకళాకారుడు రాకేష్ చౌరాసియా సహవేణునాదం అందించారు.



కార్యక్రమానంతరం జరిగిన గోష్టిలో మాట్లాడుతూ సూర్యచంద్రులున్నంతకాలం శాస్త్రీయసంగీతం ఉంటుందన్నారాయన. 'యువతపై పాశ్చాత్యసంగీత ప్రభావమెంతగా పడినా సరే, అసలైన సంగీతం విన్నప్పుడు వాళ్లు తప్పకుండా ఆకర్షింపబడతారు. ఇటీవల మస్కట్‌లో ఓ పాఠశాలలో 8 వేల మంది పిల్లలముందు నేను ప్రోగ్రాం చేశాను. అనేక జాతులకు చెందినవారు వాళ్లు. నిశ్శబ్దంగా విని ఎంజాయ్ చేశారు. పిల్లలకు మన సంగీతపు మాధుర్యం రుచి చూపాలంతే! తర్వాత వాళ్లే అల్లుకుపోతారు.' అన్నారు.

శివకుమార్ శర్మతో కలిసి 'సిల్‌సిలా' హిందీ సినిమాకు సంగీతం సమకూర్చిన హరిప్రసాద్, బాలమురళీకృష్ణ, టి.ఆర్.మహాలింగం (మాలి), లాల్‌గుడి జయరామన్ వంటి కర్ణాటక విద్వాంసులతో వేదికను పంచుకున్నారు. 'ఫ్యూజన్' పేరుతో జాన్ మెక్‌లాఫ్లిన్, జాన్ గార్బరెక్‌లతో కలిసి కచేరీలు చేశారు.

'నేను అనేక జుగల్‌బందీలు చేశాను. జుగల్‌బందీ లో ఒక విద్వాంసుడి గురించి మరొకరికి తెలిసివుండాలి. ఇద్దరూ ఒకే గురువు వద్ద అభ్యసించి వుండాలి. కానీ ఈ రోజుల్లో కార్పొరేట్ ప్రపంచంలోని మార్కెటింగు నిపుణులు కొత్త కొత్త ఐడియాలు పట్టుకొస్తున్నారు. 'ఫ్యూజన్' అనే మాట సృష్టించి, సంబంధం లేని ఓ ఇద్దరిని కూచోబెట్టి 'పెర్‌ఫామ్ చేయమంటున్నారు.' అని వాపోయారు హరిప్రసాద్ చౌరాసియా.




ఈ జులైలో 84 ఏళ్లు పూర్తి చేసుకున్న డి.వి.నరసరాజు నాటక రచయితగా, సినిమా రచయితగా సుప్రసిద్ధులు. ఉడ్‌హవుస్ రచన ఆధారంగా 'నాటకం' అనే నాటకం రాసి అత్యంత ఖ్యాతిని మూటగట్టుకుని అర్ధశతాబ్ది క్రితం 1954లో 'పెద్ద మనుష్యులు' సినిమాద్వారా సినీరంగ ప్రవేశం చేసి అగ్రశ్రేణి సంస్థలతో, అగ్రతారలతో కలిసి పనిచేశారు. అటు బి.ఎన్.రెడ్డికై 'రంగులరాట్నం' ఇటు చక్రపాణికై 'గుండమ్మకథ' రాసి భిన్నధృవాలైన ఇద్దర్నీ మెప్పించిన దిట్ట. అనేక సెంటిమెంట్ సినిమాలకు కూడా కథ, సంభాషణలు సమకూర్చినా హాస్యసినిమాలంటే ఆయనకు మక్కువ ఎక్కువ. 'కారు దిద్దిన కాపురం' అనే హాస్యచిత్రానికి దర్శకత్వం వహించారు కూడా. 50 ఏళ్ల తన సినీ అనుభవాలను ఒక పుస్తకంగా ఇటీవలే వెలువరించారు. సున్నితమైన హాస్యంతోబాటు, సునిశితమైన వ్యంగ్యం కూడా జోడించే ఆయన శైలికి అద్దం పట్టే శీర్షిక 'అక్షింతలు' ఈనాడు దినపత్రికలో ధారావాహికంగా వెలువడింది, పుస్తకరూపంగా వెలువడింది. ఆ ఫీచర్‌లో అన్ని వ్యాసాలూ ఉత్తమపురుషలోనే రాశారు. లోకంపోకడపై తన అభిప్రాయాలను కొన్ని సందర్భాలలో డైరక్టుగానూ, మరికొన్ని ఇతర పాత్రధారుల పరంగానూ వెలిబుచ్చారు. ఆ పుస్తకంలో కొన్ని భాగాలు -

☆ "మానవుడు - తన వీలుకోసం - సృష్టించుకున్న దేవుడు - ఎంత బుద్ధిమంతుడండీ! తనను సృష్టించిన మానవుడికి ఎంత విధేయుడండీ! మానవుడు తనకి - పందిమొఖం పెడితే - ఊరుకున్నాడు! చేపని చేస్తే ఊరుకున్నాడు! సింహాన్ని చేస్తే ఊరుకున్నాడు! దేహానికి నల్లరంగు పూస్తే ఊరుకున్నాడు!నిల్చోబెడితే నిలుచున్నాడు!.. పండుకోబెడితే పడుకున్నాడు! ఇన్ని విధాలుగా మానవుడికి ఉపయోగపడ్డ దేవుణ్ణి సృష్టించుకుని అన్యాయంగా 'నువ్వే మమ్మల్ని సృష్టించావు' అని దేవుడిమీద అభాండం వేయడం - మానవుని కృతఘ్నత కాకపోతే - మరేమిటండీ" అన్నాడు సోమసుందరం!



డి.వి.నరసరాజు

☆ అవినీతి దేవతకి - అదేమి శాపమో - పాపమో - భక్తులు కోటీశ్వరులయినా ఈమెను బహిరంగంగా ఆరాధించరు సరిగదా - ఈమె భక్తులమని గూడ బయటకి చెప్పుకోరు!

☆ పాతకాలంలో పిల్లి ఎలుక లేని కొంప అంటే- పాడి పంటలేని కొంప అని అర్థం తీసేవారు. అంటే - ఒక యింటి సిరిసంపదల్లో - పశుపక్ష్యాది జంతుజాలం - గూడ ఒక భాగమన్నమాట!

☆ "బూతుపుస్తకాల గురించి వెతుకుతూ సెన్సారుబోర్డు మెంబర్లని అడిగితే.." అంటున్నాడతను.

"అదేమిటి, అవి వాళ్ల దగ్గరెందుకుంటాయ్!?" అన్నాను నేను.

"సినిమాల్లో బూతులు 'కట్' చేయాలంటే బూతులు తెలిసి వుండాలి గదా! అందుకని - బూతుపుస్తకాలు వాళ్లదగ్గర వుంటయ్యేమో అనుకున్నా"

☆ 'మన దేశజనాభా తగ్గకపోవడానికి కారణం తెలుసా? కుటుంబనియంత్రణ వల్ల - పుట్టబోయే పిల్లల సంఖ్య తగ్గించగలం గాని - వున్నవాళ్లు - వున్నచోట తిష్ట వేసుకుకూర్చుంటే ఎలాగండి! ' అన్నాడు రంగాచారి. కాస్సేపు ఆగి "ఆ విషయంలో గూడా ప్రభుత్వం చేతులు ముడుచుకుని కూర్చోలేదు లెండి! మెరిట్‌తో నిమిత్తం లేకుండా డొనేషన్లు - రిజర్వేషన్లు - వగైరా పద్ధతులతో వందలు, వేలమందికి డాక్టరు డిగ్రీలు యిచ్చి - దేశం మీద వదిలిపెడుతోంది గదా! వాళ్లు రకరకాలుగా - జనాభా తగ్గుదలకు - శక్తివంచన లేకుండా - సహకరిస్తూనే వున్నారు.' అని చేర్చాడు.

☆ మా అబ్బాయి ఇంటిప్రక్కన - ఒక రిటైర్డ్ ఆర్మీ ఆఫీసరు! వాళ్లింట్లో చిన్నపిల్లల్ని ఆయాలకి అప్పజెప్పి - యజమానులు కుక్కల్ని పిల్లుల్నీ చిలకల్నీ పెంచుతారు. ఆ కుక్కలకన్నీ ఇంగ్లీషు పేర్లే - జాకీ! మిక్కీ! జానీ! టైగర్! లూసీ! - తెలుగు కుక్కలు కదా లక్షణంగా - సీత, సావిత్రి లక్ష్మి, రాముడు, కృష్ణుడు - అని పేర్లు పెట్టుకోవచ్చుగదా!




☆ సినిమాకి 'మంచికథ' అంటే - సినిమా తీసేవరకు - నిర్మాతకు నచ్చింది 'మంచికథ'! సినిమా తీసి - విడుదల చేసిన తరువాత డబ్బిచ్చి చూసే ప్రేక్షకులకు నచ్చింది - 'మంచికథ'!

☆ కీర్తి కండూతిలో తర, తమ భేదాలుంటాయ్ - కొందరికి శాలువా కప్పి - ఒక్క సన్మానం చేస్తే - సరిపోతుంది, మామూలు దురద, కొద్దిగా గోకితే సరిపెట్టుకున్నట్టు! మరి కొందరికి - తమ పేర్లు, ఫోటోలు రోజూ పేపర్లో పడితే తప్ప 'కండూతి' ఉపశమించదు,

తామరమీద - సలసలకాగే నీళ్లు పోస్తే - ఇంకా పోయమన్నట్టు!

చాలా సభల్లో చూస్తూంటాం, ఆ కార్యనిర్వాహకుల కండూతి - వాళ్ల కళ్లు ఎప్పుడూ - ఆ ఫోటోలు తీసేవాడిమీదే వుంటాయ్! తీరా - ఫోటో తీయబోయే ముందు - తోసుకునిపోయి ఫోటోలో పడతారు!

☆ 'విమర్శ' అనలు ఒంటికి పడనివాళ్లు కొందరుంటారు. తెలుగుదినపత్రికలు - ఒకవిషయంలో తనను తీవ్రంగా విమర్శించినందుకు - గత 20 యేళ్లుగా - అసలు తెలుగుపత్రికలే చదవని - ఒక మాజీ (తెలుగు) కేంద్రమంత్రి నాకు తెలుసు!

ఈ విధంగా సమాజంలోని అనేక విషయాల గురించి నరసరాజు తనశైలిలో వ్యాఖ్యానిస్తూ పదికాలాలపాటు గుర్తుండే చురకలు వేశారు. అన్నిటికంటే ఎక్కువగా గుర్తుండిపోయే ఖండిక 'దేశభక్తి'! ఆవేదన కలిగిస్తుంది, ఆలోచన రగిలిస్తుంది, జాతీయవాదం, ప్రాంతీయవాదం -దేని విషయంలోనైనా సరే 'అతి' కూడదని బోధించకుండానే బోధిస్తుంది -

'చిన్నప్పుడు నాలో చచ్చేటంత 'దేశభక్తి' ఉండేది!... అదంతా యిప్పుడు ఏమైంది?.. 'తెలుగుతల్లి' 'భరతమాత'ల మధ్య వచ్చిన కన్‌ఫ్యూషన్‌తో ప్రారంభమయింది నా జబ్బు! తెలుగుతల్లి, భరతమాత - నా కిద్దరు తల్లులా? ఎవరు కన్నతల్లి? ఎవరు పెంపుడు తల్లి? బెంగాలీమాత, తమిళమాత - వీళ్లంతా పినతల్లులా? పెత్తల్లులా? సవతితల్లులా?.. విదేశీమాతలు మాత్రం చేసిన పాపమేమిటి? మరి అందర్నీ ప్రేమిస్తే యిక 'సొంతమాత ప్రేమ'కి ప్రత్యేకత ఏమిటి?

... 'ఏ తల్లిబిడ్డలయినా సరే, మంచివాళ్లయితే ప్రేమిస్తాను! చెడ్డవాళ్లయితే వదిలేస్తాను' అనుకుని చూస్తే నా దేశభక్తికి సరిహద్దులు చెరిగిపోయినై! ఏ దేశమాతా నన్ను తనబిడ్డగా గుర్తించేటట్టు లేదు! 'దేశద్రోహి' ముద్ర పడేట్టుంది! ప్రపంచ కార్మికులారా ఏకం కండి అన్నచోటే 'దేశభక్తి' పురుగుపట్టింది! .. ప్రపంచంలో ఏకం కావలసిన మంచివాళ్లంతా చీలిపోయి 'దేశభక్తి' సరిహద్దుల్లో చిక్కుకుపోయారు.....

పూర్వం - మనదేశంలో మంచిక్వాలిటీ 'దేశభక్తి' మందుమాత్రలు తయారయ్యేవి! అవి ప్రజల ఒంటికి సరిపడి, పుష్టినిచ్చేవి. జనాన్ని ఏకం చేసి, విదేశ సామ్రాజ్యవాద దొంగల్ని పారదోలడానికి అమోఘంగా పనిచేసేవి. ఈ మధ్య వచ్చే మాత్రలు అధ్వాన్నం! లోపల మందు ప్రమాదకరం! నా పని అయోమయంలో పడింది! కళ్లుమూసుకుని మాత్రలు మింగేసి దేశభక్తుణ్ణి అయిపోవడమా? కాని - లోపల ఉన్న మందు ప్రాణాంతకమని తెలిసి - ఎలా ఆ మాత్రలు మింగడం?

**- ఎమ్బీయస్ ప్రసాద్**

కూర్పు: టి.నవీన్, హైదరాబాద్

# సరిగపదమని



## 24

ఆగష్టు 9 రేలంగి జయంతిని పురస్కరించుకుని...

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | ● | 3 | | | 4 | | ● |
| ● | | ● | | ● | ● | | ● | 5 |
| ● | | ● | ● | ● | 6 | ● | 7 | |
| ● | 8 | | ● | 9 | | 10 | ● | |
| 11 | | ● | ● | | ● | | ● | ● |
| | ● | 12 | 13 | ● | 14 | ● | 15 | |
| 16 | | ● | | ● | | ● | | ● |
| ● | ● | 17 | ● | ● | | ● | ● | 18 |
| 19 | | ● | 20 | | | | ● | |

**అడ్డం:-**

1. 'తగునా ఇది...... తమరే ఇటు పల్కతగున' 'రాముడు భీముడు'లో రమణారెడ్డితో రేలంగి పాడిన పాట (2)
3. 'సరదా సరదా సిగరెట్టు ............... తాగు బల్ సిగరెట్టు' (5)
7. 'బంగరు బొమ్మా బలే జోరుగా ......వే పోదాము పై దేశం చూదాము' 'భలే రాముడు' లోని పాట(2)
8. 'మైడియర్ మీనా మహ మంచిదానా వీలు చిక్కెనా? నేటికి ........కల్గెనా' (2)
9. 'చిలకన్న .......వే బంగారు గిలకవే పంచ వన్నెల రామ.......' 'జయం మనదే' చిత్రంలోని పాట (3)
11. '...... .......బంగరు.......బంతివిలే, మరుదంతివిలే, గిలిగింతల చామంతివిలే' 'శ్రీరామకథ'లో రేలంగి స్వయంగా పాడినపాట (2)
12. '.......గగన ఘనశ్యామా! దేవా' చెంచులక్ష్మిలోని పాట (2)
15. 'ఏరా ....... తోటి గెల్చే ధీరులెవ్వరురా! రణ- శూరులెవ్వరురా' (2)
16. 'చూచి చూచి కళ్ళు కాయలే కాచాయి ........లా నీతండ్రి ఊడిపడ్డాడు' 'భార్యభర్తలు' సినిమాలో సూర్యకాంతం రేలంగి పాడిన పాట (2)
17. 'కాంత చేతి లోపల ......మంత్రమున్నదో ఎంత భీకరుడైనా శాంతమొంది తీరునే' చెంచులక్ష్మి చిత్రంలోని గీతం (1)
19. 'సీతారాం జై సీతారాం పైన పటారం .........లోటారం ఈ జగమంతా దంబాచారం' మిస్సమ్మచిత్రంలో పాట (2)
20 'ఆ మహా మహా నలమహారాజుకే......... భాయీ' 'అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే' పాటలోని ఓవాక్యం (4)

**నిలువు:-**

2. నిలువు 5 పాట గల చిత్రం పేరు చివరి అక్షరానికి పొల్లు తీసి కొమ్ముపెడితే? (5)
3. 15 నిలువులోని పాటగల చిత్రం పేరులోని రెండక్షరాలు (2)
4. 'రఘురాముడు .......నీయ వినీల ఘనశ్యాముడు' వాగ్దానం సినిమాలో రేలంగి చెప్పిన హరికథలో ఓలైను (2)
5. '......... నీవంటి దివ్యస్వరూపంబు ఎందెందు వెదికిన లేదుగదా' (3)
6. 20 అడ్డంలోని పాటగలచిత్రం పేరులో తొలి రెండక్షరాలు (2)
9. 'సంతానమే లేక స్వర్గమే లేదని ......పాపను తెచ్చి పెంచుకుంటారు' (2)
10. '...........త్వానికీ సిగరెట్టు కాఫీకే ఇది తోబుట్టు'అని రేలంగితో అభినయింపజేసుకున్న పాటలోని ఓ మాట (2)
11. 'చక్కనిదానా చిక్కనిదానా ఇంకా అలకేనా నీమాయలన్నీ ...........నాతోనా' (3)
13. 'భలే ఛాన్సులే భలే ఛాన్సులే లలలాం లలలాం ......ఛాన్సులే' (2)
14. 'ఔనంటే....... కాదంటే ఔననిలే' మిస్సమ్మ చిత్రంలో రేలంగి హార్మోనియం వాయిస్తూ అభినయించిన గీతం (4)
15. ఇల్లరికంలో ఉన్న...... అది అనుభవించితే తెలియునులే (2)
18. 'కాశీకి పోయాను రామా హరీ ...... తీర్థమ్ము తెచ్చాను రామాహరీ' (2)

పంపినవారి పేరు :...........................................................

వయసు :.......... వృత్తి :...........................................................

చిరునామా :...........................................................

...........................................................

...........................................................ఫోన్ :...........................................................

**పజిల్, కూపన్ 15-08-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# 'హాసం' క్లబ్

## కార్యక్రమ విశేషాలు

### వైజాగ్



కార్టూనిస్టు రాజుకుట్టిని సత్కరిస్తున్న కళ్లు చిదంబరం

విశాఖ పౌరగ్రంథాలయంలో జులై 18 సాయంత్రం జరిగిన కార్యక్రమంలో ప్రముఖ నటులు 'కళ్లు' చిదంబరం, ఎస్.కె.మిశ్రో, రచయిత కాశీవిశ్వనాథ్, జిల్లా సాంస్కృతిక మండలి సభ్యులు కొనన, మానసిక వికలాంగుల చికిత్సాకేంద్రం వ్యవస్థాపకురాలు టి.సరస్వతీదేవి ప్రియ అతిథులుగా పాల్గొని జోకులతో, ఛలోక్తులతో సభికులను నవ్వించారు.

టి.ఎల్.ప్రసాద్ పేరడీపాటలు, సివి రాజేశ్వరి, వి.రామ్‌కుమార్, ప్రసాద్ 'పప్పులో కాలు' స్కిట్, పి.చక్రంధర్, ప్రసాద్ 'ఎల్బీశ్రీరామూ - ఎఫ్ఫెమ్ రేడియో' స్కిట్, మేడా మస్తాన్ రెడ్డి జోకులు, చిరంజీవి మిమిక్రీ, రాజుకుట్టి కార్టూన్ ప్రదర్శన వీక్షకులను ఆకట్టుకున్నాయి. ఇతరులలో జోక్స్, పాటలతో సభను రక్తి కట్టించిన బద్రినాథ్, రంగారావు, పద్మజ, రాజేష్, వైష్ణవిలను న్యాయ నిర్ణేతగా వ్యవహరించిన రచయిత్రి సుగుణ ఎంపిక చేశారు. 'మిమిక్రీకళ', 'అతడే ఒక సైన్యం' ఆడియో సిడి, 'అందరికీ హోమియో వైద్యం' ప్రియ అతిథుల చేతుల మీదుగా బహుమతులందజేయబడ్డాయి.



మిమిక్రీ చేసిన చిరంజీవిని సత్కరిస్తున్న ఎస్.కె.మిశ్రో

కళ్లు చిదంబరం మాట్లాడుతూ 'హాసం క్లబ్'లో బెస్ట్ జోక్ చెప్పినవారికి ప్రతినెలా రూ.116/-లు నగదు బహుమతిని జీవితాంతమే కాక, తన తదనంతరం కూడా ఇచ్చే ఏర్పాటు చేస్తానని ప్రకటించారు. కార్యక్రమాన్ని స్పాన్సర్ చేసిన న్యూ ఆంధ్రా హోటల్ అధినేత శివకుమార్ రెడ్డి వెంటనే స్పందించి పేరడీ పాటతో నవ్వించిన ఎ.రంగాచార్యులుకు తమవంతు బహుమతిగా రూ॥ 116/- అందజేశారు. రచయిత కాశీవిశ్వనాథ్ వచ్చేనెల కార్యక్రమాన్ని తను స్పాన్సర్ చేస్తానన్నారు. 'లెబన్ షెల్ఫే' డైరక్టర్ సరస్వతీదేవి 24 యేళ్లుగా నవ్వడం మర్చిపోయిన తాను 'హాసం క్లబ్'కు వచ్చి మనసారా బిగ్గరగా నవ్వానంటూ ఇంగ్లీషులో ఓ జోకు చెప్పారు.

ఈ కార్యక్రమానికి ఎ.జగన్ కీబోర్డుపై, కె.కృష్ణసాయి తబలాపై వాద్యసహకారం అందించారు. ఆగస్టు కార్యక్రమం 15-8-04 న సాయంత్రం 6-00 గంటలకు మహారాణీపేటలోని జిల్లా కేంద్రగ్రంథాలయంలో జరుగుతుంది.

### స్కిట్

ఓ యువకుడు బార్బర్ షాప్‌కెళ్లాడు. అక్కడి క్షురకుడు వయోవృద్ధుడు. వారి మధ్యన జరిగిన సంభాషణ యిది.

"ఇదిగో పెద్దాయనా, నేను ఇంటర్వ్యూకెళ్లాలి. అచ్చు అక్కినేని నాగేశ్వరావులా క్రాపు చేయాలి. ఏం?"

"అట్టాగే బాబయ్యా"

"దేవదాసు చూశావా? అందులో అక్కినేనిది ఒరిజినల్ క్రాఫ్ తెలుసా?"

"ఆ సినిమా నేను చూడలేదు బాబూ. విప్రనారాయణ చూశా."

"పోనీ దొంగరాముడు, పెళ్లినాటి ప్రమాణాలు చూశావా?"

"అబ్బే, భక్త జయదేవ చూశా"

"పోనీలే, పూలరంగడు, అదృష్టవంతులులో నాగేశ్వరరావు క్రాపు గుర్తుందా?"

"చూడ్డానికి కుదర్లేదు బాబూ, భక్త తుకారాం, చక్రధారి చూశా."

"పోనీ బుద్ధిమంతుడు..?"

"చూశా, చూశా"

"హమ్మయ్య, అందులో నాగేశ్వరావులా చేసేయ్."

(కాస్సేపుపోయాక) "రెడీ బాబూ"

(అద్దంలో చూసుకుని ఏడుపుగొంతుతో) "ఇదేమిటయ్యా బాబూ, ఈ గుండూ, పిలకా.. 'బుద్ధిమంతుడు'లో నాగేశ్వరావులా ఉండాలని చెప్పాను కదా"

"అదేంటి బాబయ్యా ఈ క్రాపుతోనే కదా ఆయన 'నను పాలింపగ' పాట పాడతాడూ..

- మేడా మస్తాన్ రెడ్డి

(బాపు కార్టూన్ ఆధారంగా విశాఖపట్నం హాసం క్లబ్‌లో ప్రదర్శించిన స్కిట్ ఇది)

### పలాస

హాసం క్లబ్ మూడవ కార్యక్రమం కౌసల్యా రంగనాథన్ ప్రార్థనాగీతంతో మొదలై ఆద్యంతం ఉల్లాసభరితంగా జరిగింది. డా॥శాస్త్రి, డా॥రామినాయుడు, జిటి నాయుడు, రమేష్, ఓ వ ం ణ వ యూ ర్తి మొదలయిన వారు చక్కని జోక్స్ చెప్పారు. ఎచ్.శ్రీనివాసరావు పిల్లనగ్రోవితో చక్కని పాట వినిపించడంతో బాటు మ్యాజిక్ కూడా చేశారు. ఈశ్వర్ పాత్రో 'పేరడీసాంగ్'తో బాటు సినీనటుల గొంతుకలను మిమిక్రీ చేశారు.



'ఆపాత'మధురాలు పాడి బహుమతి గెల్చుకున్న మ్యూజిక్ టీచర్ కౌసల్య

స్త్రీలు, పిల్లలు అధికసంఖ్యలో పాలు పంచుకున్న ఈ కార్యక్రమానికి ద్వారకానాథ్ అధ్యక్షులుగా, బాబ్జీ యాంకర్‌గా వ్యవహరించారు. ఈ టీవీ 2 వారు ఈ కార్యక్రమాన్ని రికార్డు చేసి ప్రసారం చేశారు.



బెస్ట్ జోక్‌కై బహుమతి పొందిన కొర్నేని రమేష్

## రాజమండ్రి

జులై 18 న హాజరయిన 'హాసం క్లబ్' అభిమానులు శ్రీసాయిప్రసాద నిలయంలో వేదిక ఏర్పరచడం వల్ల వానజల్లులనుండి రక్షణ పొందారు కానీ సభలో వెల్లివిరిసిన నవ్వులజల్లుల నుండి మాత్రం తప్పించుకోలేక పోయారు.

చి॥అశీష్ గణపతి ప్రార్థనతో ప్రారంభమైన కార్యక్రమం, కృష్ణారావు 'పాడుతా తీయగా' పాట, 'నెల్లూరి నెరజాణా' పాటకు ప్యారడీగా 'ఎల్కేజీ కుర్రవాడా, ఓ లాలిపప్పు నీకు తేనా' అంటూ బేబి మాధురి పాడిన పాట, జోశర్మ 'కార్టూన్ పొయెట్రీ', 'పుష్పవిలాపం'కు పారడీగా సన్యాసిరావు (వైజాగ్) 'చూతవిలాపం' (ఆవకాయ) వంటి ఐటమ్స్‌తో ముందుకు సాగింది. కాశ్యప్, పద్మజ, రఘుపతి, సుబ్రహ్మణ్యం, మూర్తి, ప్రసాద్, అవధాని , సీతాభవాని (80 సం॥లు) జోకులు వినిపించగా లక్ష్మీదేవి అన్నపూర్ణపై పాట పాడారు.



సభలో ఆనందసందోహం

జిత్‌మోహన్ మిత్ర, కృష్ణమాచార్యులు వారి వారి ప్రసంగాలలో పాతహిందీపాటల మాధుర్యాన్ని సోదాహరణంగా వివరించారు. ఎం.వి.అప్పారావు 'సినిమావార్తల'లోని వ్యంగ్యం అందరినీ అలరించింది. ఎం.వి.రమణయ్య తన కంఠపు కదలికలతో మువ్వలు, ఘటం, మృదంగం, తబలా, ఢోలక్, డ్రమ్స్ - మొత్తం ఆరు వాయిద్యాలను అద్భుతంగా అనుకరించారు.

'టి.వి.వంటకాలు-ప్రయోగాలు' స్కిట్‌ను సీత, పద్మ, 'టివి జ్ఞానం' స్కిట్‌ను హనుమంతరావు, విజయలక్ష్మి ప్రదర్శించగా, జిత్‌మోహన్ మిత్ర, కానూరి నాగేశ్వరరావు, హనుమంతరావు ఓ కోర్టుసీను హాస్య సన్నివేశాన్ని ఆశువుగా ప్రదర్శించారు.

జులైలో జన్మించిన సి.యస్.ఆర్., కీరవాణి, కోటశ్రీనివాసరావు, మణిశర్మ, రాజేంద్రప్రసాద్, సినారె, చిత్రలకు జన్మదిన శుభాకాంక్షలందించి వారి జీవిత విశేషాలను ముచ్చటించడం జరిగింది. జానపదసాహిత్య బ్రహ్మ నేదునూరి గంగాధరం శతజయంత్యుత్సవాల సందర్భంగా కమిటీ సభ్యుడు, సాహితీవేత్త సన్నిధానం నరసింహశర్మ జానపదసాహిత్యంలోని రసవత్తరమైన జోకులు విన్పించారు.

కార్టూనిస్టు శేఖర్ న్యాయనిర్ణేతగా వ్యవహరించి చి॥ కాశ్యప్, సత్యనారాయణలను ఎంపిక చేయగా డా॥ తేతలి బహుమతులు ప్రదానం చేశారు. సభ నిర్వహించిన హనుమంతరావు **తదుపరి కార్యక్రమం 15 ఆగస్టు సాయంత్రం** జరుగుతుందని తెలియపరచారు. ఈ కార్యక్రమంపై వార్త, సూర్య, సమాచారం పత్రికలు విస్తృత కథనాలు ప్రచురించాయి.

## టీవి వంటకాలు - ప్రయోగాలు

**రాజమండ్రి హాసంక్లబ్‌లో ప్రదర్శించిన స్కిట్ ఇది**



ప్రదర్శన - పద్మ, సీత

'హలో వదినగారూ, ఏంటీ ఈ మధ్య కనబట్టం లేదూ, కొత్త వంటకాలేమైనా నేర్చారా?'

'వారం వారం టీవీలో ఏవో నేర్పుతూనే వుంటారుగా, నేర్చుకోక ఛస్తామా?'

'అవునూ, ఈ టీవీ వంటకాలు మీరు రుచిచూసి అన్నగారికి పెడతారా? లేక ఆయనకు నచ్చిందంటేనే మీరు తింటారా?'

'టీవీ వంటకాలు మనం ముందుగా తినకూడదొదినగారూ, కర్మకాలి వికటించి మనం మంచాన పడితే ఇంటి పనులెవరు చేస్తారు? అదే మగాళ్లకు అయితే.. ఆఫీసుకు సెలవు పెడతారు. మనకు సెలవులుండవుగా'

'నిజమే, నిజమే, కానీ - టీవీలో చూసి చేశాను మీ మీద ప్రయోగించి చూస్తాను - అంటే ఆయన ఒప్పుకుంటారా?'

'తెలివి తెల్లారినట్టే ఉంది. టీవీలో బక్షీ నేర్పాడని, కపూర్ నేర్పాడని చెబితే ఊరుకుంటారా? ఆ వరాయిమగాడి మాటెందుకు విన్నారని మండిపడరూ!?'

'ఆ మాటా కరక్టే, అవునూ ఈ మధ్య చేసిన వంటకం ఎలా వుందన్నారు అన్నగారు?'

'ఎలా వుందో ఏమీ అనలేదు గానీ మనిషి తరహాలో మార్పొచ్చింది. పగలంతా ఓ మూల కూచుని కునికిపాట్లు. రాత్రిళ్లు నిద్ర మానుకుని పెరడంతా తెగ కలయదిరిగేస్తున్నారు. ఎలక్ట్రిక్ పోల్ కనబడినప్పుడల్లా ఆగిపోతున్నారు..'

'అయ్యో, వదినా - అప్పుడప్పుడు టీవీ సిగ్నల్స్ మారిపోయి ఛానెల్స్ గల్లంతైపోతూ ఉంటాయ్. కొంపదీసి మీరు చూసే ఛానెల్ మారిపోయి 'ఏనిమల్ వరల్డ్' ఛానెల్ వచ్చేసిందేమో, మీరు ఏంచేసి అన్నగారికి పెట్టారో, ఏమో! ఎందుకైనా మంచిది, ఆయన్ను ఓ సారి కుక్కలడాక్టరుకు చూపించండొదినా!'

**రచన - హనుమంతరావు**

## ఏలూరు

**జులై** 18న కన్వీనర్ వెంతే నారాయణరావు గారింట్లో జరిగిన కార్యక్రమం సరిగ్గా 6-31 కు బి.కె.బిందు ప్రార్థనాగీతంతో ప్రారంభమయింది. డా॥శానం విజయమోహన్, మధుసూదనరావు, హేమనారాయణరావు, సి.యస్.మూర్తి, బి.అయ్యంగార్ తదితరులు పాల్గొన్న ఈ కార్యక్రమం ఎప్పటిలాగే జోక్స్, పాటలతో సభాసదులను అలరించింది. **తదుపరి కార్యక్రమం ఆగస్టు 15 సాయంత్రం 6.30 గం॥లకు జిల్లా కేంద్ర గ్రంథాలయంలో** జరుగుతుందని కన్వీనర్ రామకృష్ణారావు (ఫోన్ 222318, 98481 41100) తెలియజేశారు.

'హాసం క్లబ్'ను ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది - శ్రీ ఎస్.వి.రామారావు, 040-24160279, 98491 39030

# ముత్తుస్వామి దీక్షితులు

అదెంత పుణ్యభూమి !
ఆ ఊరెంత ధన్యచరిత !!
అక్కడి ప్రతిశిలకీ 'సాలగ్రామ' వైభవమే...
అక్కడి ప్రతి ఇసుక రేణువూ శివలింగమే.....
అక్కడి ప్రతి చెరువూ పుష్కరిణే
ప్రతి చెలమా....తీర్థమే...
లేకపోతే...సంగీత ప్రపంచంలో మూర్తి త్రయంగా పేరుపొందిన ముగ్గురూ
ఆ ఊళ్ళోనే పుట్టడం ఏమిటి!!
అదే పరమేశ్వరుడి లీల !
ఆ ఊరిపేరు - తిరువారూరు......
అక్కడే త్యాగరాజస్వామివారూ..... శ్యామశాస్త్రిగారూ
ముత్తుస్వామి దీక్షితులవారూ పుట్టారు.....
అదో త్రివా+ణీ సంగమం......
తిరువారూరులో వెలిసిన శివుడిపేరు 'త్యాగరాజు'
ఆ పేరే త్యాగరాజస్వామి వారికి పెట్టింది!!

1775 మన్మథనామ సంవత్సరం

ఫాల్గుణ మాసం... త్యాగరాజస్వామివారి ఉత్సవాలు జరుగుతోన్న సమయంలో....కృత్తికా నక్షత్రంలో పుట్టినవాడు శ్రీముత్తుస్వామి దీక్షితులు...

ముత్తుస్వామిదీక్షితుల తండ్రికూడా సామాన్యుడేం కాదు. పెద్ద సంగీత విద్వాంసుడు. తంజావూరు ప్రభువుల మన్నన పొంది స్వయంగా 'హంసధ్వని రాగాన్ని' కనిపెట్టిన దిట్ట.....

ఆయన పేరు రామస్వామి దీక్షితులు...భార్యపేరు సుబ్బలక్ష్మి అమ్మాళ్...చాలాకాలం వాళ్ళకి సంతానం కలక్కపోతే ....



చిదంబరస్వామి అనే సన్యాసి ఆజ్ఞ మేరకు తంజావూరులోని వైదీశ్వరన్ కోవెలకు వెళ్ళి నలభై రోజులు పూజలూ పునస్కారాలూ చేయడం వల్ల....

అమ్మవారు ఒక ముత్యాల హారం ఇచ్చినట్టు స్వప్నం వచ్చిందట.

తరవాత పుత్రసంతానం కలిగింది...

వైదీశ్వరన్ కోవెలలోని కుమారస్వామి పేరు ముత్తుస్వామి...(ముత్తు అంటే తమిళంలో ముత్యం) అది ఉత్తరోత్తర...ముత్తుస్వామి దీక్షితులు అయ్యింది...

మాతృభాష తమిళం అయినప్పటికీ ముత్తుస్వామి సంస్కృతం, తెలుగులో కూడా పాండిత్యం సంపాదించాడు...

అందుకే ఆయన కొన్ని కీర్తనలను మూడు భాషలూ కూర్చి.....మణిప్రవాళ భాషలో రాసాడు... 'మణిప్రవాళం' అంటే మణులూ-పగడాలు కలిపిన అని అర్థం...

ఇలా సంగీతంలోనూ సాహిత్యంలోనూ అపారమైన పాండిత్యం సంపాదించుకున్న ముత్తుస్వామి దీక్షితులు..

ఒకసారి తండ్రిగారి స్నేహితుడైన వెంకటకృష్ణ మొదలియార్‌తో కలిసి మద్రాసులోని జార్జికోటకి తీసికెళ్ళడం..

అక్కడ ఇంగ్లీషు బ్యాండు వినీ దానిపట్ల ఆకర్షితుడై....పాశ్చాత్య సంగీతంలోని మర్మాలను కూడా ఆకళింపు చేసుకుని...

కొన్ని ఆంగ్ల ట్యూన్లకు సంస్కృత సాహిత్యాన్ని సమకూర్చాడు!...

అలాంటివి దాదాపు యాభై చేసారట....!!

అందులో ముఖ్యమైనది...తెలుగు నిఘంటువును వ్రాసిన బ్రౌనుదొర కోరిక మేరకు తయారు చేసిన 'గాడ్ సేవ్ ది కింగ్' అనే ఆంగ్ల జాతీయగీతానికి సంస్కృత సేత....అయితే అది రాజరికాన్ని స్తుతిస్తూ కాకుండా దేవీ పరంగా ఉంది!

"సంతతం....పాహిమాం....సంగీత శ్యామలే
సర్వధారే...జననీ చింతతార్థప్రదే...
చిద్రూపిణీ శివే...!!"

ఇలా ముత్తుస్వామిదీక్షితుల వారికి పాశ్చాత్య సంగీతంతో పరిచయం అవడం వల్ల దక్షిణ భారత సంగీతానికి ఒక మహోపకారం జరిగింది..

అదేవిటంటే ఫిడేలు మన సంగీత వాద్యం కాదు!! పాశ్చాత్య వాయిద్యం.

అలాంటి ఫిడేలుని ముత్తుస్వామిదీక్షితుల తమ్ముడు.... బాలస్వామి దీక్షితులు అభ్యసించి.. దాన్ని వాయించడంలో నిష్ణాతుడై.....

ముత్తుస్వామి దీక్షితులు వీణ వాయిస్తుంటే దానితో సమంగా ఫిడేలు వాయించి.. శభాష్ అనిపించుకున్నాడు!

ఆ కారణంగా ఇవాళ వయొలిన్ దక్షిణ హస్త స్పర్శతో వాయులీనం అయి....

దక్షిణ భారత సంగీతంలో సహకార వాయిద్యంగానూ కొండొకచో 'సోలో'వాయిద్యం గానూ... పేరుపొంది... దక్షిణభారత సంగీతంలో ప్రథమాంగమై పోయింది. హిందుస్తానీ సంగీతంలో వయొలిన్ ఉపయోగించరు !!

ఒకసారి చిదంబర యోగిగారొచ్చి.. ముత్తుస్వామి దీక్షితుల తండ్రిగారిని ఒక కోరిక కోరారు...

అదేవిటయ్యా అంటే... ముత్తుస్వామిదీక్షితుల్ని తన వెంట.. కాశీకి పంపించవలసిందీ అని.

రామస్వామి గుండె గుభేలుమంది. రాముణ్ణి వదులుకోబోతున్న దశరథుడై పోయాడు!....

మొదట వద్దన్నాడు.... ఎట్టకేలకు మిత్రుడైన వెంకటకృష్ణ మొదలియారు సలహామేరకు అంగీకరించి గురువుగారితో కాశీకి పంపాడు!!

ముత్తుస్వామిదీక్షితులు ఉత్తర భారత దేశయాత్ర ఆరంభమయింది. గురువుగారితో కలిసి అనేక పుణ్యక్షేత్రములను సందర్శిస్తూ....

ప్రతిచోటా ఒక కీర్తన రాయడం ప్రారంభించాడు... కాశీవిశ్వనాథుడి మీద... అన్నపూర్ణ మీద, నేపాల్‌లోని పశుపతినాథుని మీద.. బదరి నారాయణుడి మీద రచిస్తూ మెల్లిగా హిందుస్తానీ సంగీతం కూడా ఆకళింపు చేసుకుని 'బృందావనసారంగ' రాగంలో చాలా కీర్తనలు రాసాడు...

ఒకరోజు గురువుగారు...కాశీలోని గంగానదిలో స్నానంచేస్తూ.. శిష్యుణ్ణి పిలిచి..

"ముత్తుస్వామీ నాకు పరమేశ్వరుడినించి పిలుపొచ్చింది!...నేను వెళ్తున్నాను" అంటూ..

"నీకు కాలికేదైనా తగిలితే తీసుకో" అని చెప్పి.... తను ప్రాణత్యాగం చేసారు !...

చిత్రంగా ముత్తుస్వామి దీక్షితుల కాలికి ఒక వీణ తగిలింది! దాన్ని గురు వరప్రసాదంగా భావించి కళ్ళకద్దుకుని...గురువు శివైక్యం చెందటంతో హృదయం గాయమై... ఆ వీణతో పాటు కాశీ నగరాన్నించి మళ్ళీ స్వగ్రామానికి ప్రయాణమయ్యాడు ...ముత్తుస్వామి.

మనసేమీ బాగోక... తమిళనాడులోని తిరుత్తణి వెళ్ళి అక్కడే షడాక్షరీ జపం చేస్తూ ఒక మండలం రోజులు గడిపాడు...

ఒక మధ్యాహ్నం పూట.....తన్మయత్వంతో సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి స్తుతిస్తూ ఉండగా.. జటాధారియైన ఒక వృద్ధుడొచ్చి.....

"ముత్తుస్వామీ !!

నోరు తెరువు నాయనా" అని పిలిచి నోట్లో పటిక బెల్లం వేసి అంతర్థానమయ్యాడట.

ఆ వచ్చింది తన ఆరాధ్యదైవమైన సుబ్రహ్మణేశ్వరుడని గ్రహించి...

కళ్ళనీళ్ళ పర్యంతమై 'గురుగుహ' అంటూ కృతులని ఆలపించడం మొదలెట్టాడు.

అది మొదలు ముత్తుస్వామిదీక్షితుల ముద్ర "గురుగుహ"అయ్యింది. ఇంతాచేస్తే... అప్పటికి ముత్తుస్వామి వయస్సు....పాతికేళ్ళే!

ఆ తర్వాత వివాహం జరిగినా...సంసారం పట్ల పెద్ద ఆసక్తిలేని ముత్తుస్వామి....దక్షిణ భారత దేశంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలన్నీ దర్శిస్తూ తిరుపతి వేంకటేశ్వరుని మీద.. కాళహస్తీశ్వరుని మీద కృతులు రాసి... శివకేశవ అభేదాన్ని కూడా పాటించాడు...

అన్నిటికన్నా విశేషం ఏమిటంటే ముత్తుస్వామి శిష్యుడు శుద్ధమంగళం తంబియప్ప ఏదో శూలనొప్పితో బాధపడుతుంటే....ఎన్ని వైద్యాలు చేసినా తగ్గకపోయేసరికి జ్యోతిష్యులు గురు, శనిగ్రహ దోషం ఉండటం వల్ల అతనికి జబ్బు చేసిందని చెప్పగా...

గురుగ్రహం మీద అఠాణరాగంలో- 'బృహస్పతీ'అనే కృతీ....

శనిగ్రహం మీద యదుకుల కాంభోజిరాగంలో 'దివాకర తనూజం' అనే కీర్తనలు రాయగా-

ఆ శూల నయం అయిందట... అందువల్ల ఆయన నవగ్రహాల మీద కీర్తనలు రాయడం జరిగింది...అవి చాలా ప్రాచుర్యం పొందాయి కూడా...

ముత్తుస్వామిదీక్షితులు జీవితంలో మరొక విశేషం ఏమిటంటే సంగీత జగద్గురువు శ్రీత్యాగరాజస్వామిగారు రామాయణ పారాయణ సమాప్తి సందర్భంగా అనేకమంది ప్రముఖులను పిలుస్తూ...ముత్తుస్వామిదీక్షితుల్ని కూడా ఆహ్వానించాడు.

సంగీత ప్రపంచంలో సువర్ణాక్షరాలతో రాసుకోదగ్గ మనోజ్ఞ ఘట్టం.... త్యాగరాజస్వామివారి నివాసం శ్రీరామ పంచాయతనం ముందు ఆర్ద్రంగా.... త్యాగరాజస్వామి శిష్య బృందంతో భైరవిరాగంలో 'కొలువై ఉన్నాడే' అన్న కీర్తన పాడటం...



దీక్షితులుగారు వెంటనే స్పందించి 'మణిరంగు' రాగంలో 'మామవ... పట్టాభిరామ' అని కీర్తన పాడటం... విన్న వాళ్ళంతా తరించడం.... దాన్ని మళ్ళీ మనం స్మరించడం.....

ఎంత మధురానుభూతి....

చివరికి దక్షిణాది పుణ్యక్షేత్రాల సందర్శనంలో భాగంగా ముత్తుస్వామి 'శబరిమల' కూడా వెళ్ళి అక్కడ అయ్యప్పని దర్శించి వసంతరాగంలో 'హరిహరపుత్ర' అని గానం చేసారు.

కర్ణాటక.... హిందుస్తానీ.. పాశ్చాత్య సంగీతంలో.. సంగీత ప్రపంచంలో చిరకీర్తి- సంపాదించుకుని తన తండ్రి గారి సృష్టి అయిన 'హంసధ్వని' రాగంలో 'వాతాపి గణపతిం భజే' లాంటి అపూర్వ ప్రజాదరణ పొందిన కృతి రచించిన ముత్తుస్వామి దీక్షితులు..

ఆశ్వయుజ బహుళ చతుర్థశి నాడు పున్నాగవరళి రాగంలో....

'పాహి అన్నపూర్ణే.... సన్నిదేహి సదాపూర్ణే... సువర్ణే.... చిదానంద విలాసినీ' అని గానం చేస్తూ...

'మీనలోచన - పాప విమోచని'....అన్న పదం వచ్చేసరికి - బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకుని 'గురుగుహ'లో ఐక్యమయ్యాడు!!

**- తనికెళ్ల భరణి**

## పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 44... మరొక ఆరు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ.. మా దగ్గర వారికి సంబంధించినవి ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువన ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 6 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, అదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మునుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరునాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు.

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

ఇన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి

అందమైన అమ్మాయి పాటలు పాడుతుంటే చెవులతో వినాలనే కాకుండా కళ్ళతో చూడాలనే కుతూహలం ఎవరికైనా సాధారణంగా కలుగుతుంది. పదహారు ప్రాయంలో వున్న కేటెరోజ్ అందుకు మినహాయింపు కాదు. అందచందాలతో పాటు చక్కటి స్వరముందామెకి. అయితే అందమైన గులాబీ పక్కనే కఠినమైన ముల్లు వుంటున్నట్టుగానే కేటెరోజ్ గాన మాధుర్యంలో ఓలలాడాలనుకునే శ్రోతలకి,ఆ గాత్రానికి ఆధారమైన రచనలో కొన్ని చేదు నిజాలు సాక్షాత్కరిస్తాయి. ఈ తరం అమ్మాయిల భావాలు, సమాజం పట్ల వారి తీరు, కోరుకుంటున్న స్థానం,ఎదురౌతున్న సమస్యలు..ఇవన్నీ కేటెరోజ్ పాటల్లో విపిపిస్తాయి. పాటలు పాడటంతో పాటుగా ఆమే వీటిని రాసుకోవటంతో అందులో గాఢత మరింత స్పష్టంగా కనిపిస్తుంది.

కేటెరోజ్ తండ్రి హిమ్‌బుల్లర్ట్ కీబోర్డ్ ప్లేయర్, తల్లి నేపథ్యగాయని. దాంతో చిరుప్రాయంలోనే కేటెరోజ్‌కి సంగీత ప్రపంచంతో సంబంధం ఏర్పడింది. తండ్రితో పాటు సాధన చేసేది. తనతోటి పిల్లలందరూ స్కూల్‌కో, కాలేజ్‌కో వెళ్తుండే సమయంలో రోజ్ కలం,కాగితం చేతపట్టి తన మనసులోని భావాలకు అక్షర రూపమిచ్చే ప్రయత్నం చేసేది. తన గురించి చెబుతూ "పాటలు రాయటం పదహారేళ్ళ వయసులోనే ప్రారంభించాను. అప్పట్లో రోజంతా చాలా బాధాకరంగా

# పదహారు ప్రాయం... పదునైన గానం

# 'కేటె రోజ్'



గడిచేది. ఇంట్లో సమస్యలు,స్కూల్‌లో సమస్యలు,నాలో నాకే ఓ సమస్య...వీటన్నింటి నుండి విముక్తి పొందడానికి,నాలోని బాధను బైటకు వ్యక్తం చేయడానికి నేను గీత రచనను మార్గంగాఎంచుకున్నాను. అందువల్లే నా పాటల్లో బాధ, ఆర్తి, సమాజం పట్ల ధిక్కార ధోరణి,కొత్త మార్గాలపై ఆశ.... ఇలాంటివి కనిపిస్తాయి"అని చెబుతోంది.

తను పుట్టి పెరిగిన వాతావరణం కూడా తన పాటల్లోని నిక్కచ్చిదనానికి కారణమని చెబుతూ "లాస్‌ఏంజెల్స్ వంటి చోట ప్రముఖులు, ప్రచార సాధనాలు ఎక్కువ. అందువల్ల ప్రపంచాన్ని గమనించటం,ప్రపంచ పోకడల ప్రభావానికి లోను కావడం జరుగుతోంది. పైగా నేను మానాన్నగారి 'రాక్ ఎన్ రోల్' బృందంతో కలిసి చిన్నతనంలోనే వివిధ దేశాలలో ప్రదర్శనలిచ్చాను. ఓరకంగా నేను,నా స్నేహితులు ప్రపంచాన్ని అర్థం చేసుకునే విషయంలో పిన్నవయసులోనే మెచ్యూర్ అయ్యామని చెప్పాలి" అంటుంది.



2004 ప్రారంభంలో కేటెరోజ్ తొలి ఆల్బమ్ 'బికాజ్ ఐకెన్' (వి2) విడుదలై సంచలనం సృష్టించింది. 'పదహారేళ్ళ అమ్మాయి గొంతులో ఇంత వైవిధ్యమా?' అని కొందరు ఆశ్చర్యపోతుంటే,ఇంత చిన్నవయసులో ఇంత కఠోర సత్యాలను సాహిత్యంలో ఎలా ఆవిష్కరించగలిగింది?' అని మరి కొందరు నోరెళ్ళ బెడుతున్నారు. ఇప్పుడు రోజ్ యువతను తన ట్యూన్స్‌తో ఆడిస్తున్న గాయని, తల్లిదండ్రుల్ని తన పాటలతో షాక్ కి గురిచేస్తున్న రచయిత్రి. రోజ్ తొలి ఆల్బమ్‌ను విన్న సంగీత ప్రపంచం ఆమెని ఏ కేటగిరిలో పెట్టాలనే సందిగ్ధంలో పడింది.

కేటెరోజ్ మాత్రం ఇవేవీ పట్టించుకోకుండా "నేను నాలాగే వుంటాను. ప్రజలు కూడా నేను నేనుగా చేసేదానికి స్వీకరించాలని భావిస్తాను. నాకో ముద్రను వేయడానికి ఇష్టపడను" అని చెబుతోంది. అంతే కాదు "జీవితం రోలర్ కోస్టర్ లాంటింది. ఎత్తుపల్లాల్లో వేగంగా అది సాగిపోతూనే వుంటుంది. నేనూ ఎక్కడా ఆగాలని అనుకోవడం లేదు. అయితే గాలికి ఊగే చిగురులా వున్న నేను ఈ సంగీత ప్రపంచంలో ఓ స్థిరమైన వృక్షంగా నిలదొక్కుకోవాలని అనుకొంటున్నాను" అంటోంది కేటెరోజ్. అంతా ఆమె అనుకున్నట్టే జరిగితే కేటెరోజ్ అతిత్వరలోనే ఓ కొత్త పంథాకు మార్గాన్ని చూపుతుందనడంలో సందేహం లేదు.

- వి.అరుణ సత్యవతి



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ **ఎమ్బీయస్ ప్రసాద్**

**చిత్ర పరిచయం 10**

సమన్వయం **మంజీర**

### జరిగిన కథ

జాన్ డూలిటిల్ జంతువుల భాష అర్థం చేసుకోగల ఓ డాక్టర్. మార్క్, జీన్‌ల అనే భాగస్తులతో కలిసి ఓ క్లినిక్ నడుపుతూంటాడు. దాన్ని టేకోవరు చేసుకుందామని మరో పెద్ద సంస్థ ముందుకు వచ్చింది. అనుకోకుండా జాన్ జంతువులకు వైద్యం చేయడం మొదలుపెట్టాడు. కానీ జంతువుల భాష అతనికి అర్థం అవుతుందని తెలియని, నమ్మని అతని సన్నిహితులు అతన్ని మతిభ్రష్టుడిగా జమకట్టి ఓ హాస్పటల్‌లో జేర్పించడంతో భయపడిన జాన్ ఇక జంతువుల జోలికి పోకూడదని నిశ్చయించుకుంటాడు. కానీ జంతువులను ప్రేమించే తన చిన్నకూతురు మనోగతం తెలుసుకున్నాక లోకానికి వెరచి తన స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించడంలో అర్థం లేదనీ, జంతువులకు సహాయపడడంలోనే తనకు ఆనందం లభిస్తుందనీ గ్రహించాక తనకోసం ఎదురుచూస్తున్న పులికి వైద్యం చేయడానికి నిశ్చయించుకుంటాడు. జూ నుండి పులిని తప్పించి క్లినిక్‌కు తీసుకువస్తాడు. అదే బిల్డింగులో మరోపక్క హాస్పటల్ టేకోవరు ఫంక్షన్‌కై ఏర్పాటు చేసిన ప్రెస్‌మీట్ జరుగుతూంటుంది. అందరూ జాన్ కోసం ఎదురుచూస్తూ ఉంటారు. - (ఇక చదవండి)

ప్రెస్‌మీట్ ఫంక్షన్‌కి హాజరయిన వాళ్లలో మాయా వెంట వచ్చిన పెంపుడు గినీపిగ్ రోనీకూడా ఉంది. మాయా కనుగప్పి పారిపోయి 'కిచెన్ ఎక్కడుంది చెప్మా' అనుకుంటూ ఓ గదిలోకి దూరింది. తీరాచూస్తే అది బాత్‌రూమ్. దాన్ని వెంటాడుతూ మాయా కూడా అక్కడకు వచ్చింది. తనకి దొరక్కూడదనుకుంటూ రోనీ అటూ ఇటూ పరిగెట్టి ఓ టాయిలెట్ సీటు మీదకు ఉరికింది. 'రోనీ, రోనీ' అని పిలిచి, పిలిచి లాభం లేక మాయా వెళ్లిపోయింది.



'అమ్మయ్య, వెళ్లిపోయింది. ఇక కిచెన్ గురించి వెతకచ్చు' అని రోనీ టాయిలెట్ సీటు దిగబోతూండగా ఖర్మకాలి ఓ లావుపాటి దిబ్బాలమ్మ వచ్చి టాయిలెట్‌మీద కూచుంది. ఆ కూచోడం కూచోడం రోనీమీద కూచోవడంతో అది జారి లోపలికి పడిపోయింది. దిబ్బాలమ్మ బాత్‌రూమ్‌కు వచ్చింది, తను దొంగిలించి తెచ్చిన దిబ్బరొట్టె తినడానికి మాత్రమే. హేండ్‌బ్యాగ్‌లోంచి ఆ రొట్టె బయటకు లాగి కొరుక్కుతింటూండగా తన కింద టాయిలెట్‌నుండి ఏవేవో శబ్దాలు వినబడ్డాయి. నీళ్లలో పడి ఉక్కిరిబిక్కిరవుతున్న రోనీ ఆక్రందనాలవి!

దిబ్బాలమ్మ ఒక్క ఉదుటున లేచి చూసేటప్పటికి లోపల ఉన్న నీళ్లలో పడికొట్టుకుంటున్న రోనీ కనబడింది. 'యాక్' అని అరిచిందామె భయంతో, అసహ్యంతో! 'నువ్వే యాక్' అని ప్రతిగా అరిచింది రోనీ! ఎలుక చేసిన శబ్దానికి భయపడిపోయిన దిబ్బాలమ్మ తిండికార్యక్రమం వాయిదావేసి బయటకు పరుగుపెట్టింది. పోతూ పోతూ అలవాటు చొప్పునో, చేయకపోతే పక్కబాత్‌రూమ్‌లో వాళ్లు ఏమైనా అనుకుంటారనో ఫ్లష్ చేసి పోయింది.



వెస్టర్న్ టాయిలెట్‌లో నీళ్లు ఉధృతంగా వచ్చి పడుతూంటే అందులో చిక్కుకుపోయిన రోనీ వాషింగ్‌మెషిన్‌లో రుమాల్లా ఆ సుడిగుండంలో గిరగిర తిరిగింది. మునకలు వేసింది. ఆ ప్రవాహంలో పడికొట్టుకుపోకుండా అనేక విన్యాసాలు చేసింది. చివరికి ప్రాణం కాపాడుకుని పాక్కుంటూ, డేక్కుంటూ పైఅంచుకు వచ్చి చేరింది. ఒళ్లు తడిసిపోయి, పిండేసిన టర్కిష్ టవల్లా అయిపోయింది. గజగజ వణుకుతూ 'ఈ యాక్సిడెంటు చేసి పోయినదాని కారు నెంబరు తెలిస్తే బాగుణ్ను. ఫిర్యాదు చేసేదాన్ని' అనుకుంది.



* * *

జాన్ తన కారును క్లినిక్ ముందు ఆపాడు. అటూ ఇటూ చూసి

ఎవరూ లేరని నిశ్చయించుకుని పులిని దిగమన్నాడు. లక్కీని ముందుగా వెళ్లి గుమ్మంలో నిలబడి ఎవరైనా ఉన్నారేమో చూడమన్నాడు. లక్కీ అటువెళుతూండగానే 'చూడు, ఈ అర్థరాత్రివేళ ఎవరొచ్చారో' అని వినబడింది. అలా అన్నది చెత్తడబ్బాలో నివాసం ఏర్పరచుకున్న మూషికద్వయం! జాన్ ఆపరేషన్ చేసి ప్రాణం పోసాక ఎప్పటిలాగానే ఆ డబ్బాలో ఆడుకుంటూ, పోట్లాడుకుంటూ బతికేస్తున్నాయి.

లక్కీ సిగ్నల్ ఇవ్వడంతో పులిని లోపలికి వెంటబెట్టుకుని వచ్చాడు జాన్. 'లక్కీ నువ్విక్కడ గుమ్మంలోనే కాపలా ఉండు. ఎవరైనా రాకుండా చూడు. లేకపోతే పులిని చూసి హడిలిఛస్తారు. ఇదిగో ఎలకలూ, మీరు కాస్త లక్కీకి సాయపడండి.' అని హుకుం జారీ చేసి వెళ్లిపోతున్న జాన్‌ని ఎదిరించాయి ఎలుకలు.



"ఇదిగో, మేమేమన్నా నీ పనివాళ్లనుకున్నామా? తెగ ఆర్డర్లేసేస్తున్నావ్!"

"వారినీ, నీ ప్రాణం కాపాడిన విషయం అప్పుడే మర్చిపోయావా!?" జంతువులు విశ్వాసానికి ప్రతిరూపాలని చిన్నప్పుడు చెప్పిన పాఠాలు మర్చిపోని జాన్ అడిగాడు.

"చాల్లేవయ్యా, అదెప్పుడో పరగడుపై పోయింది. పాతపేపరు పట్టుకు వేళ్లాడకు. కొత్తన్యూస్ ఏవైనా ఉంటే చెప్పు."

వాటినేమీ అనలేక తనకు తప్పుడు పాఠాలు చెప్పిన పంతులుగారిని తిట్టుకుంటూ జాన్ పులిని ఆపరేషన్ థియేటర్‌వైపుకి నడిపించాడు. లక్కీ మాత్రం గుమ్మం వద్ద కాపలాకి నిలబడింది.

* * *

పులిని తరలించుకుపోయిన 'దొంగాడి'పై సర్కస్‌వాళ్లు ఫిర్యాదు చేయడంతో పోలీసులు వచ్చారు. గుర్తులూ అవీ అడిగి ఊరి పొలిమేరలు కట్టుదిట్టం చేయమని వాకీటాకీలో అందర్నీ హెచ్చరించసాగారు. ఈ హడావుడి అంతా చూసి పెంటిపావురం మొగుణ్ని రెచ్చగొట్టింది - 'పాపం ఆ డాక్టరు మనకంత సహాయం చేశాడు కదా, ఆయన్నంతా దొంగాడు దొంగాడు అంటూ వుంటే కదలకుండా మెదలకుండా కూర్చున్నావేమిటి? కదులు, రెక్కాడించు' అంది. 'చూస్కో నా తడాఖా, వెళ్లి డాక్టరుగారికి సహాయంగా మనవాళ్లందరినీ మళ్లించుకొస్తా' అంటూ ఊళ్లో ఉన్న జంతుజాలానికి ఉప్పందించడానికి రివ్వున ఎగిరింది మగపావురం.

* * *

ఇటు రోనీ బాత్‌రూమ్ లోంచి బయటపడి ఒళ్లు ఆరబెట్టుకోవడం ఎలాగా అని చూస్తోంది. వాష్‌బేసిన పక్కన చేతులు ఆరబెట్టుకునే డ్రెయర్ ఒకటి కనబడింది. దానికింద కాస్సేపు నిలబడింది. హమ్మయ్య అనుకుంది కానీ ప్రాణం కుదుటబడినట్లు అనిపించలేదు. వెతుక్కుంటూ వెళ్లడంలో పార్టీ జరుగుతున్న హాలుకి అటువైపు ఉన్న క్లినిక్‌కు చేరింది. అక్కడ రక్తపరీక్షలు అవీ చేసే సామగ్రి కనబడింది. ఓ స్విచ్చి నొక్కితే అది అటూ ఇటూ ఊగుతోంది. హాయిగా దానిలో కూచుని ఉయ్యాల లూగుతూ పాటలు పాడుకోసాగింది.



* * *

ఇక్కడ పార్టీ జోరుగా సాగుతోంది. డాక్టరు జీన్ అతిథులతో కబుర్లు చెబుతున్నాడు. 'నిజానికి పేషంట్స్‌తో పర్సనల్ రిలేషన్‌షిప్ మేన్‌టేన్ చేయడం నాకు చాలా ఇష్టం' అంటూ ఏదో అంటూంటే మార్క్ అటువచ్చాడు. ఇలాటి ఆదర్శాలు కూడుపెట్టవని మార్క్‌కు గట్టినమ్మకం. అసలు జాన్ ఎక్కడకు పోయాడో తెలియక తను అదుర్దా పడుతూంటే అదేమీ పట్టకుండా జీన్ ఈ ఆదర్శాలు వల్లించడం అతన్ని మండించింది. "అవునవును, పేషెంట్లను స్వంతవాళ్లగా చూసుకుంటాం కాబట్టి ఫీజు కూడా అడగం." అని జీన్‌ని వెక్కిరించాడు.

అతిథుల ఎదుట అలా అవమానించడంతో జీన్‌కు కోపం వచ్చింది. ఈ మార్క్‌కు బుద్ధి చెప్పాలి అనుకుని పక్కగదిలోకి వెళ్లి తలుపుపక్కన నిలుచున్నాడు. మార్క్ అతిథితో మాట్లాడుతూ ఆ గదిలోకి వస్తూండగా వాళ్లను చూడనట్టు తలుపు గట్టిగా తోశాడు. దెబ్బకి మార్క్ ముక్కు బద్దలైంది. 'బాబోయ్' అని అరిచాడు ముక్కు పట్టుకుని. అందరూ చుట్టూ మూగారు.



జీన్ ఏమీ తెలియనట్టు 'ఏమైంది, ఏమైంది' అన్నాడు. మార్క్ మండిపడుతూ 'ముక్కు చితక్కొట్టేవ్, కాస్త చూసుకుని తలుపు తోయద్దూ' అని అరిచాడు. 'అబ్బే నేనన్నమ్మను, ఏదీ చూడనీ' అంటూ జీన్ మార్క్ ముక్కు పట్టుకుని గట్టిగా నొక్కాడు. 'బాబోయ్' అని బ్రహ్మాండం బద్దలయేటట్టు అరిచాడు మార్క్. 'నిజమేనండోయ్, నేనతన్ని ముక్కు విరక్కొట్టినట్టే ఉంది.' అంటూ డిక్లేర్ చేశాడు జీన్.

'నొప్పితో ఛస్తుంటే నీ ప్రకటనలొకటా?' అన్నాడు మార్క్ రక్తం ఓడుతున్న ముక్కు తుడుచుకుంటూ.

## చిత్ర విశేషాలు



**జాన్** మనసు మార్చిన చిన్న కూతురు మాయా పాత్ర ధరించిన కైలా ప్రాట్ తొలుతలో టీవీ యాడ్స్‌లో నటించేది. 1986 సెప్టెంబరు 16 న లాస్ ఏంజిలిస్‌లో జన్మించిన కైలా 1995 నాటికే టీవీ స్టార్‌గా ఎదిగింది. 'ది బేబీ సిట్టర్స్ క్లబ్', 'బామీస్ గ్రేట్ ఎడ్వెంచర్' వంటి చిత్రాలతో బాటు 'స్మార్ట్ గై' టీవీ సీరీస్‌లో నటించి ఈ సినిమాలో ప్రాధాన్యత కలిగిన మాయా డూలిటిల్ పాత్రను సంపాదించుకుంది. ఈ సినిమా తర్వాత కూడా టీవీలో నటించింది. 'లవ్ అండ్ బాస్కెట్‌బాల్' (2000) 'ఒన్ ఆన్ వన్' (2000) సినిమాలలో నటించాక డాక్టర్ డూలిటిల్ - 2 (2001)లో మళ్లీ మాయా పాత్ర నటించింది. ఆమె నటించిన 'సీట్ ఫిల్లర్' సినిమా ఈ ఏడాది రిలీజయ్యింది. 'ఫాట్ ఆల్బర్ట్' అనే మరో సినిమా తయారీలో ఉంది. ప్రస్తుతం ప్రతిష్ఠాత్మకమైన హేమిల్టన్ ఎకాడెమీ ఆఫ్ మ్యూజిక్ లో తర్ఫీదు పొందుతోంది. ఇంకో రెండు నెలల్లో 18 ఏళ్లు నిండబోతున్న కైలా ప్రాట్ తాజా ఫోటో ఇదిగో.

జీన్ 'అవునవును, నువ్వు తలుపులోంచి దర్జాగా నడుచుకుంటూ జీన్ 'అవునవును, నువ్వు తలుపులోంచి దర్జాగా నడుచుకుంటూ వెళ్లిపోదామనుకుంటే ఏమవుతుంది? పద, పద ఎముకేమైనా విరిగిందేమో ఎక్స్‌రే తీసి చూద్దాం' అంటూ అతన్ని వెంటబెట్టుకుని అటుపక్కనున్న తమ క్లినిక్‌లోకి తీసుకెళ్లాడు.



ఎక్స్‌రే రూములో వాళ్లకి జాన్ కనబడ్డాడు. 'జాన్! నువ్విక్కడున్నావా? మేమంతా నీకోసం వెతుక్కుంటూ ఉంటే...' అంటున్న జీన్ మాటల్ని పట్టించుకోకుండా జాన్ 'నీకేమైంది?' అన్నాడు మార్క్ ముక్కును చూపిస్తూ.

"నేను తలుపులోంచి నడిచివెళదామని ప్రయత్నించాను."

"లేదులే పాపం, నేనే బద్దలుకొట్టాను"

"ఈ టేకోవరు ముహూర్తం బాగాలేనట్టుంది. నేనిక్కడ ఒకరితో చాలా బిజీగా ఉండాల్సి వచ్చింది. మార్క్ చూస్తే పాపం.."

జాన్ మాటలను జీన్ వేరేలా అర్థం చేసుకున్నాడు. గర్ల్‌ఫ్రెండ్ ఎవర్నో క్లినిక్‌కు తీసుకొచ్చాడనుకున్నాడు. 'నో, నో.. జాన్! నువ్వు చేసేది నాకు నచ్చలేదు. మీ ఆవిడ చాలా మంచిది." అంటూండగానే జాన్ వెనక్కాలనుండి జాన్ ఫ్రెండ్.. అదే పులి.. నడిచివచ్చింది.

దెబ్బ తగిలిన మార్క్, తగలని జీన్‌కి అంత దగ్గిరగా పులిని చూడగానే ఒక్కసారిగా దేవుడు గుర్తుకు వచ్చాడు. "దేవుడా!" అని ఒక్కపెట్టున అరిచారు. "ఇట్స్ ఓకే ఫ్రెండ్స్" అని జాన్ హామీ ఇస్తున్నా పుంజాలు తెంపుకుని బయటకు పరిగెట్టారు.



"డాక్టర్లక్కూడా అంత భయమేమిటి బాబూ" అని నుతారంగా విసుక్కుంటూ పులి చతికిలబడింది. "ఈ ఎక్స్‌రేలు చాలించు నాయనా, నిలుచోలేక ఛస్తున్నా" అంటూ నిట్టూర్చింది.

మార్క్ మూర్తీభవించిన ధనపిశాచి. బయటకు పరిగెట్టుకు వచ్చి ఒగరుస్తున్న టైములో, అంత ఎమర్జన్సీలో కూడా అతని బుర్ర పాదరసంలా పనిచేసింది. టేకోవరు విషయంలో తన మాట వినకుండా ఏడిపిస్తున్న జాన్‌ను బ్లాక్‌మెయిల్ చేయడం ఎలానో అతనికి తట్టింది. జీన్ కేసి తిరిగి, "ఓ ఐడియా, జాన్‌కి చెప్పేద్దాం. నీ పులికి ఆపరేషను చేయాలంటే టేకోవరు అగ్రిమెంటు మీద సంతకం పెడితేనే ఒప్పుకుంటాం. లేకపోతే ఒప్పుకోం అందాం. పులిని కాపాడాలనే ఆదుర్దాతో జాన్ కళ్లుమూసుకుని సైన్ చేస్తాడు. మనకు డబ్బొచ్చి పడుతుంది."

మార్క్ డబ్బాశ చూస్తే జీన్ ముందునుండీ ఒళ్లుమంటే! టేకోవరు అగ్రిమెంటుకోసం మార్క్ ఇంత నీచానికి ఒడిగట్టడం అతన్ని మండించింది. మొదటిసారి ముక్కు బద్దలుకొట్టడానికి కాస్త మొహమాట పడ్డాడు కానీ ఈసారి పడలేదు. గుప్పిలి బిగించి మార్కు ముక్కుకు గురిచేసి మార్క్‌టైసన్ లెవెల్లో ఒఖ్ఖ పంచ్ ఇచ్చాడు. ఈ సారి ఏ తలుపులూ అడ్డులేవు కాబట్టి మార్క్ తక్షణం మూర్ఛపోయాడు.



దయార్ద్రహృదయుడైన జీన్ జాన్‌కి సహాయంపడ దలచుకున్నాడు. ఎగ్రిమెంటు తాలూకు పార్టీ గురించి పట్టించుకోకుండా పులిని రక్షించే కార్యక్రమంలో చేయికలిపాడు. జాన్ పులి ఎక్స్‌రే చూస్తూ ఉంటే తనూ తోడు వెళ్లి చూడబోయాడు.

"కాస్త ఎడమవైపుకి జరిగినట్టుంది.." అన్నాడు జాన్ ఎక్స్‌రే చూస్తూ.

"కానీ జాన్, ఇది పట్టుకుని పులికి ఆపరేషన్ చేయడం సరైన పద్ధతి కాదు. రోగలక్షణాలు తెలియకుండా జస్ట్ ఎక్స్‌రే.."

"తలనొప్పి, డబుల్ విజన్ ఉన్నాయని పులి నాతో చెప్పింది.."అన్నాడు జాన్ సీరియస్‌గా.

జీన్ నవ్వేశాడు. "చూడు జాన్, నేను నీకెప్పుడూ సపోర్టుగా నిలబడ్డాను. అలా అని నువ్విలాటి జోకులు వేస్తే మాత్రం నేన్నమ్మను. పులి నీకు స్వయంగా రోగలక్షణాలు చెప్పడమేమిటి..?"

పని జరక్కుండా కుశంకలు లేవనెత్తుతున్న జీన్ ధోరణి చూసి పులికి ఒళ్లు మండింది, "ఏయ్" అని గుర్రుమంది.

దెబ్బకి జీన్‌కి భయం వేసింది. అవతలివైపుకి జారుకున్నాడు.

"ఏదో ఒకటి త్వరగా చేయ్ డాక్టర్" అంది పులి బ్రతిమాలుతూ.

జాన్ జీన్ కేసి చూశాడు. "మనం తక్షణం ఆపరేషన్ థియేటరుకి పులిని తీసుకువెళ్లాలి." అన్నాడు.

"ఆపరేషన్ థియేటరుకి వెళ్లాలంటే పార్టీ జరుగుతున్న హాలు దాటుకుని వెళ్లాలి. అక్కడ కుప్పలు తిప్పలుగా జనం ఉన్నారు. పులిని వెంటేసుకుని వెళ్లమంటే అందరికీ గుండాగి పోతుంది. పులిని పక్కకుబెట్టి వాళ్లందరికీ ఆపరేషన్ చేయవలసి వస్తుంది." అన్నాడు జీన్ సాధ్యాసాధ్యాలు బేరీజు వేస్తూ.

జాన్‌కి హఠాత్తుగా ఓ ఐడియా వచ్చింది!

* * *

## చిత్ర విశేషాలు

జాన్ పెద్దకూతురు పేప్రికా పాత్ర ధరించిన రావెన్ సైమోన్ కూడా టీవీ స్టారే. మూడేళ్ల వయసులోనే 'కాస్‌బీ షో' ద్వారా టీవీ ప్రేక్షకుల హృదయాలను గెలుచుకుంది. అప్పటినుంచి ఆమె వెనుదిరిగి చూడలేదు. 'హేంగింగ్ విత్ మిస్టర్ కూపర్' అనే టీవీ షో నాలుగేళ్లు నడిచింది. 1994లో విడుదలయిన 'ది లిటిల్ రాస్కెల్స్'లో పెద్దతెర ప్రేక్షకులను కూడా ఆకట్టుకుంది. డాక్టర్ డూలిటిల్ రెండు భాగాలలోనూ నటించింది. 'దట్స్ సో రావెన్ (2002) టీవీ సీరీస్, సినిమాలతో బాటు గాయనిగా, మోడల్‌గా కూడా రాణిస్తోంది. 'ఏ మదర్స్ ప్రేయర్' మ్యూజికల్ ప్రొడక్షన్‌తో దేశమంతా పర్యటించింది. ఎన్ సింక్ బ్యాండ్‌తో కలిపి పాడుతోంది. వీటన్నితోబాటు అట్లాంటాలో హై స్కూలు చదువు కొనసాగిస్తోంది. అట్లాంటా 1985 డిసెంబరు 10 నాడు పుట్టిన రావెన్ తాజా ఫోటో ఇది.



పార్టీ జరుగుతున్న హాలులోకి జాన్, జీన్ ఓ స్ట్రెచర్ తోసుకుంటూ వచ్చారు. స్ట్రెచర్ పైన స్పృహతప్పి పడివున్న మార్క్ ఉన్నాడు. హాలు లోకి రాగానే జాన్ "లేడీస్ అండ్ జెంటిల్‌మెన్, కాస్త ఎమర్జన్సీ వచ్చిపడింది. దారి వదిలిపెడితే మేము ఆపరేషను థియేటరు కెళ్లి.."



టేకోవరుకై వచ్చిన పెద్దాయన మిస్టర్ కేలోవే జాన్‌ను చూస్తూనే పరిగెట్టుకు వచ్చాడు. "హమ్మయ్య వచ్చేశారు కదా, రండి మనం ఎనౌన్స్ చేసేద్దాం" అని జాన్ భుజం పట్టుకున్నాడు.

"అయ్యో, ఇప్పుడా? మా మార్క్ ముక్కు బద్దలయింది. మీరు కాస్త ఆగితే.." అన్నాడు జాన్ ప్రాధేయపడుతూ. మార్క్ ముక్కు గురించే జాన్ జాలిపడుతున్నాడని ఎవరైనా అనుకుంటూ ఉంటే మనం వారిపై జాలివడాల్సిందే! క్రిందదాకా వేళ్లాడుతూన్న ఆ స్ట్రెచర్ దుప్పటి క్రింద వాళ్లు పులిని దాచారు. దానికి త్వరగా ఆపరేషన్ చేసి పంపించాలన్న తాపత్రయం అతనిది.



తెరవెనుక చిదంబర రహస్యం తెలియని కేలోవే "నేను ఆగగలను, మార్క్ ముక్కూ ఆగగలదు. కానీ ప్రెస్‌వాళ్లు ఆగరే.. వేరేచోటికి వెళ్లాలట. అందువల్ల ఈ ప్రకటన కాస్తా కానిచ్చేస్తే.." అంటూ వద్దంటున్నా వినకుండా వాళ్లను వేదిక మీదకు లాక్కెళ్లబోయాడు. అంతసేపూ కబురూ కాకరకాయా లేకుండా కనబడకుండా పోయినందుకు కళ్లతోనే కారాలూ, మిరియాలూ నూరే లీసా ప్రయత్నాలను కళ్లతోనే వారిస్తూ, చేతులు జోడించి బ్రతిమాలుకుంటూ జాన్ వేదిక ఎక్కి కేలోవే పక్కన నిలబడ్డాడు. కేలోవే గబగబా ఉపన్యాసం మొదలుపెట్టేశాడు -



"సోదరీ సోదరీమణులారా, ఇంతసేపు ఓపిగ్గా ఉన్నందుకు కృతజ్ఞతలు. ఇటీవలి కాలంలో వైద్యం అనేది కేవలం సేవాదృక్పథంతోనే కాక, వ్యాపారపరమైన కోణంలో కూడా చూడవలసిన అగత్యం.."

జాన్ దృష్టి ఈ పెద్దాయన పెద్ద ఉపన్యాసం మీద లేదు. స్ట్రెచర్ దుప్పటికింద కదలికలపైననే ఉంది అతని చూపు. స్ట్రెచర్ నెమ్మదిగా కదులుతోంది. అతను భయపడినట్టుగానే పులి దుప్పటి కన్నాలలోంచి బయటకు తొంగి చూసింది.



ఉయ్యాలలూగాక రోనీకి ఆకలి మరింత పెరిగింది. కిచెన్ అన్వేషణ వదిలిపెట్టి పార్టీ జరిగే హాలుకి వచ్చింది. అక్కడ డిన్నర్ ఏర్పాట్లలో భాగంగా టేబుల్ మీద బోల్డు పదార్థాలు కనబడ్డాయి. నోరూరి 'హా, హా, ఎన్ని తినుబండారాలో, ఇవెల్ల నాకే చెల్ల' అనుకుంటూ వాటిని కబళించడం మొదలుపెట్టింది. దుప్పటిలోంచి పులి కంటబడ్డ దృశ్యం ఇదే! పులికీ నోరూరింది - గిన్నెలను చూసి కాదు, గినీపిగ్‌ను చూసి!



"ఆహా తాజాగా ఉంది." అని మెచ్చుకుంది. ఆ కామెంటు విని రోనీ తలెత్తి చూసింది. "అక్కడాగు, బయటకొస్తే మర్యాద దక్కదు" అంది బింకంగా.

ఎంత సర్కసు పులయినా ఈ బెదిరింపులకు లొంగే రకం కాదది. జాన్ మాటలు విస్మరించి, స్ట్రెచర్ కిందనుండి ఠీవిగా బయటకు అడుగుపెట్టింది. రోనీ టేబుల్ కేసి తన ప్రస్థానం సాగించింది.



అంతే! మరుక్షణంలో అక్కడంతా కోలహలం, కల్లోలం. ప్రజలు కకావికలై పరుగులు పెట్టారు. అరుపులు, కేకలం మధ్య పెద్దాయన ఉపన్యాసం వినేవారు లేకపోయారు. సాక్షాత్తూ అడివిజంతువు హాల్లో విహరిస్తూంటే ఈయన అరణ్యరోదన వినేవాడెవడు?



(సశేషం)




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# చక్రపాణి బాణి



**కు**రుక్షేత్రంలో విజయుడికి ఒకడే సారథి - చక్రపాణి ! 'విజయా'కి ఇద్దరు సారథులు. అందులో ఒకరు చక్రపాణి. నిర్మాణ వ్యవహారంలో - కథా నిర్ణయం వగైరాలు చక్రపాణివి. పరిశుభ్రమైన హాస్యం, పరిశుద్ధమైన సన్నివేశాలూ పండించడంలో-ఆయనది చక్ర 'బాణి'. అందర్నీ నవ్విస్తారు గాని, ఆయన నవ్వక పోవడం కూడా ఆయన బాణియే. చక్రపాణి గారిది నవ్వుతున్నదో, కనీసం చిరునవ్వుతున్నదో- ఒక్క ఫోటో అయినా దొరుకుతుందేమోనని వెతికిన వాళ్లకి నిస్పృహే మిగిలేది. ఆయన మాట తీరు కొట్టినట్టుంటుంది - అవగాహన, ఆలోచనా ఆకాశమంత విశాలమైనా.

నరసరాజుగారు చెబుతూ వుంటారు :

'రాము' సినిమాని ఏవియమ్ వాళ్లు తీస్తున్నారు. అంతకు ముందు అది తమిళంలో వచ్చింది. ఇందులో జెమిని గణేశన్ అయితే, తెలుగులో



ఎన్.టి.రామారావు. చక్రపాణిగారు నరసరాజుగారితో అన్నారుట- "రామారావు బాగుండడు. ఆ వేషం ఏడుపుగొట్టు వేషం. రామారావు ఏడిస్తే బాగుండదు, ఎవరూ చూడరు. ఆ సినిమా వద్దని చెప్పండి, లేదా ఇంకెవర్నయినా వెయ్యమనండి" అని.

నరసరాజుగారు వెళ్లి ఆ మాట చెప్పగలరా? చెబితే మాత్రం వాళ్లు వింటారా? ఆ సినిమా డిస్ట్రిబ్యూటరు పూర్ణచంద్రరావుగారితోనూ చెప్పారుట-చక్రపాణి. ఆయన నమ్మకం ఆ సినిమా జనం మెచ్చుకోరని.

అయితే, "రాము" విడుదలై విజయవంతంగా నడుస్తుంటే, విజయా పూర్ణచంద్రరావు వచ్చారు. "చక్రపాణిగారూ! సినిమా బావుంది" అన్నారు. సీరియస్‌గా సిగరెట్టు పీలుస్తూ పుస్తకం చదువుకుంటున్న చక్రపాణి -"వూఁ" అన్నారు- తలెత్తకుండానే.

"మీరు 'రాము' సినిమా ఎవరూ చూడరు అన్నారే"

"అన్నాను"

"మరి చూస్తున్నారుగా"

**డీ.**వి. నరసరాజుగారు చెప్పిందింకోటుంది. 'గుండమ్మ కథ'లో యల్.విజయలక్ష్మి డాన్సుంది. అది షూట్ చేసేశారు. అయితే అది ఏ సన్నివేశంలో వస్తుందో ఎవరికీ తెలీదు.

"అసలీ డాన్సెందుకు?" అని డైరెక్టరు అడిగారు.

"చూడ్డానికి" అన్నారు చక్రపాణి.

అదీ సమాధానం. యల్.విజయలక్ష్మి మంచి డాన్సరు గనక, ఆమె సినిమాలో వుంది గనక ఒక డాన్సుంటే బాగుంటుందన్న ఆలోచనతో వెనక ముందులు ఆలోచించకుండా స్టేజి డాన్సు షూట్ చేశారు. సినిమాలో ఎక్కడో దగ్గర ఈ సీక్వెన్స్ జొప్పించవచ్చునని ఆయన ఆలోచన. "నాగేశ్వర్రావు, జమున ప్రేక్షకుల్లో వుండి, చూస్తున్నట్టుగా రెండు మూడు షాట్లు వేద్దాం" అన్నారు చక్రపాణి.

"మరి, వాళ్లని డాన్సుకి రమ్మని అడిగే చిన్నసీను వుండాలి గదా" అని నరసరాజుగారు అడిగితే-

"ఇద్దరూ ముందుసీట్లులో కూచుని చూస్తూంటే రమ్మని పిలిచినట్టు కాదా?" అన్నార్ట చక్రపాణి తాపీమని.



"చూడనీండి. చూస్తున్నారు. నన్నేం చెయ్యమంటా?"

అంతే- అలా వుంటుంది కరుగ్గా. ఆర్గుమెంటుండదు.

"గుండమ్మ కథ" తీస్తున్నప్పుడు -పూర్ణచంద్రరావుగారు' సినిమా రిలీజెప్పుడు చేద్దాం ?" అని అడిగారు.

"పూర్తయిన వెంటనే!"అన్నది చక్రపాణిగారి ముక్తసరి జవాబు.

"అదే-ఎప్పుడో అనుకుంటే - పబ్లిసిటీ మొదలెట్టుకోవాలి గదా, దీపావళికి చేస్తే...." అని పూర్ణచంద్రరావు నసిగారు.

"దీపావళికి కాకపోతే,సంక్రాతికి అవుతుంది -ఏం అవుద్ది? జనం చూడరా? బాగుంటే ఎప్పుడొచ్చినా చూస్తారు"

అంతే! పూర్ణచంద్రరావు మరేం మాట్లాడలేకపోయారు..

'గుండమ్మ కథ' విడుదలైంది. నేను 'ఆంధ్ర జ్యోతి' డైలీలో సమగ్రంగా సమీక్ష రాశాను. ఆ పత్రిక తీసుకెళ్లి పింగళి నాగేంద్రరావు గారికి చూపించాను. ఆయన చదివి,"పేపర్లో మంచి రివ్యూ వచ్చిందదండీ " అన్నారు చక్రపాణితో.

"పేపరు చెప్పేదేంటి- జనం చెబుతున్నారుగా, రివ్యూలు చదివి, జనం సినిమాల కెళ్లరు. సినిమా చూసి, సినిమాలు చూస్తారు!" అన్నారు చక్రపాణి. ఒక్కోసారి ఈ చక్రబాణాలు చురుక్కుమంటాయి, ఇంకోసారి వాడిగా గుచ్చుకుంటాయి.

ఆ సినిమాలోనే సూర్యకాంతం గయ్యాళిదనీ, ఆమెకి బుద్ధి చెప్పాలనీ అన్నది వుంది. "అయితే,మనం ఎక్కడా గయ్యాళితనం చూపించలేదే-ఎస్టాబ్లిష్ చేసి రాయాలి గదా" అని నరసరాజు అడిగితే -

"సూర్యకాంతం వున్న తర్వాత, గయ్యాళికాక ఇంకేం అవుద్ది? వేరే, చూపించాలా?" అని చక్రపాణి అడిగారు. ఆయన విధానం, ఆలోచనా అలా వుంటాయి.

* * *

ఒక సినిమా - "బాగువడాలంటే" (ఆగిపోయింది, పూర్తికాలేదు) అని, నాలుగు రీళ్లయింది. సావిత్రి,నాగేశ్వరరావు నటీనటులు. ఆ నాలుగురీళ్లూ చక్రపాణిగారికి చూపించి, అభిప్రాయం అడిగాడా నిర్మాత. చూసి, చక్రపాణి ఒకేమాట అన్నారు:

"నాలుగురీళ్లూ వాళ్ల ప్రేమించు కోవడం, పాటలు పాడడంతో సరిబెట్టేశావే- ఆళ్లిద్దర్నీ పెట్టుకున్నాక ఆళ్లు ప్రేమికులేనని జనానికి తెలీదా? నాలుగు రీళ్ల ప్రేమ వేస్టు!".

* * *

'విజయచిత్ర'లో నేను వున్నప్పుడు-ఏదో దానికి రమ్మని పిలుస్తూ వుండేవారు. ఒకరోజు వెళ్తే- "పత్రికలో అదేందా బొమ్మ? జ్యోతిలక్ష్మి చీరకట్టులో? అట్టాంటి వెయ్యమాక! జోతిలక్ష్మి

**చ**క్రపాణిగారు సెట్లో లేకుండా షూటింగ్ జరగదు. ఏదో ఓ సలహా ఇస్తూనే వుంటారు, చెబుతూనే వుంటారు. "సి.ఐ.డి" సినిమాలో (చాణక్య దర్శకుడు) వేసిన గుమ్మడిగారు చెప్పారు- ఆయనది, తొలిరోజు షూటింగు. సెట్టుకొచ్చి, చక్రపాణిగారిని సన్నివేశం ఏమిటని, ఏం చెయ్యాలనీ అడిగారు గుమ్మడి.

"ఏం లేదు, నువ్వు ఎక్కడో దేశాలు పట్టేశావు. కొన్నాళ్లకి తిరిగొచ్చావు. నీ భార్య పోద్ది. షాక్ అవుతావు. ఇలాంటి సీనుల్లో నువ్వు చేస్తుంటావే- అట్టాజెయ్యి- అంతే!" అన్నారుట చక్రపాణి.



దాని డాన్సు డ్రస్సులోనే వుండాలి. ఆఁ" అన్నారు. నేను తలపూపి వచ్చేస్తుంటే- "మాట" అన్నారు. తిరిగాను.

"అట్టాగే హీరోయిన్ల బొమ్మలు స్విమ్మింగు డ్రస్సూ, బికినీలూ వెయ్యక. స్విమ్మింగ్ డ్రస్సులో సావిత్రి బొమ్మేస్తే ఎట్టాగుంటుంది? ఛండాలం?" అన్నారు చక్రపాణి చిరాగ్గా ముఖం పెట్టి.

"ఛండాలం" మాట ఎక్కువగా వాడేవారాయన. ఆయన అస్సలు నవ్వరు. అందర్నీ నవ్విస్తారు.

* * *

**చ**క్రపాణిగారు తనమీద తనే జోకులు వేసుకుని, విమర్శించుకోవడం కూడా వుంది. "చంద్రహారం" సినిమా దెబ్బతిన్న తర్వాత-



"ఎందుకు దెబ్బతినదూ? ఎప్పుడూ చూసినా హీరో నిద్దరపోతూంటే-ఎవడు చూస్తాడూ?" అన్నారాయన. "గుణసుందరికథ" తెలుగులో పెద్ద హిట్టయిందని తమిళంలో మళ్లీ తీశారు. చక్రపాణి దర్శకత్వం వహించారు. అది,ఫెడీమని దెబ్బకొట్టింది.

కారణం ఆయనే చెప్పేశారు. తెలుగులో- మూగ,కుంటి,చెవుడూ అన్ని లక్షణాలూ గల వాణ్ణి తెచ్చి రాజు, తన కూతురి కిచ్చి పెళ్ళిచేస్తాడు. కొంత కథ జరిగిన తర్వాత, తెలుస్తుంది-అతనొక రాజ కుమారుడనీ, అతనికి కామరూప విద్య తెలుసునని. అయితే, తమిళంలో అలా కాకుండా - ముందే రాకుమారుణ్ణి చూపించి, అతను అన్ని వైకల్యాలు గలవాడిగా మారి, వెళ్లి రాకుమారిని పెళ్లి చేసుకుంటాడన్నట్టుగా మార్చారు.

"ముందే రాజకుమారుణ్ణి చూపించడంతో సస్పెన్సు పోయింది - జనానికి హీరోయిన్ మీద సింపతీ రాలేదు" అని తీర్మానించుకున్నారు చక్రపాణి. మళ్లీ ఆయనే అంటారు. "ప్రతిదీ సస్పెన్సు సస్పెన్సు అంటాం. ఏం సస్పెన్సు? మొదటి ఆటవరకే గదా, తర్వాత తెలిసిపోదా!" అని.

* * *

"**పా**ండవవనవాసం" సినిమా పూర్తయి పోయిందని వినగానే-దర్శకుడు కామేశ్వరరావు



గారిని వివరాలు అడుగుతూ, "రామారావుకీ, సావిత్రికీ పాటలేదా?" అన్నారు చక్రపాణి.

"లేద"న్నారు దర్శకుడు.

"అదేంది?"

"అంటే, భీముడికీ, ద్రౌపదికీ పాట ఏం బాగుంటుందనీ..."

"అదేంది ఆళ్ల పాడేది? రామారావు,సావిత్రి పాడతారు. అట్టాగనుకోండి" అని ఓ సలహా ఇస్తే ఆ సలహా ప్రకారం ఆలోచిస్తే - ఓ గొప్పపాట పుట్టింది- "హిమగిరి సొగసులు..".

* * *

యన్. పి. బాల సుబ్రహ్మణ్యం 'రాజరాజేశ్వరి కాఫీ క్లబ్' సినిమాలో పాడారు.



"నాపేరు బికారి" అనేపాట. ఆ ఉదంతం బాలు చెబుతూ-

"అప్పుడు నేను సన్నగా పీలగా వుండేవాణ్ణి. ఇలాలేను, పెండ్యాల నాగేశ్వరరావుగారు పాట రిహార్సిల్ చేయించారు. నాలుగురోజుల పాటు రిహార్సిల్సు జరిగితే, చక్రపాణిగారు ఎదురుగానే కూచుని వుండేవారు. మాస్టారు ఒకటిన్నర శ్రుతిలో పాడిస్తున్నారు. పాట మధ్యలో పంచమం వరకూ వెళ్తుంది. ఆ పైకి వెళ్లేసరికి, ఆ శ్రుతి నాకు ఇబ్బందయేది.

శ్రుతి ఒకట్నిర నుంచి ఒకటికి దించమని ఎన్నిసార్లు అడిగినా-"ఏం బాధలేదు బాలూ!...నీ కెందుకూ? బాగనే పాడతావు... నేను పాడిస్తాగా" అంటూ వచ్చారు. రికార్డింగు దగ్గర కొస్తోంది. అప్పుడు కూడా అడిగాను-శ్రుతి తగ్గించేలా చూడమని. ఆర్కెస్ట్రా వాళ్లకి కూడా అదే శ్రుతిలో రిహార్సల్సు చేయించేస్తున్నారు. నా అభ్యర్థన పెండ్యాలగారు వినకపోతే-నాలుగు రోజుల్నుంచి నా అవస్థ చూస్తున్న చక్రపాణిగారు అన్నారు;

"పైన పాడవలని వచ్చినప్పుడు అవస్థపడుతున్నాడుగా... నాలుగు రోజుల్నుంచీ చూస్తున్నాను. ఇలాగయితే రికార్డింగు వరకూ వుంటాడో, ఎగిరిపోతాడో చూడు నాగేశ్వర్రావు!" (సన్నగా వుండేవాణ్ణి కదా!)

ఆ మాటకి అందరం విరగబడి ఒకటే నవ్వు."

* * *

ఎన్.టి.ఆర్. 'దానవీరశూరకర్ణ' ఆరంభిస్తూ చక్రపాణిగారికి చెప్పారు. "అందులో నేనే కృష్ణుడు, కర్ణుడు, దుర్యోధనుడూ మూడూ వెయ్యాలనుకుంటున్నాను"అని తన పాత్రలు కూడా ప్రకటించారు, "దర్శకత్వం నాదే" అన్నారు.

చక్రపాణిగారి ముఖంలో 'రియాక్షన్' లేదు. ఎప్పుడూ వుండదు, దేనికీ వుండదు! డబ్బాలోంచి పొడుగాటి సిగిరెట్టు తీశారు, వెలిగించారు, పీల్చారు, పొగవదిలారు. రామారావుగారు అలా చూస్తున్నారు.

"బానే వుంటుందిలే. మూడు ఏషాలూ బాగానే చేస్తావు. డైరెక్షను కూడా పెట్టుకున్నావు. వూ-" అని ఆగారు.

"అన్నీ చెయ్యగలవులే. కాని, మూడు వేషాలు, ముప్పై వేషాలు నువ్వే ఏసేస్తే చూసిన జనం నువ్వు కక్కూర్తి పడ్డావనుకుంటారేమో అది ఆలోచించు" అన్నారు చక్రపాణి.

ఆయన మాట తీరు తెలిసిన వ్యక్తి గనక, రామారావు ఏమీ అనలేదు. చిరునవ్వు నవ్వి "అలాగే" అన్నారు.

* * *

బాపుగారి తొలిసినిమా, "సాక్షి"పూర్తి కాగానే చక్రపాణిగారికి చూపించారు. రీ రికార్డింగ్ ఇంకా కాలేదు. చక్రపాణిగారితో పాటు కొడవటిగంటి కుటుంబరావుగారు,రమణగారు,బాపుగారూ నేనూ,వున్నాము.

సినిమా పూర్తయింది. ప్రొడక్షన్ థియేటర్ నుంచి బయటకొచ్చాం. చక్రపాణి గారు సిగిరెట్టు వెలిగించారు. నిలబడ్డారు. అందరం నిలబడ్డాం-ఆయన ఏం చెబుతారో వినాలని అందరికీ కుతూహలం.

రెండు నిమిషాలు.. మూడు నిమిషాలు...నిశ్శబ్దంగా నిమిషాలు గడిచిపోతున్నాయి... సిగిరెట్టు పీలుస్తున్నారు.. ఎటో చూస్తున్నారు...

ఇంకో మూడు నిమిషాల తర్వాత -నెమ్మదిగా, నిదానంగా నడుచుకుంటూ వెళ్లిపోయారు. అదేం రియాక్షనో,దానికి అర్థం ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు. అదే, ఎవరికీ అర్థం కాని చక్రపాణి! ■

## సం"గీతా"రహస్యం

'అప్పుచేసి పప్పుకూడు' మ్యూజిక్ రిహార్సల్సు జరుగుతున్నాయి. "సుందరాంగులను చూచిన వేళల కొందరు ముచ్చట పడనేలా, కొందరు పిచ్చను పడనేలా?" అని నాగేంద్రరావుగారు పాట రాశారు. రాజేశ్వరరావు వరస కడుతున్నారు. కాని, చేసిన వరసలు చక్రపాణిగారి కెందుకో ఆనడంలేదు.

"సులువుగా లేదే" అన్నారు. పాడుకోడానికి వీలుగా మాములుగా వుండాలని ఆయన అభిప్రాయం. "మిస్సమ్మలో 'బృందావనమది అందరిదీ' పాట వుంది కదా, ఆ మాటల్లో ఆ దగ్గర్లో వరస చెయ్యి" అన్నారు.

"అదే పద్ధతిలో,దానికి దగ్గరగా వుంటే ఏం బావుంటుంది? ఎవరు చూస్తారు?" అన్నారు రాజేశ్వరరావు.

"ఏం ఎందుకు చూడరంట? అదే రామారావు,అదే సావిత్రి,అదే రేలంగి, అదే ఘంటసాల,అదే బార్టలీ,అదే పింగళి,అదే నువ్వూ-మీ అందర్ని చూసినవాళ్లకి అదే పాట వుంటే ఎందుకు వినరంటా? చచ్చినట్టు వింటారు" అని లా పాయింటు తీశారు చక్రపాణి.

ఇంకెవరూ నోరెత్తలేదు. వరస కలిసింది. అందుకనే,



"సుందరాంగులను" పాట, "బృందావనమది" పాటకి దగ్గర్లో, ఆ నడకలోనే వినిపిస్తుంది. దానికి కారణం అదీ!

- ఆర్కే

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**వి.మంజురాణి, హైదరాబాద్**

ప్ర॥ త్రికాలవేది అంటే ఎవరు ?

జ॥ పొద్దున్న, మధ్యాహ్నం, సాయంత్రం....
ఎండాకాలం, వర్షాకాలం, చలికాలం ఇలా...
మూడు కాలాలూ వేదికలపైకి పిలవకపోయినా హాజరైపోయే
వారిని ప్రస్తుతం 'త్రికాల వేది' అని అంటున్నారు.

**రమణ శాస్త్రి, సంగారెడ్డి**

ప్ర॥ మన దగ్గరున్న కరెన్సీ నోటు దొంగనోటో కాదో ఎలా తెల్సుకోవడం?

జ॥ వెళ్లి పోలీసు పక్కన నిలబడండి. దొంగ నోటయితే గజగజా వణికిపోతుంది.

ప్ర॥ ఓ జంటకి పెళ్లయి ఎన్నేళ్లయిందో ఎలా తెలుసుకోవచ్చు ?

జ॥ నడిచేటప్పుడు వాళ్లమధ్య ఉన్న దూరాన్ని బట్టి

ప్ర॥ నిజం నిష్ఠూరంగా ఉంటుందనేది అనుభవంలోకి వచ్చేదెప్పుడు?

జ॥ అద్దం ముందు నిలబడినప్పుడు

## డబుల్ రోల్




ఆ **కుటి**లుని భృ**కుటి** ముడిపడింది

**కలం** కక్కితే సిరా మర**కలం** టుకుంటాయి

వాడు **పలు** కొం**పలు** కూల్చాడు

నటీ**నటుల** అభినయము ప్రేక్షకులు మెచ్చు**నటుల** నున్నది

**గున్న**మామిడి కొమ్మమీద దాగు**న్న**ది రామ చిలుక

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్,విశాఖపట్నం.**



## ఈ రూటే వేరు




| | | |
|---|---|---|
| ఏజెంట్ | - | ఒకమగాడు |
| సీనియర్ | - | సముద్రం దగ్గర |
| జూనియర్ | - | జంతుప్రదర్శనశాల దగ్గర |
| లక్నో | - | అదృష్టం లేదు |
| గోమతి | - | మతిపోయింది |
| గోపాల్ | - | గోవు యొక్క పాలు |
| మేంగో | - | మనిషి వెళ్లాడు |
| కౌలు | - | ఆవులు |
| సోది | - | అది కాబట్టి |

**-శావాల శ్రీనివాసరావు,విద్యానగర్, ఆముదాల వలస**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| సైదాపురం కిషన్‌లాల్ | - | సైకిల్ |
| లావు సీతాకుమారి | - | లారి |
| కాకర్ల రుచిత | - | కారు |
| బలివాడ చంద్రబోస్ | - | బస్ |

**- రెడ్డి.ఎమ్మె.ఒంగోలు.**

## పేరు - రిపేరు




పల్లకిలో పెళ్లికూతురు-మాయం- పెళ్లికొడుకు-పరుగో పరుగో

**-రెడ్డి ఎమ్మె,ఒంగోలు.**

ఏజంట్ గోపి-లాయర్ విశ్వనాథ్-కెప్టెన్ కృష్ణ- జస్టిస్ చక్రవర్తి-
పెద్దమనుషులు - ఐతే - అందరూ దొంగలే (దొరికితే)

**-యం.శరత్‌కుమార్‌రెడ్డి,నెల్లూరు**

## చిలిపి లిపి



Play 2 - ప్లేటు
Low 2 - లోటు
No 2 - నోటు
See 2 - సీటు

**-వరదా సాయికుమార్,పర్లాకిమిడి.**

## చిలిపి కవిత




మా యింటి ముందున్న మడేలు
బాగా వాయిస్తాడు ఫిడేలు !!
అతని శ్రుతి వింటే చాలు సహకరిస్తాయి
గార్దభాలూ, తోడేళ్ళు,
రాగం ఆలపిస్తే చాలు భూతాలు, ప్రేతాలూ,
వినిపిస్తాయి వెనువెంటనే మృత్యుగీతాలు !
అతని సంగీతం వల్లే
ఇరాన్‌లో భూకంపాలూ !
ఇరాక్‌లో బాంబు పేలుళ్లు !
అంటారు ఇరుగు పొరుగు జనం
వారికేం తెలుసు అతని వల్ల ప్రయోజనం
సరిహద్దుల్లో అతన్ని పెట్టేస్తే కాపలా
శత్రువెవరైనా చచ్చూరుకుంటాడుగా కాలు పెట్టే లోపల !!

**-కూచిపూడి జయచంద్ర.**

## పేరడీ పెరేడ్




అహో సాంద్ర భోజా
వీర తిండిపోతు రాయా
ఉడిపి హోటలు వైభవ నిర్మాణ తేజో విరాజా
ఈ కలశాలలో చిరంజీవివైనావయా
ఇడ్లిపై సాంబారు పోసినాడు
ఇడ్లిపై సాంబారు పోసినాడు
మనవాడు ప్లేటుకే అందాలు తెచ్చినాడు
ఇడ్లిపై సాంబారు పోసినాడు
జీర్ణమ్ము కరువైన వారికైన
జీర్ణమ్ము కరువైన వారికైన
అరిగించి కరిగించి అలరించు రీతిగా
ఇడ్లిపై సాంబారు పోసినాడు
ఒకవైపు ఉగ్రాతలూపు వాసనలు
ఒకపక్క ఉరికించు కేకలూ అరుపులూ
ఒక వంక కనువిందు చేయు సర్వర్లు
షడ్రుచులు ఒలికించు హోటలుకే వచ్చాము
ధనము లేదని నీవు కలత పడవలదు
ధనము లేదని నీవు కలత పడవలదు
నా పర్సు నీదిగా చేసుకుని మింగు
ఇడ్లిపై సాంబారు పోసినాడు
సింగిలిడ్లి పైన సాంబారు పోస్తుంటే
నీరుల్లి ముక్కలు తేలియాడంగా ॥సింగి॥
దంతస్తంభాలకే కదలికల్ కలిగించి
కరకరా పరపరా శబ్దాలు చేయగా
లుంగిముడి వేసుకుని కొత్త ఖాతాలు
లుంగిముడి వేసుకుని కొత్త ఖాతాలు
ఆర్డరివ్వాలని ఆరగించాలని
ఇడ్లిపై సాంబారు పోసినాడు
మనవాడు ప్లేటుకే అందాలు తెచ్చినాడు
ఇడ్లిపై సాంబారు పోసినాడు
దిబ్బట్లు పోయినా పిజ్జాలు వచ్చినా
కాలమే మారినా రుచి చచ్చి పోయినా...
మనుజులే దనుజులై మట్టిచవి చూచినా
ఆ..... ఆ...... ఆ....
చెదరనీ కదలనీ శిల్పమ్మువోలె
నీవు నా హృదయ మందు
నిత్యమై సత్యమై
నిలిచిపుందువు ఇడ్డిలీ!!
నిజము నా జాబిలీ !!!
('మంచిమనసులు' చిత్రంలోని
'శిలలపై శిల్పాలు చెక్కినారు' పాటకు పేరడిగా)

**- రాజా**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| చిత్రం | ధర్మదాత | ఎంగ ఊర్ రాజా |
| రచన | కొసరాజు | కణ్ణదాసన్ |
| సంగీతం | టి.చలపతిరావు | ఎం.ఎస్.విశ్వనాథన్ |
| గానం | ఘంటసాల | టి.ఎం.సౌందరరాజన్ |
| అభినయం | అక్కినేని నాగేశ్వరరావు, అనిత | శివాజీగణేశన్, కనకదుర్గ |

'నడిగర్ తిలకం' (నటతిలకుడు)గా ప్రసిద్ధి గడించిన తమిళ నటులు శివాజీగణేశన్ ద్విపాత్రాభినయాలు, త్రిపాత్రాభినయాలేకాక బహు పాత్రాభినయాలు చేయడంలో రికార్డులు సృష్టించినవారు. కురూపి అయిన తండ్రిగా, ఆ తండ్రిని పోలిన కుమారుడుగా, తండ్రిని పోలని అందగాడుగా-'దైవమగన్' తమిళ చిత్రంలో శివాజీ మూడు పాత్రలు పోషించారు. ఆయన తొమ్మిది పాత్రలు ధరించిన తమిళ చిత్రం 'నవరాత్రి'ని ఆ తర్వాత తెలుగులోనూ, హిందీలోనూ పునర్నిర్మించారు. శివాజీ తండ్రిగానూ, కొడుకుగానూ నటించిన చిత్రాలలో 'ఎంగ ఊర్ రాజా' (మా ఊరి రాజా) ఒకటి.

సత్యానికీ, ధర్మానికీ కట్టుబడిన ధర్మాత్ముడు విధివంచితుడై బికారి అవుతాడు. కన్నబిడ్డలు తనను సరిగా అర్థంచేసుకోకపోయినా చలించక-స్వయంకృషితో తన పంతం నెగ్గించుకొని తొలి వైభవాన్నీ, గౌరవాన్ని దక్కించుకొనే ఆదర్శమూర్తి పాత్రలో శివాజీగణేశన్ ప్రదర్శించిన నటన-ఆయనకు ఎంతో పేరు తెచ్చిపెట్టింది. ఆ ఆదర్శమూర్తికి కుమారుడుగా యువపాత్రనూ పోషించి రెండు పాత్రలనూ విభిన్న రీతులలో ఆవిష్కరించారు శివాజీ.

'ఎంగ ఊర్ రాజా' చిత్రకథను తెలుగులో 'ధర్మదాత'గా నిర్మించారు. ఆ చిత్రంలోని తండ్రీ కొడుకుల విభిన్న పాత్రలను అక్కినేని నాగేశ్వరరావు ఎంతో గొప్పగా పోషించారు.

'ఎంగ ఊర్ రాజా' చిత్రంలో -తన కుమారులు తనను వదిలి వెళ్లిపోయిన సందర్భంలో ఆవేదన, ఆవేశం కట్టలు తెంచుకున్న ఉద్వేగ స్థితిలోని ఆ తండ్రి పాడిన పాట -'యారై నంబి నాన్ పొఱందేన్ పోంగడా పోంగ' (ఎవరిని నమ్ముకొని నేను పుట్టాను-పొండిరా పొండి )అన్నది.

కణ్ణదాసన్ రాసిన ఆ గీతాన్ని ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీత దర్శకత్వంలో టి.ఎం.సౌందరరాజన్ గానం చేశారు. పాట సన్నివేశంలో శివాజీగణేశన్‌తో పాటు ఆయన కుమార్తెగా కనకదుర్గ నటించారు.

కణ్ణన్‌దాసన్ రాసిన ఆ పాట ఇది :

యారైనంబి నాన్ పొఱందేన్
పోంగడా పోంగ -ఎన్
కాలం వెల్లుం వెన్ఱ పిన్నే
వాంగడా వాంగ
కుళత్తిలే తణ్ణీయిల్లే
కొక్కుమిల్లే మీను మిల్లే
పెట్టియిలే పణమిల్లే
పెత్తపుళ్ళే సొంద మిల్లే ॥యారై॥
తెన్నైయైపెత్తా ఇళనీరు
పిళ్ళైయైపెత్తా కణ్ణీరు
పెత్తవన్ మనమే పిత్తమ్మా
పిళ్ళై మనమే కల్లమ్మా
పానైయిలే శోతిరుందా
పూనైగళుం సొందమడా
శోదనైయై పంగు వెచ్చా
సొందమిల్లే బందమిల్లే ॥యారై॥
నెంజమిరుక్కు తుణివాగ
నేరమిరుక్కు తెళివాగ
నినైత్తాల్ ముడిప్పేన్ సరియాగ
నీయార్ నాన్‌యార్ పోడాపో
ఆడియిలే కాత్తడిచ్చా
ఐప్పశియిల్ మళైవరుం
తేడివరుం కాలం వందా
సెల్వమెల్లాం ఓడి వరుం ॥యారై॥



కణ్ణదాసన్‌కు విశేషఖ్యాతి తెచ్చిన గీతాలలో ఈ గీతం స్థానం ప్రత్యేకమైనది. ఆత్మవిశ్వాసంగల ఆ తండ్రి ఈ పాటలో ఏమంటున్నాడో చూద్దాం.

ఎవరిని నమ్ముకొని నేను పుట్టాను
పొండిరా పొండి - నా
కాలం జయిస్తుంది జయించాక
రండిరా రండి
కొలనులో నీరు లేదు
(అందుకే) కొంగలూ లేవు చేపలూ లేవు
పెట్టెలో డబ్బు లేదు
(అందుకే) కన్న బిడ్డలు సొంతం కారు (దూరమయ్యారు)
కొబ్బరి చెట్టును పెంచితే (లేత )నీరు
పిల్లలను కంటే కన్నీరు
కన్నవారి మనసు కలతపడుతుందమ్మా
బిడ్డ మనసు రాయమ్మా
కుండలో కూడుంటే
పిల్లులు కూడా సొంతమేరా
శోధన (వేదన)లను పంపకం చేద్దామంటే
సొంతమూ లేదు బంధమూ లేదు ॥ఎవరిని॥
గుండె ఉన్నది నిబ్బరంగా
కాలం(గడువు)ఉన్నది స్పష్టంగా
అనుకొంటే సాధిస్తాను సరిగ్గా
నీవెవరో నేనెవరో పోరా పో
ఆడి (ఆషాఢ/శ్రావణ) మాసంలో గాలివీస్తే
ఇప్పశి(ఆశ్వయుజ) మాసంలో వానవస్తుంది
వెదుక్కుంటూ రావలసిన కాలం వస్తే
సంపదలన్నీ పరుగెత్తుకొంటూ వస్తాయి ॥ఎవరిని॥

తనను ధర్మాత్ముడని పొగిడినవారు తెగడినప్పుడు ఆ పెద్దమనిషి చలించలేదు. తన కన్నబిడ్డలు తన ఆశయాన్ని, ఆవేదనను అర్థం చేసుకోలేక పోయారనేసరికి ఆయన నిలువెల్లా చలించిపోయాడు. తాను అనుకొన్నది సాధించే పట్టుదల ఉన్న ఆ మనిషి పిల్లలు దూరమైనా ఒంటరిగా పోరాడడానికి నిశ్చయించాడు.

ఆయనకు కలిమితో పాటు బలిమిపోయింది. కొలనులో నీళ్లుంటే కొంగలూ,చేపలూ ఉంటాయి. పెట్టెలో డబ్బు లేదు కనుక కన్న బిడ్డకు లేని వాడయ్యాడు తాను.

కొబ్బరి చెట్టును నాటి పెంచి ఉంటే నీళ్లయినా ఇచ్చేదట. బిడ్డలను కన్నందుకు తనకు మిగిలింది కన్నీరేనట.

'పెత్తమనం పిత్తు పిళ్ళైమనం కల్లు' అని తమిళంలో సామెత ఒకటుంది. 'కన్నమనసు కలత పడుతుంది. బిడ్డమనసు రాయిలాగా ఉంటుంది' అని దాని తాత్పర్యం. కుండలో కూడుంటే పిల్లులు కూడా బంధుత్వం పాటిస్తాయి. మరి కష్టాలు పంచుకోవలసిన వేళ అయిన వాళ్లు కానరాకుండా పోతార్ట. అయితే తనకు ఎవరి సాయమూ అక్కర లేదంటున్నాడు ఆ తండ్రి. ఎందుకంటే - తన గుండె నిబ్బరంగా ఉంది. తన దీక్ష సాధించడానికి తగిన వ్యవధీ ఉంది. తాను అనుకొన్నది సాధించగలనన్న ధీమా కూడా ఉంది. 'ఆడి' మాసంలో గాలి వీస్తే రోళ్లు కూడా కదిలి పోతాయని తమిళంలో నానుడి ఉంది. కష్టాల గాలి వీచినవేళ కొడుకులు తరిలిపోయారు. ఆ కష్టాల గాలి కలకాలం ఉండదు. కొన్నాళ్లకు ఇప్పటిలో వానపడుతుంది. ఆ వాన పడ్డాక కాలం కలిసి వస్తుంది. ఆ కాలం వెదుక్కొంటూ వచ్చే సరికి సంపదలూ పరుగెత్తుకొంటూ వస్తాయి.

'సెల్వం' అంటే సంపద అనీ, బిడ్డ అనీ చెప్పుకోవచ్చు. కలిసివచ్చే నాటికి కలిమితో బాటు కన్న బిడ్డలూ తిరిగి వస్తారని ధ్వని.

ఈ పాట సన్నివేశంలో 'ధర్మదాత'చిత్రంలో 'ఎవ్వడి కోసం ఎవడున్నాడు' పాట ఉంది. పాటను రాసిన వారు కొసరాజు. పాటకు సంగీతం సమకూర్చిన వారు టి.చలపతిరావు. పాట పాడినవారు ఘంటసాల. సన్నివేశంలో అక్కినేని నాగేశ్వరరావుతో బాటు ఆయన కుమార్తెగా నటించిన అనిత కూడా కనిపిస్తారు.

తమిళ గీతం - తెలుగుపాటకు సంగీత సాహిత్యాల పరంగా స్ఫూర్తి నిచ్చిందని మాత్రం చెప్పుకోవాలి. ఎందుకంటే **తెలుగు పాట వాణీ, బాణీ రెండూ దాదాపు స్వతంత్రాలే**. తమిళగీతంలో సంభాషణలు లేవు. తెలుగు పాటలో, పాట మధ్య ఘంటసాల సంభాషణలూ పలికారు. సౌందరరాజన్‌కు 'యారై నంబి' పాట ఎంతో పేరు తెచ్చి పెట్టింది. పోల్చిచూస్తే - ఘంటసాల పాడిన పాట మరింత ప్రత్యేకంగా కనిపిస్తుంది.

తమిళగీతం పల్లవి వరసను మాత్రం తెలుగుపాట కొంతవరకు అనుసరించింది. తమిళ గీతంలో లేని సంభాషణల వల్ల-తెలుగు పాట ప్రత్యేకంగా వినిపిస్తుంది. తమిళగీతం పల్లవిలోనే 'ఎవరిని నమ్ముకొని నేను పుట్టాను' అని ఉంటే తెలుగు పాటలో ఆ అభిప్రాయం చరణంలో 'మిమ్ము నమ్ముకొని పుట్టానా' అనే రూపంలో కనిపిస్తుంది. తెలుగుపాటలో వ్యవహారిక రూపాలతో బాటు 'మిమ్ము', 'ఉద్ధరింతురనుకొన్నానా' వంటి గ్రాంథిక మిశ్రమ రూపాలూ ఉన్నాయి. 'పూజ్యం' అనే మాటకు నేటికీ తమిళ భాషలో 'సున్న' అనే అర్థం ఉన్నా తెలుగువారి వ్యవహారంలో 'సున్న' అనే అర్థంలో 'పూజ్యం' అనే మాటను వాడేవారి సంఖ్య ఇప్పుడు తక్కువ అనే చెప్పాలి.

తమిళగీతంలో కన్నా తెలుగు పాటలో నాయకుడి తత్త్వం స్పష్టంగా తెలుస్తుంది. 'ఒకడికి నే తలవంచనురా బానిసగా జీవించనురా' అన్నప్పుడూ 'మూగకపోరు నే చూడక పోను' అన్నప్పుడూ ఆ పాత్ర ఆత్మవిశ్వాసం ఎంత గొప్పదో తెలుస్తుంది.

'మానాన్న మానాన్న మా బాబే' అనే సంభాషణను నాగేశ్వరరావు గారిలాగా పలకడం ఘంటసాల ప్రత్యేకత.

తమిళగీతంలోలాగానే తెలుగు పాటలోనూ వాన, కాలప్రవాహాన్ని చూపే కాలెండరూ, సైకిల్ చక్రం అన్నీ ఉన్నా ఈ తెలుగుపాట, తెలుగు పాటలాగానే వినిపించడానికి పాటను సృష్టించినవారు, సన్నివేశంలో నటించినవారూ అందరూ అభినందనీయులే.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

'ధర్మదాత' చిత్రంలోని పాట ఇది:

ఎవ్వడికోసం ఎవడున్నాడు
పొండిరా పొండి
నా కాలం కర్మం కలిసొస్తేనే
రండిరా రండి
నా కాలం కర్మం కలిసొస్తేనే
రండిరా రండి ॥ఎవ్వడి॥
ఉన్నవాడిదే రాజ్యమురా
లేని వాడి పని పూజ్యమురా
మనుషులలోన మమతలు లేవు
మంచితనానికి రోజులు కావు ॥మనుషుల॥
అంతా స్వార్థం జగమంతా స్వార్థం ॥ఎవ్వడి॥
ఒకడికి నే తలవంచనురా
బానిసగా జీవించనురా
మిన్ను విరిగి పై పడినా కాని
అవమానాన్ని సహించనురా....
*ఒరే..ఉంటే వేళకు తింటారా
లేకుంటే పస్తులు ఉంటా ఒరేయ్ ఒరేయ్..*
మిమ్ము నమ్ముకొని పుట్టానా
మీరుద్ధరింతురనుకొన్నానా
..పోతున్నారా.....వెళిపోతున్నారా ॥ఎవ్వడి॥
కాలం మారకపోతుందా
కష్టం తీరకపోతుందా
అదృష్టమన్నది ఇంటికి వచ్చి
తలుపులు తట్టకపోతుందా
*అప్పుడు మీరేమంటారు?
మానాన్న .......మానాన్న...మా బాబే....అంటూ*
నీడకు చేరే పక్షుల్లాగా
బెల్లం చుట్టూ ఈగల్లాగా ॥నీడకు॥
హ...మూగక పోరు నే చూడక పోను ॥ఎవ్వడి॥
( * ఈ గుర్తు మధ్య ఉన్నవి వచన రూపంలో ఉన్నాయి)













విజయ, వాహిని, అన్నపూర్ణ, ఎన్.ఎ.టి, ప్రసాద్ ఆర్ట్ సంస్థల్లా సంగీత సాహిత్యాల పరంగా తమ బ్యానర్‌తో ప్రత్యేకమైన ముద్రను సంపాదించుకున్న సంస్థ జగపతి పిక్చర్స్! నిర్మాత వి.బి.రాజేంద్రప్రసాద్ ఈ బ్యానర్‌పై నిర్మించిన తొలి చిత్రం

# అన్నపూర్ణ

ఈ చిత్రం 1960లో విడుదలైంది. అప్పటి నుండి 'ఆస్తిపరులు' చిత్రం వరకు ఆ సంస్థకు వి.మాధుసూదనరావే దర్శకుడు. రాజేంద్రప్రసాద్‌కి, మధుసూధనరావుకి ఇంటిపేరు ఒకటే (వీరమాచనేని)అవటం, ఇద్దరి అత్తవారి ఊళ్ళూ ఒకటే కావటం, ఇరు కుటుంబాలలో ఒకరితో ఒకరికి పరిచయం ఉండటం ఇవన్నీ 'అన్నపూర్ణ' చిత్రం ద్వారా మొదలైన వారి కాంబినేషన్‌కి తొలి కారణాలుగా తోడ్పడ్డాయి. రాజ్యం పిక్చర్స్ అధినేత్రి, నటి లక్ష్మీరాజ్యం కుటుంబంతో కూడా వి.బి.రాజేంద్రప్రసాద్‌కి పరిచయం బాగా ఉండేది. సంసారం, శ్రీకృష్ణలీలలు, నర్తనశాలవంటి చిత్రాలు నిర్మించిన లక్ష్మీరాజ్యంకి అప్పట్లో సుసర్ల దక్షిణామూర్తి ఆస్థాన సంగీత దర్శకుడు. ఆ పరిచయంతోనే అన్నపూర్ణ చిత్రానికి కూడా సుసర్ల దక్షిణామూర్తినే సంగీత దర్శకునిగా నియమించుకోవటం జరిగింది. కథ, మాటలు సదాశివబ్రహ్మం, ఆరుద్ర కలిసి రాయగా పాటలన్నిటినీ ఆరుద్రే రాశారు. ఆ కాంబినేషన్‌లో వచ్చిన 'అన్నపూర్ణ'చిత్రంలో ప్రజాదరణ పొందిన ఓ నాలుగు పాటలివి.

**తళ తళా మిలమిలా ॥తళ తళా॥**
**పగటిపూట వెన్నెలా..**
**ఎందువలన ఓ లలనా ఎందువలన ॥ఎందువలన॥తళతళా॥**
**చిలకమ్మల కిలకిల చిగురాకుల కలకల**
**గాలివీచి పూలు కురిసి కథలు తెలిపెకోయిల**
**తెలియరాని ఊహలతో తేలిపోవు వేళ**
**చిలిపిగా పావురాలు చూసి నవ్వెనేల ॥తళతళా॥**
**మురిసిపోవు మనసులోనే మధురభావన**
**మరుపురాని మరువలేని ఎవరిదీవెన**
**చిన్ననాటి మా చెలిమి చిగురించెను నేటికి**
**మనసు పయనమైనది మధురమైన చోటుకి ॥తళ తళా॥**

ఈ పాటను సుశీల పాడగా జమునపై చిత్రీకరించారు. ఈ పాటలో 'పగటిపూట వెన్నెల' అనే ప్రయోగాన్ని అప్పటికి ఓకొత్త ఎక్స్‌ప్రెషన్‌లా ఫీలయి అందరూ ప్రశంసించడం జరిగింది. ట్యూన్‌పరంగా దీన్నొక ప్రత్యేకమైన స్వర కల్పనగా చెప్పుకోవాలి. పల్లవిలో తిలంగ్ రాగచ్ఛాయలు కనిపిస్తాయి. చరణాలలో అక్కడక్కడ కైశిక నిషాదం లేని ఖమాచ్ రాగలక్షణాలు, మరికొన్ని చోట్ల ప్రతి మధ్యమంలేని బేహాగ్ రాగచ్ఛాయలు కనిపిస్తాయి. మనోభావమే ప్రధానంగా ట్యూన్ చేసినట్టు అనిపించే ఈ పాటలో జలతరంగిణి వాద్యాన్ని ఉపయోగించుకున్న తీరు మనసులో ముద్రించుకుపోతుంది. సుశీల పాడిన పెక్యులియర్ ట్యూన్స్‌లో



ఈ పాటను ప్రత్యేకంగా చెప్పుకోక తప్పదు. రెండవ చరణం చివర్లో 'చోటుకి' అనే పదం 'అన్నపూర్ణ' పాటల పుస్తకంలోను, ఆరుద్ర 'కొండగాలి తిరిగింది' పుస్తకంలోను 'చోటికి' అనే అచ్చయి ఉంది. కానీ సుశీల మాత్రం 'చోటుకి' అని పాడటాన్ని విన్నవారు గమనించవచ్చు. చరణాల చివర 'నేటికి'-'చోటికి'అనే ప్రయోగం ప్రాస ప్రకారం సరిపోయినా-చోటుకి అనే మార్పు చోటు చేసుకోవటానికి కారకుల్ని మాత్రం అభినందించి తీరాలి. ఎందుకంటే ట్యూన్‌లో 'చోటుకి' అని పాడితేనే బావుంటుంది కాబట్టి. అలాగే ఈ పాట రెండో చరణంలో 'మధురభావన-ఎవరిదీవెన'అనే ప్రయోగాలు తరువాత కాలంలో...అంటే...1974లో 'తులసి' అనే చిత్రంలో 'సెలయేటి గలగల'పాటలో 'అనురాగం ఏదేదో అమర భావన-అది నీవు దయచేసిన గొప్ప దీవెన' అనే చరణాల రూపంలో మరోసారి దర్శనమీయటం గమనార్హం.

అ: మనసేమిటో తెలిసిందిలే
కనుచూపులోనే అనురాగమంతా కనిపించెలే
ఆ: మనసేమిటో తెలిసిందిలే
చిననాటి ఆశలు ఈనాటికైనా నెరవేరెలే
అ: ఓ...ఓ ఓహో.... ఆ: ఓ ఓ ఓ ఓ
అ: ఓ.....మురిపించకే మది పులకించులే
చెలి చిరునవ్వుతో సుధ చిలికించవే
ఆ: ఆ...కనుమూసినా నే కనుతెరిచినా
నీవు కనిపింతువే హాయి కలిగింతువే
అ: ఆ...చిననాటనే ప్రేమ చిగురించెనే
ఓ...చిననాటనే ప్రేమ చిగురించెనే
ఓ..ఓ ....ఓ...ఓ....వికసించినే
ఓ చెలి నీకు బిడియాలు ఇపుడెందుకే
హో చెలి నీకు బిడియాలు ఇపుడెందుకే ॥మన॥
అ: ఓ...ఓ.....హో ఆ: ఓ.....ఓ...ఓ..ఓ
అ: ఓ నను చేరవే చెలి ఇటు చూడవే
నేను నిను వీడనే వీడి మన జాలనే



ఆ: ఆ ...నెలకొంటివి నీవు మదిలోపల
నేడు తొలిప్రేమయే నీకు చెలికానుక
అ: ఆ...కలలన్నియు విరిసి ఫలియించులే
ఓ..కలలన్నియు విరిసి ఫలియించులే
ఓ ఓ ఓ నిజమౌనులే ఓ....చెలి మనకు ఎడబాటు ఇక లేదులే
ఓ...చెలి మనకు ఎడబాటు ఇక లేదులే ॥మన॥

ఈ పాట పి.బి.శ్రీనివాస్,సుశీల పాడగా జగ్గయ్య జమున అభినయించారు. యమన్‌రాగం ఆధారంగా సాగిపోయే ఈ పాటలో పి.బి.శ్రీనివాస్ పాడిన పద్ధతివింటే అప్పట్లో ఆయన్ని 'ప్లేబ్యాక్ స్వీట్ వాయిస్' అని ఎందుకు అనేవారో అర్థం అవుతుంది. పడుకోబోయే ముందు వింటే నిద్రా దేవి ఒడిలోకి అతి సునాయాసంగా చేరవెయ్యగల సుగుణం ఉన్న పాటలలో ఇదొకటి.

కులాసా రాదోయ్ రమ్మంటే
మజాకా కాదోయ్ వలపంటే
ఖలేజా అంటూ ఉండాలోయ్ రాజా
అదుంటే ఎపుడూ నిన్నూ ఎడబాయనోయ్ ॥కులాసా॥
గులాబీ చక్కదనం
జిలేబీ తియ్యదనం
చలాకీ సొగసుల లేతదనం
కలసిన యవ్వనం ॥గులాబీ॥
నీదే చేసెద అందము
నీకూ నాకు బందము
పోనోయ్ పొమ్మంటే ॥నీదే॥ ॥కులాసా॥
ఒయ్యారం ఒలికిస్తా
హుషారు కలిగిస్తా
వరించి నీచే వలపిస్తా
ఓహో అనిపిస్తా
రావాలనుకొని వచ్చావు -ఇక
పోవాలన్న పోనీను-
మనసోయ్ నీవంటే ॥రావా॥
కులాసా రాదోయ్ రమ్మంటే
మజాకా కాదోయ్ వలపంటే
ఖలేజా అంటూ ఉండాలోయ్ రాజా
అదుంటే ఎపుడూ నిన్నూ ఎడబాయనోయ్

ఈ పాటను జిక్కి పాడగా రేలంగి, గిరిజపై చిత్రీకరించారు. శంకరాభరణం రాగ స్వరాలపై నడిచిన ఈ పాటలో అక్కడక్కడ కళ్యాణి రాగచ్ఛాయలు కనిపిస్తే అందుకు గ్రహ భేదం కారణమై ఉండవచ్చు. లబ్ధప్రతిష్టుడు, శబ్దప్రతిష్టుడు అయిన ఆరుద్ర వాడిన పదాలలో తేలికదనం ఈ పాట జనం నోటికి త్వరగా పట్టుబడేందుకు తోడ్పడతాయి.



అ: వగలాడి వయ్యారం భలే జోరు
నీ వయ్యారం ఒలికించు వన్స్‌మోరు
ఆ: అడకండి నాటకాలు అయ్యగారు
మీ వన్స్‌మోరుకు జవాబు మూయినోరు ॥వగ॥
అ: ఆడకు నా ప్రాణంతో చెలగాటకం
అమ్మతోడు నా మాటలు కావు నాటకం ॥ఆడకు॥
ఆ: చాలు చాలు కట్టిబెట్టు ఈ బూటకం
సాగదోయి నా దగ్గర పితలాటకం ॥చాలు॥వగ॥
అ: కోరుకున్నది దిచ్చుటలో కొద్దిగా లేటు
కోపమేల ఇదే కదా నా పొరపాటు ॥కోరు॥
ఆ: పొరపాటులు చేయుటే తమకలవాటు
అయినా ఇమ్మంటారు హృదయంలో చోటు
పొరపాటులు చేయుటే తమకలవాటు
రాజా ఇమ్మంటారు హృదయంలో చోటు ॥వగ॥

ఈ పాటను ఘంటసాల,జిక్కి పాడగా రేలంగి, గిరిజపై చిత్రీకరించారు. నిజానికి ఇదో తమాషా గీతం. ట్యూన్‌లో అంతర్లీనంగా ఉన్న జానపదశైలితో పాటు-జాగ్రత్తగా గమనిస్తే పూర్తిగా నిరాకరించలేని విధంగా దేశ్ రాగచ్ఛాయలు కూడా గోచరిస్తాయి. అటు క్లాస్‌ని ఇటు మాస్ ని సమానంగా ఆకట్టుకున్న ఈ హాస్యగీతం ట్యూన్ పరంగా ఎంతటి విజయాన్ని సాధించిందో ఘంటసాల అభిమానుల్ని కూడా అంతగానే అలరించింది. ఈచిత్రంలో హీరోకి పి.బి.శ్రీనివాస్, హాస్యనటునికి ఘంటసాల పాడటం ఒక విశేషం. అదేమాట నిర్మాత వి.బి.రాజేంద్రప్రసాద్‌గారిని అడిగితే "అప్పట్లో జగ్గయ్య గారికి పి.బి.శ్రీనివాస్ బాగా ఎస్టాబ్లిష్ అయిపోయారు. ఘంటసాల గారి వాయిస్ మిద కూడా ఎంతో అభిమానం ఉండటం చేత ఆయనతో ఒక విషాదగీతం, ఈ హాస్య గీతం పాడించాం. అయినా ఘంటసాల గారు కామెడీ గీతాలు కూడా చక్కగా పాడతారుగా" అని అన్నారు. అది అక్షరాల నిజం. ఈ 'వగలాడి వయ్యారం' పాటలలో మధ్య మధ్య వచ్చే 'ఆ, చాల్లే రాణీ, అద్దిగదీ, వంటి మాటలు దగ్గర రేలంగి పరంగా ఘంటసాల చేసిన 'స్వరకాయ ప్రవేశం' మన చేత ముసిముసి నవ్వులు నవ్విస్తుంది.

### సుశీల, జానకి పాటలతో పాటు భరణి గానం చేసిన

# నాలోన శివుడు కలడు

న్యూస్ ఫ్లాష్

**త**నికెళ్ళభరణి...

రచయితగా గొప్పవాడు....

నటుడిగా ఇంకా గొప్పవాడు...

ఆధ్యాత్మిక సంస్కారం అణువణువునా నింపు కున్న మానవతా వాదిగా మరెంతో,ఇంకెంతో, ఎంతెంతో గొప్పవాడు.

ఇది అతన్నెరిగిన వారూ, అతనితో పరిచయంలేని వారూ కూడా అంగీకరించే విషయం. సినీపరిశ్రమలో ఎవరి గురించైనా రెండు రకాలుగా మాట్లాడే అవకాశం ఉంది కానీ భరణి గురించి మాత్రం మరొక విధంగా అనుకునే ఆస్కారంలేదు-పైన ఉదహరించినట్టు తప్ప !! గతంలో 'ఆట కదురా శివా' అంటూ శివునిపై పద్యాలు రాసి ఎన్నెన్నో దేవాలయాల్లో పాడి ఆత్మానందాన్ని పొందిన భరణి ఇటీవల తను రచించి, గానం చేసిన 'నాలోన శివుడు కలడు' పాటలను ఆడియో క్యాసెట్‌గా తీసుకువచ్చారు. జూలై 11న హరిహర కళాభవన్‌లో ఆ కార్యక్రమం వినూత్నంగా జరిగింది. దర్శకుడు కె.రాఘవేంద్రరావు ఆ ఆడియో క్యాసెట్‌ని ఆవిష్కరించి తొలి కాపీని కళాతపస్వి కె.విశ్వనాథ్‌గారికి అందించారు. యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, జ్యోతిప్రజ్వలనం చేసి ప్రారంభించిన ఆనాటి కార్యక్రమం బ్రహ్మానందం, మల్లికార్జునరావు, జయలలిత వంటి సినీ ప్రముఖులు, కె.వి. రమణాచారి వంటి పుర ప్రముఖులు, వేదపండితులు ఎందరెందరో స్నేహితులు శ్రేయోభిలాషులతో ఆత్మీయ ప్రసంగాలతో 'ముందెన్నడూ ఇటువంటి ఆడియో ఆవిష్కరణ సభను చూడలేదు' అని అందరూ అనుకునే స్థాయిలో జరిగింది.



భరణి, కె.రాఘవేంద్రరావు, కె.విశ్వనాథ్, బాలు, రమణాచారి

నాటక రచయితగా, మాటల రచయితగా, అప్పుడప్పుడు సినిమాల్లో ఒకటీ, అరా పాటలు రాసిన పాటల రచయితగా కొంతమందికే తెలిసిన భరణి ఆధ్యాత్మిక గీత రచయితగా, గాయకుడిగా ఆరోజు సభాసదుల ముందు నిలిచి ప్రతివారి మన్ననలనూ అందుకున్నారు. ఇంతటి సంచలనం సృష్టించేలా ఈ కార్యక్రమం రూపొందించడానికి కొన్నేళ్ళు వెనక్కి వెళితే....

తనలో రగులుతున్న రసస్పర్శకు తగిన అభివ్యక్తీకరణ కోసం రచనతో పాటు గానాన్ని కూడ ఓ మార్గంగా అనుకుని సంగీత దర్శకుడు వీణాపాణిని గురువుగా ఎంచుకున్నారు భరణి. ప్రతిరోజూ ఉదయం నాలుగు గంటలకు లేచి సంగీత సాధన చేసేవారు. అలా నాలుగేళ్ళపాటు నియమనిష్టలతో స్వర దేవతను అర్చించారు. ఆధ్యాత్మిక యోగం స్వర యాగం రూపంలో ఆయనలో అలా కొనసాగి ఓ అమృతభాండాన్ని యజ్ఞఫలంగా అందించింది. ఆ అమృత భాండంలో కొన్ని బిందువులే పాటలుగా రూపుదిద్దుకున్నాయి. ఆ అమృత స్పర్శను గుండెల్లో నింపుకొన్న భరణి గళం విచ్చుకుంది. పి.సుశీల, యస్.జానకి, పార్థసారధి, నిత్యసంతోషిణి వంటి గాయనీ గాయకులతో కలిసి మాత్రమేగాక, విడిగా కూడా గానం చేసింది. ఈ పాటలకు వీణాపాణి సంగీతాన్ని సమకూర్చగా కార్తిక్ పర్యవేక్షణా బాధ్యతలను నిర్వహించారు. దక్షిణామూర్తి వ్యాఖ్యానంతో సహా సుసంపన్నమైన ఈ 'నాలోన శివుడు కలడు' ఆడియో అతి త్వరలో ఓ ప్రముఖ ఆడియో కంపెనీ ద్వారా మార్కెట్లో విడుదల కానుంది. ●

### హైదరాబాద్‌లో బాలుచే

## ఎమ్మెస్ విశ్వనాథన్ గారికి ఘనసన్మానం-సంగీత విభావరి









పెద్దలను, ప్రతిభామూర్తులను, గౌరవించడం ఉత్తమ సంస్కారానికి నిదర్శనం. సినీ సంగీత ప్రపంచంలో ఆ సంస్కారానికి ఓ సదుపమానం యస్.పి.బాలసుబ్రహ్మణ్యం అని కోదండపాణి ఆడియో ల్యాబ్ నిర్మాణం ద్వారా, ఘంటసాల విగ్రహ ప్రతిష్టాపన ద్వారా, తెలుగుసినిమా పాట, లీలా జనార్ధనాష్టకమ్, మన ఘంటసాల వంటి పుస్తకాలు ప్రచురణకు నోచుకునే ఆర్థిక సహాయాన్ని చేయడం వంటి కార్యక్రమాల ద్వారా పలుమార్లు బుజువైంది. అయిదారేళ్ళ క్రితం హైదరాబాద్ లో ఆర్డీ బర్మన్‌కు నివాళిగా 'ఏ శామ్ మన్‌తానీ' అనే సంగీత కార్యక్రమాన్ని భారీ ఎత్తున నిర్వహించి దేశవ్యాప్తంగా ఆర్డీ బర్మన్ పట్ల తన కున్న అభిమానాన్ని తెలిపారాయన. అలాగే రానున్న అగస్టు 22న ఎమ్మెస్ విశ్వనాథన్‌గారిని సన్మానించి వారి ప్రతిభను ఆవిష్కరించగల కొన్న పాటలను స్టేజ్ పై శైలజ, మరికొందరు గాయనీ, గాయకులతో పాడి ఆయనపై తనకు గల గౌరవాభిమానాలు సినీసంగీతాభిమానులందరికీ తెలిసేలా ఓ కార్యక్రమాన్ని శ్రీ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం నిర్వహించనున్నారు. మా టీవీ సహకారంతో జరగబోతున్న ఈ కార్యక్రమంలో ఇళయరాజా, మంగళంపల్లి బాలమురళీకృష్ణ వంటి లివింగ్ లెజెండ్స్ పాల్గొనేట్టు తన వంతు ప్రయత్నాలను శ్రీ బాలు ఎంతో నిజాయితీగా చేస్తున్నారు.

ప్రత్యేక అతిథులుగా
ఇళయరాజా
బాలమురళి

రచన: వేటూరి సుందర రామమూర్తి **1** గానం: యస్.పి.శైలజ

ప : ఈ పాదం ఇలలోన నాట్యవేదం
ఈ పాదం నటరాజుకే ప్రమోదం
కాలగమనాల గమకాల గ్రంథం ॥ఈ పాదం॥
చ : ఈ పాదమే మిన్నాగు తలకు అందం
ఈ పాదమే ఆనాటి బలికి అంతం
తనలోనె గంగమ్మ ఉప్పొంగగా
శిలలోనే ఆ గౌతమే పొంగగా
పాట పాటలో తను చరణమైన వేళా
కావ్యగీతిలో తను పాదమైన వేళా
గానమే తన ప్రాణమై
లయలు హొయలు విరిసే
ఈ పాదం ఇలలోన నాట్యవేదం
ఈ పాదం నటరాజుకే ప్రమోదం
కాలగమనాల గమకాల గ్రంథం
ఈ పాదం ఇలలోన నాట్యవేదం
చ : ఈ పాదమే ఆ సప్తగిరికి శిఖరం
ఈ పాదమే శ్రీ హస్త కమల మధుపం
వాగ్గేయ సాహిత్య సంగీతమై
త్యాగయ్య చిత్తాన శ్రీ చందమై
ఆ పాదమే ఇల అన్నమయ్య పదమై
ఆ పాదమే వరదయ్య నాట్యపథమై
తుంబుర వర నారద
మునులు జనులు కొలిచే
ఈ పాదం ఇలలోన నాట్యవేదం
ఈ పాదం నటరాజుకే ప్రమోదం
కాలగమనాల గమకాల గ్రంథం
ఈ పాదం ఇలలోన నాట్యవేదం

రచన: వేటూరి సుందర రామమూర్తి **2** గానం: యస్. జానకి

ప : గౌరీ శంకర శృంగం
నరనారీ సంగమ రంగం
ఇది నటనకు సోపానం
కళలకు కళ్యాణం ॥గౌరీ శంకర॥
చ : పాదపూజకై మందారమైనా
నాద మధువుతో మంజీరమాయె
దేవతార్చనకు ఏ కీర్తనైనా
జీవితాంతమీ రస నర్తనాయె
వాఙ్మయమే వచనం
ఆంగికమే భువనం ॥వాఙ్మయమే॥
ఆకాశాలలో తారలన్ని
ఆహార్యాలుగ అందుకుంటూ
కైలాసాల శిఖరాగ్రాలందు
కైవల్యాలు చవిచూసే వేళలో ॥గౌరీ శంకర॥
చ : పడమటెండల పారాణి తూలె
సంధ్యారాగాలతో ఊసులాడె
కొలనులు నిదరోవు కార్తీక వేళ
కలువలలో తేనె గిలిగింతలాయె
సకల కళా శిఖరం నర్తనమే మధురం ॥సకలకళా॥
కాశ్మీరాలలో పూల గంధం
కేదారాలలో సస్యగీతం
శివలాస్యాల శృంగారాలెన్నో
అంగాంగాల విరబూసే వేళలో ॥గౌరీశంకర॥

రచన: వేటూరి సుందర రామమూర్తి **3**
గానం: యస్.పి బాల సుబ్రహ్మణ్యం, యస్.జానకి & బృందం

అ: మౌనం గానం మధురం మధురాక్షరం
ఆ: దేహం ప్రాణం కలిపే మంత్రాక్షరం
అ: నయన సంగీతం
ఆ: హృదయ సందేశం
అ: ఈ సాంధ్య దీపాలు వెలిగిన గుడిలో
ఆ: మౌనం గానం మధురం మధురాక్షరం
అ: దేహం ప్రాణం కలిపే మంత్రాక్షరం
ఆ: చైత్ర పవనాలు వీచే
మైత్రి గంధాలు పూసేను
అ: వయసు ముంగిళ్లు తీసి
వలపులే ముగ్గులేసేను
ఆ: సుమవీధుల్లో భ్రమరాలెన్నో
అ: చెలికన్నుల్లో భ్రమలెన్నెన్నో
కో: ఆ... ఆ... ఆ....
ఆ: సాగేనులే శ్రుతిలో కృతిగా ॥మౌనం॥
అ: అరుణ చరణాలలోనే
హృదయ కిరణాలు వెలిగేను
ఆ: ముదిత పాదాల మువ్వే
మువ్వగోపాల పాడేను
అ: అవి మోహాలో మధుదాహాలో
ఆ: చెలి హాసాలో తొలి మాసాలో
కో: ఆ... ఆ... ఆ.....
అ: హంసధ్వని కళలే కనగా ॥మౌనం॥







**రచన: వేటూరి సుందర రామమూర్తి** **4** **గానం: యస్.పి.బాల సుబ్రహ్మణ్యం, యస్.జానకి & బృందం**

బృందం : ఎన్నెల్లో ముత్యమా ఎండల్లో పద్మమా
చీకట్లో దీపమా సిరికే ప్రతిరూపమా
ఏ పేరో ఏ ఊరో చెప్పవమ్మా
తెలుగింటి కలికంటి తేనెలమ్మ
చెప్పవమ్మా తేనెలమ్మా... చెప్పవమ్మా తేనెలమ్మా

అ : మహాకవి గురజాడ మానస పుత్రికవు నీవు
పుత్తడి బొమ్మవా పూర్ణమ్మవా!

ఆ : నా కన్నులు కలువల రేకలని
నా అడుగులు హంసల రాకలని
నా పలుకులు తేనెల వాకలని
తెలిసి తెలిసి ఎంత వగచినా
తాతతోనె ముడిపెట్టారు
తాళితోనె ఉరితీశారు
అమ్మల్లారా అక్కల్లారా ఆకాశంలో ఓ చుక్కల్లారా
నెలకోసారి వస్తూఉన్నా నిండుగ పున్నమినై
మీలోనే జీవిస్తున్నా
పుత్తడిబొమ్మ పూర్ణమ్మనై ...పుత్తడి బొమ్మ పూర్ణమ్మనై

అ : విశ్వనాథుని చేత తొలినాటి కవితవై
విరితేనియలు పొంగు సెలయేటి వనితవై
వెలుగొందు తెలుగు జిలుగుల రాణివి
అవును ! కిన్నెరసానివి

ఆ : తొలుత నా కన్నీరు కాల్వలై పారింది
పిదప అది వాగులై వంకలై పొంగింది
తరగలై నురగలై తరగలే పడగలై
పడగలే అడుగులై అడుగులే మడుగులై
పరుగులెత్తిన దానిని నేను పరువాల దొరసానిని
కొడుకు దశనే దాటి మగడు కాలేని
ఒక పడుచువాడికి
తగని గడుసు ఇల్లాలిని
నేను కిన్నెరసానిని
పెళ్లైన తెలుగు కన్నెల సాటిని
నేను కిన్నెర సానిని పెళ్లైన తెలుగు కన్నెల సాటిని

అ : ఎవ్వరెరుగనిదమ్మ నండూరి ఎంకీ
పూవులా నవ్వేటి తెలుగు పూబంతీ

ఆ : కడవాకైన లేదు తొడిమంత ఎడము
ఎడమెట్టా గుంటాది పిడికెడే నడుము ॥కడవాకైన॥
మబ్బుతెరనే విడిచె వంక జాబిల్లి
ఉబ్బరాల రైకలెబ్బెబ్బరిల్లి

బృందం : అబ్బలాలో....ఏమి నిబ్బరాలో

ఆ : జారుపైటే చాలు జావళీపాట

బృందం : లా లా ల ల లా లా లా

ఆ : నాయుడోరి జాణా నడిచేటి వీణా
వెన్ను తడితే చాలు వెన్నెల్లు కరుగు
గోవు పాదుగుల్లోనా గోదారి పొంగు
ఎన్నెలమ్మని చిలికి ఏడు మల్లెల కొదిగి
తెలుగింట పుట్టింది ఎలుగంటి ఎంకి
తెలుగల్లె ఎదిగింది చిలకంటి ఎంకి
ఎలుగంటి ఎంకి చిలకంటి ఎంకి

బృందం : ఎలుగంటి ఎంకి చిలకంటి ఎంకీ ॥ఎలుగంటి॥

**రచన: వేటూరి సుందర రామమూర్తి** **5** **గానం: యస్.జానకి**

ప : కైలాసంలో తాండవమాడే నటరాజా ఓ నటరాజా
కైలాసంలో తాండవమాడే నటరాజా ఓ నటరాజా
ఎందుకు కళపై కక్ష
నా కెందుకు ఇంతటి శిక్ష ॥ఎందుకు॥ ॥కైలాసంలో॥

చ : నీ పూజకు పుట్టిన కుసుమాన్ని
నీ పేరిట పెట్టిన దీపాన్ని ॥ నీ పూజకు॥
ఎందుకు తుంపేశావు ఎందుకు ఆర్పేశావు ॥ ఎందుకు॥
నీ చరణం శరణం అనుకుంటే
నా చరణం హననం చేశావా ॥ నీ చరణం॥
శంభో హర హర మహదేవా
నీ లయనే నీవుగ ఇస్తావా ॥కైలాసం॥

చ : నీ నటన లేక మాకే ఘటన లేదని
కలలు కనకో ఖండ గమనా
నాట్యరాజైన ఆ నాగరాజుకి లేని
పాదమెందుకు ఫాలనయనా
అంగాంగ చలనాభినయ లయాత్మకమైన
తనువు నా చరణమ్ము కాదా!
ఏక చక్రము మీద లోకాల పయనించు
రవి నాకు శరణమ్ము కాదా
నేను శిలనై పోతే నీ లయకు దిక్కేది
నేను శిథిలమ్మైతే నీ గతికి గతి ఏది?
భూతేశ్వరా! భువనేశ్వరా!
భూతేశ్వరా! భువనేశ్వరా!
హర హరా ! పురహరా!
స్వరహరా !

**రచన: వేటూరి సుందర రామమూర్తి** **6** **గానం: యస్. జానకి**

ప : అందెలు పిలిచిన అలికిడిలో
అణువణువున అలజడులూ
ఎద పద మొకటౌ లాహిరిలో ॥ఎద॥
ఎన్నడు ఎరుగని ఉరవడులు
ఇది నా ప్రియ నర్తన వేళా
తుది లేనిది జీవన హేలా ॥ఇది॥

చ : ఉత్తరాన ఒక ఉరుము ఉరిమినా
ఉలిపి చిలిపి మెరుపాకటి మెరిసినా ॥ఉత్తరాన॥
ఒక కదలిక చిరు మెదలిక
గిలిగింతగ జనియించగా
ఒక కదలిక చిరు మెదలిక
గిలిగింతగ జనియించగా
నాలుగు దిక్కుల నడుమ పుడమి
నా వేదికగా నటన మాడనా ॥నాలుగు॥
అనంత లయతో నిరంత గతితో
జతులు పాడనా ఆడనా ॥ఇది నా ప్రియనర్తన॥

చ : మేఘవీణ చలిచినుకు చిలికినా
మేనులోన చిరు అలలు కదిలినా ॥మేఘవీణ॥
ఒక లహరిక మధు మదనిక
తలవంచగ జనియించగా
ఒక లహరిక మధు మదనిక
తలవంచగ జనియించగా
సుగమనిగమ సుధ ఎడద పొంగగా
వరదలాగ ఉప్పొంగనా ॥సుగమ॥
వరాళి ఎదలో స్వరాల రొదతో
పదము పాడనా ఆడనా ॥ఇది నా ప్రియనర్తన॥

# కథా సంగ్రహం

మే 2, 1981న యాక్సిడెంట్‌కు గురయిన నర్తకి సుధా చంద్రన్ తన కుడి కాలును పోగొట్టుకోవటంతో తనకు ఎంతో ప్రీతిపాత్రమైన నాట్యానికి దూరమయింది. అయితే కాలు పోయిందన్న బాధకన్నా తను నాట్యానికి దూరమైపోతున్నానన్న భావన ఆమెను ఎంతగానో కృంగతీసింది. ఆమె బాధను అర్థం చేసుకున్న జైపూర్‌కు చెందిన డా॥ పి.సి.సేథి ఆమెకు ప్రత్యేకంగా తయారు చేసిన జైపూర్ కాలును అతికించి ఆమె పూర్వంలా నాట్యం చేయగలిగేటట్టు చేయగలిగారు. ఎన్ని బాధలు, ఛీత్కారాలు ఎదురైనప్పటికీ తను అనుకున్న లక్ష్యాన్ని సాధించిన సుధాచంద్రన్ కథే 'మయూరి'. ఓ యదార్థ సంఘటనతో నిర్మితమైన ఈ చిత్రంలోని టైటిల్ పాత్రను సుధాచంద్రన్ తానే స్వయంగా పోషించారు.

వెంకటేశ్వర్లు పెద్ద కుమార్తె మయూరి. ఆమెకు నృత్యం అంటే ప్రాణం. అయితే ఆమె పినతల్లికి మాత్రం మయూరి డ్యాన్స్ నేర్చుకోవటం ఇష్టం లేదు.

తన కాలేజీ స్నేహితుడు మోహన్ ద్వారా మయూరి డ్యాన్స్ స్కూల్‌లో చేరుతుంది. నృత్యం పట్ల తనకున్న జిజ్ఞాసవల్ల తొందరగానే మంచి డ్యాన్సర్‌గా గుర్తింపు తెచ్చుకుంటుంది. మోహన్, మయూరి ఇద్దరూ ప్రేమించుకుంటారు. మయూరి మొదటి నృత్యప్రదర్శన తర్వాత ఆమె పేరు మారుమోగిపోతుంది. మంచి డ్యాన్సర్‌గా విమర్శకుల నుండి సైతం ప్రశంసలు పొందుతుంది.

కానీ విధి తన విషపు కోరలను విసిరింది. యాక్సిడెంట్‌లో మయూరి తన కుడికాలును కోల్పోయింది. అవకాశవాది అయిన ప్రియుడు మోహన్ మొహం చాటేశాడు. మయూరికున్న పేరు ప్రతిష్టలతో ఎదగాలనుకున్న అతను ఇక మయూరి ఏ మాత్రం డ్యాన్స్ చేయలేదని తెలుసుకున్న మరుక్షణం వేరే అమ్మాయితో చెట్టాపట్టాలేసుకుని తిరగడం మొదలెట్టాడు.

మయూరి తమకు ఏ మాత్రం ఉపయోగపడనిదిగా తలచి పినతల్లి ఇంట్లోనుండి వెళ్లగొడుతుంది. వంటవాడు సుబ్బరాజుతో ఇంటినుండి బయటకు వెళ్లిపోతుందామె.

ఒక స్నేహితురాలితో కలిసి ఉంటున్న ఆమె జైపూర్ ఫుట్ తగిలించుకున్న ఓ వ్యక్తిని చూస్తుంది. మయూరి కూడా జైపూర్ వెళ్తుంది. అక్కడ డాక్టర్స్ ఆమెకు ముందుగా నడవడానికి మాత్రమే పనికి వచ్చే పాదాన్ని అతికిస్తారు. అయితే మయూరి తాను డ్యాన్స్ కూడా చేయాలనుకుంటున్న చెప్పడం, దానికై ఆమె పట్టుబట్టడంతో ఆమెకై ప్రత్యేకంగా తయారు చేసిన పాదాన్ని ఆమెకు అమరుస్తారు. ఆ పాదంతో శిక్షణ ప్రారంభించిన ఆమె అతి తక్కువ కాలంలోనే స్టేజ్‌పై ప్రదర్శనలిచ్చే స్థాయికి చేరుతుంది.

ఆమె ఇచ్చిన ఓ ప్రదర్శనను మోహన్, ఆమె తండ్రి చూస్తారు. కష్టకాలంలో ఏ మాత్రం ఆదుకోకుండా సవతి తల్లి ఇంటి నుండి వెళ్లగొట్టినా ఏమీ చేయలేక ఊరుకున్న ఆమె తండ్రి సిగ్గుపడి, ఆమెను ఆశీర్వదించి అక్కడనుండి వెళ్లిపోతాడు. మోహన్ తన అవకాశవాదాన్ని మరోసారి చూపించటానికి ప్రయత్నించి తనను క్షమించమని వేడుకున్నా ఆమె అతని మొఖంమీదనే తలుపులు వేసి తన తిరస్కారం తెలుపుతుంది.

కాళ్లు లేకపోయినా ఒకరిపై ఆధారపడకుండా స్వతంత్రంగా బ్రతకటం తెలుసుకుంటుంది మయూరి. అంతకన్నా ముఖ్యమైనది ఆమె డ్యాన్స్ కూడా చేయగలుగుతోందిప్పుడు. అదే ఆమె సర్వస్వం.....

## తారాగణం

సుధ, శుభాకర్, పి.ఎల్.నారాయణ, నిర్మల, వై.విజయ, పి.ఆర్.వరలక్ష్మి, శ్రీ శైలజ, ఎస్.ఆర్.రాజు, సుమిత్ర, కాకినాడశ్యామల, బేబి వరలక్ష్మి, కె.కె.శర్మ, పొట్టి ప్రసాద్, ఇందిర, జయశీల, మాస్టర్ చక్రవర్తి



సి.హెచ్.రామోజీరావు



సింగీతం శ్రీనివాసరావు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : ఉషాకిరణ్ మూవీస్ యూనిట్ |
| మాటలు | : గణేష్ పాత్రో |
| పాటలు | : వేటూరి సుందరరామమూర్తి |
| సంగీతం | : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం |
| కెమెరా | : హరి అనుమోలు |
| ఆర్ట్ | : భాస్కరరాజు |
| ఎడిటింగ్ | : గౌతంరాజు |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : అట్లూరి రామారావు |
| నిర్మాత | : రామోజీరావు |
| దర్శకత్వం | : సింగీతం శ్రీనివాసరావు |



యస్.పి.బాలసుబ్రహ్మణ్యం



వేటూరి సుందరరామమూర్తి



ఎస్.జానకి



యస్.పి.శైలజ

# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

**స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా**
**వెలారిస్తున్న శాంతాగ్రూప్**
**రథసారథులు**
**తెలుగువారే...!**

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరఫున టీకాల ఉత్పత్తి

అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరఫున పరిశోధన



హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సీన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!
శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva)
Pre-qualified
U.N.Supplier of
Hepatitis-B Vaccine

SHANTHA
BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

